శ్రీ

# కన్యకా [illegible]

వాసవి కన్యక

4831



గ్రంథకర్త:

హరికథకరత్న, కవిభూషణ, విద్వాన్

గట్టె సత్యనారాయణ గుప్త

విజయవాడ

ద్వితీయ ముద్రణము
1956

శ్రీ కృష్ణా ప్రింటింగ్ వర్క్సు,
విజయవాడ - 2.

# విషయసూచిక





మూల్యము
రు 5-0-0

# తెలివిడి

అది తరంగిణి. కల్లోలములతో నల్లకల్లోలమై యుండును. చూపుమేరలో నిశ్చలప్రదేశ ముండదు. అందువలననే పెక్కురు భయపడుచుందురు. కాని యెంత వఱకా తరంగములు? కొంతవఱకే! నావను ధైర్యముగా నడపినచో చలనములేని సముద్రముపై ప్రయాణము చేయవచ్చును.

శ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరీ కథాతరంగిణిపై విమర్శనాతరంగము లనేక విధముల విజృంభించినవి. అనేకములు లేచి యణఁగిపోయినవి. ఆ బహుళతరంగము లను దాటుటకు నాకు సంపూర్ణముగా నలవి గాలేదు. ఆర్యవైశ్యాలంకారులు శ్రీ శ్రీ శ్రీ ఆత్మూరి లక్ష్మీనృసింహ సోమయాజులవారు బహుళ కృషిని జేసి "వైశ్యధర్మప్రకాశిక" యను సంస్కృతగ్రంథమును విలిఖించి ధన్యజీవులై పూజ నీయులైరి. కాని శ్రీవారి గ్రంథముకంటె అధికభాగము ఆర్యవైశ్యులు ఆ కన్యకా పురాణ గ్రంథములనే ఆచరణలో నుంచినారు. కారణము గానము.

స్కాంధపురాణాంతర్గత సనత్సుజాతసంహితలోని దని చెప్పఁబడుచున్న "శ్రీమత్కన్యకాపురాణము" ను, "వాసవీపురాణము" ను, "శ్రీ వాసవీ కన్యకాపురాణము" ను, భాస్కరాచార్య విరచిత "వైశ్యపురాణము" ను వైశ్యులెల్లరును పవిత్ర గ్రంథములుగాఁ బరిగణించుచున్నారు. ఇతర గ్రంథము లెన్ని యున్నను, ఎన్ని భాషలలోనున్నను ఇంచుమించు వాని కనువాదములే. దశహార మహోత్సవములందు ఎంతయో ధనముఁగూడ వ్యయముచేసి ఆ గ్రంథములనే పారాయణమును జేయించుచుందురు. అట్టి గ్రంథములలో నెక్కడఁజూచినను శ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరీమతల్లి వైశ్యాన్వయమునకుఁ జేసిన యుపకార మొక్కటియుఁ గనుపించదు. పై పెచ్చు విచిత్రమైన శాపములును, ఎందుకు నుపయోగపడని ధర్మము లును గాన నగును. గుండెపైఁ జేయివేసికొని "మాతల్లి వాసవీకన్యకామతల్లి యింతటి గొప్ప కృత్యముల నొనరించినది. ధర్మములఁ దెలిపినది. సత్యమును నిలిపినది" అని చెప్పుకొనుట కుపయోగపడని గ్రంథము లుండిననేమి! ఊడిననేమి!

నిజముగా నా గ్రంథములోనున్న కథ జరిగియున్నదా? లేక ఆ పుస్తకము లన్నియుఁ గల్పనామిళితములా? కేవల కల్పితములా? ఆ గాథలే నిజమైనచో శ్రీ కన్యకాపరమేశ్వరిని పూజించుట మిక్కిలి దోషమగును. దేవాలయములలో గావిగ్రహములు లేకుండ చేయుట సముచితమగును. ఆ గాథ లట్లుండుట వలననే ఆర్య వైశ్యుల కభిమానము తగ్గిపోయినది. విపరీతముగా విమర్శనావాతూలములు చెలరేగి నవి. ఇంతవరకును తర్జనభర్జనలు జరుగుచునేయున్నవి.

ఆ గ్రంథస్థవిషయములన్నియు సత్యమైనగాథలు గావు. ఆర్యవైశ్యాన్వయమున కిది పవిత్రచరిత్ర. ఆంధ్రదేశమునకే గాదు, భారతదేశమునకే గాదు ప్రపంచమునకుఁ గూడ ఆదర్శమైన గాథ. రాజ్యములో అధర్మము, అవినీతి, అసత్యము ప్రబలినపుడు ఎదుర్కొనవలసిన పద్ధతులు విపులముగా నీ కథలో గాన నగును. అహింసను నిలుపుటకును, సత్యాగ్రహమును సలుపుటకును ఈ చరిత్ర పునాది యనవచ్చును. మానవ జీవిత లక్ష్యమైన మోక్షసాధమునకు మార్గము లెట్లన్వేషించినది భక్తి, భుక్తి, ముక్తుల నెట్లు పొందఁగలిగినది చూడ మిక్కిలి క్రొంగ్రొత్తగ నుండును. స్వరాజ్య స్థాపనము, కోటలను నిర్మించుకొనుట, వాణిజ్యాభివృద్ధి, సముద్రయానములు, పరిశ్రమల నభివృద్ధిచేయుట, కోట్లకొలఁది ధనమార్జించుట, ధర్మనిరతి, పట్టుదలలు, సంఘములు, సభలు, ఐకమత్యముతో స్వకార్యములు సాధించుకొనుట, మొదలగునవన్నియు నాటి వైశ్యుల ప్రాభవమును చాటుచున్నవి.

నా రచనోద్దేశ్యము :—

వైశ్యులకుఁ గల కళంకరహితమగు కథను బహిరంగపరచుట. అనేకవిషయముల కాధారములు లేకపోయినను కారణానుసారము నిర్ణయమునకు వచ్చుట. నాకు లభించినవఱకు శాసనములను, గ్రంథములను, తాళపత్రములను, శక్త్యనుసారము పరిశోధనను గావించి, యింతవరకు జరిగిన జరుగుచున్న విమర్శనములను పరికించి, నిర్ణయించుకున్న చరిత్రను కావ్యముగా విలిఖించితిని. ఈ కృషిని సుమారు అయిదు వత్సరములుగా సలిపియుంటిని. ఈనాటికి నా భావములకొలఁది పూర్తిగావింపఁ గలిఁగితిని. ఈ పుస్తకము మూఁడు భాగములుగా వ్రాసి యొకే గ్రంథముగా ముద్రణ కిచ్చియుంటిని. (1) కథాసంగ్రహము (వచనము) (2) కావ్యము (పద్యము) (3) గోత్రప్రవరాదికములు. ఈ గ్రంథరచనకు ఐదు వత్సరములు పట్టినది. ఇంతవరకు నెన్ని కాగితములో చినిగినవి. ఎన్ని సభలో జరిగినవి. ఎందరి పండితులవలననో సవరణలు జరిగినవి. ఎన్ని విమర్శనములో పూర్తి అయినవి.

పరిశోధనానంతరము, ఒక నిర్ణయమునకు వచ్చినచరిత్రను ఆర్యవైశ్యమహాసభ తరఫున, కార్యదర్శి గారైన శ్రీ రావుబహద్దర్ తుంపూడి భగవంతంగుప్త గారు నాచే ఒక నాటకమును [వా స వీ వి జ య ము] వ్రాయించి ఆర్యవైశ్య మహాసభచే అచ్చువేయించిరి. ఆ కథనే విపులీకరించి నే నీ గ్రంథమును విరచించితిని. పాఠకులు రాజహంసలై అల్పశక్తికొలఁది వ్రాసిన నా రచనలోని యొప్పులను మాత్రమే గ్రహించి నన్ను దీవింతురుగాక !

ఇట్లు
గట్టు సత్యనారాయణగుప్త.
గ్రంథకర్త.

# కవి పండితుల అభిప్రాయములు.

(శ్రీ యమ్. వి. పాపన్న గుప్తగారు, మదనపల్లి)

తమచే రచింపబడ్డ "వాసవీ చరిత్రము" సమగ్ర సంపూర్ణ సాహిత్య కళావరి పూర్ణశోభితము. శైలి పెద్దన బిల్హణాదుల బోలియున్నది. పాకము ద్రాక్షాపాకము. ఇట్టి గ్రంథ మిదివరకు రచింపబడలేదు. తాము రచించుటలో సాహసమొనర్చి, కథా పరిణామము, శైలి, పాకము, తొణకనీయక చిక్కబట్టిన మీ మృదులహస్తము నేమనవలయునో నాకు పదములు చాలకున్నవి.

(Sd.) యం. వి. పాపన్నగుప్త.

26—7—46.

(శ్రీ కవికేసరి, అద్దేపల్లి సత్యనారాయణగారు, మండపల్లి, కృష్ణా)

అనేకవిధములుగనున్న కన్యకాపురాణములను శాసనాదులను శోధించి నెల్లూరు వి. ఆర్. కాలేజీ హైస్కూలు ఆంధ్రపండితులగు బాలకవి, 'విద్వాన్' గత్తి సత్యనారాయణగుప్తగారీ "వాసవీకన్యక" యను ప్రబంధమును రచించిరి.

దేశభాషాభిమానులెల్లరు కవియొక్క కృషికి తోడ్పడుట విధ్యుక్త ధర్మము.

(Sd.) అద్దేపల్లి సత్యనారాయణ.

15—7—46.

[శ్రీ రావుసాహెబ్, బచ్చు పాపయ్య శ్రేష్ఠిగారు, 9 గోపాలకృష్ణారోడ్, త్యాగరాయ నగర్, మదారాసు]

మహాశయా!

మీ యుత్కృష్ట గ్రంథమును నే నేమని కొనియాడగలను! ప్రాతఃప్రతి చేత తీసికొని చదువుచు నే ననుభవించిన యానందమును చెప్పజాలను. వాసవాంబ జననాదులనుగురించియు, వైశ్యకుటుంబముల గోత్రములు, ఆది ఋషులు మొదలగు

[illegible] గురించియు, మీరుచేసిన పరిశ్రమ మెంతయు శ్లాఘనీయము. వేయేల, [illegible]త్ర్యాత్రిక పరిశోధనము మీవలె యొనర్చినవారిని నేను చూచియుండలేదు.

నా కృతజ్ఞతా పూర్వకాభివందనములను స్వీకరింపవేడెద. తమ "కన్యకాపురాణము" [illegible]త్యాభివృద్ధికి తోడ్పడుచు ఆచంద్రతారార్కము వెలయుగాక!

ఇట్లు,

(Sd.) బచ్చు పాపయ్య శ్రేష్ఠి.

9—8—46.

[శ్రీ అనుమాలశెట్టి వెంకటేశ్వర్లుగారు—కావలి]

ప్రకటించినాఁడు వి- స్పష్టమ్ముగా నాది, వాసవీకథ మృదు - వచన రచన

వర్ణించినాఁడు స- ర్వాంగ యుక్తమ్ముగా, గన్యకాచరిత స - త్కావ్య సరణి

వివరించినాఁడు స- విస్తరమ్ముగ నార్య, వైశ్య గోత్ర చరిత్ర - వరుసలన్ని

యత్నించినాఁడు వి- నూత్నపంథాతోక్తి, పచ్చిసందేహ వి- మర్శనముల

పామరులకొండు మిగుల, సం-బరముగొల్పు,
రసికులనుముంచు సీసాడు - రసమునొకటి
వృద్ధవైశ్యుల వాగ్వాద - వేళనొకటి,
యువకులకు నొండుకొంత, చే - యూతలగును.

శ్రమఫలితమ్ము దక్కఁగఁబ-సఁదని యెల్లరు సన్నుతింపఁ, గా
వ్యమును విశేషరీతులను - హాయి మిఠాయి రుచిక్షి రచించి, ని
త్యము పఠియించువారికి, ర-యమ్మున నాకసుఖమ్ముసంగి, లో
కమున భవాబ్ధి నీదుటకుఁ - గావ్యమొసంగె శ్రమల్ ఫలించఁగన్.

అని విశ్వసించు,

విధేయుఁడు,

(Sd) అనుమాలశెట్టి వెంకటేశ్వర్లు,

26—7—48.

[శ్రీ వోగ్గు చినవెంకటసుబ్బయ్య శాస్త్రిగారు, గూడూరు.]

మిత్రమా !

చూలుభరమ్మున పదములు
లీలన్ మెలమెల్లనిడెడు - లేయావువలెన్
మేలగు చక్కని నడకల
గ్రోలుచు భవదీయ "కన్య - కా" కృతి వెలయున్.

మూలఁబడి స్కాంధమున నిద్ర - బోవుగాథ
నమృత మధు రాంధ్ర మంజు గీ-తములచేత
మేలుకొల్పి అశేష వై - శ్యాళినెల్ల
హర్ష రసవాహినుల నోల - లార్చితి కవి !

పక్వ దాడిమీ పూర్ణ గ-ర్భంబునుండి
మధుర రసమట్లు తావక - మంజు కావ్య
గళిత భావ సుధల్ సుధీ - లలిత హృదయ
ములకు గూర్చెగదోయి ! ని-స్తులముదంబు.

ఇట్లు,
భవదీయ విధేయుడు,
(Sd) వోగ్గు చినవెంకట సుబ్బయ్య శాస్త్రి

["విక్టోరియాకాస్సు" గ్రంథరచయిత, కవితిలక, పులవర్తి కమలావతీదేవిగారు,
మునిసిపల్ కౌన్సిలరు, సీతావిలాస్, రాజమండ్రి]

నా సోదరుఁడు విద్వాన్, 'బాలకవి' గట్టె సత్యనారాయణ గుప్తగారు రచించిన వాసవీ పురాణమును విని నే నమందానందము నందితిని. సాధారణముగ బ్రాహ్మణకవు లేదైన గ్రంథమును మన కంకిత మొసంగినచో మనముచూపు యాదరణలో సహస్రాంశమైన మన కుల కవిచంద్రుఁడగు నీ కవి పుంగవుని సత్కరింపనిచో శాశ్వత అపయశమునకు లోనగుదుమని మనవి

ఈ గ్రంథరాజము ఆంధ్రభాషావధూటి కొక నూతనాలంకారము. ఇయ్యది శాశ్వతమై, అజరామరమై, అనంత కోటివత్సరములు ఆర్యవైశ్యులున్నంతవరకు వారి ప్రతిభకు నిదర్శనమై వర్ధిల్లుగాక !

(Sd) పులవర్తి కమలావతీ దేవి.

[శ్రీ వనమా వెంకటరమణ గుప్తగారు, నెల్లూరు]

కవి, సంపాదకుఁ డాంధ్రపండితుఁ డనం-గా సత్యనారాయణుం<br>
డవలోకించి పురాణశాస్త్రములఁ గ - న్యాదేవి సౌశీల్యమున్<br>
వివరించెన్‌గద శ్రవ్యదృశ్యరచనన్ - విధర్మవృత్తంబు లి<br>
ష్టపురా ! యాతని కీడుజోడు కలరా !- యాంధ్రావనిన్ వైశ్యులన్.<br>
మత్తేభం బాకదానిని<br>
గుత్తముగా నొసఁగుచుంటిఁ - గూరిమితోడన్<br>
మత్తేభవరదుఁ డెప్పుడు<br>
మొత్తముగా సిరులనొసఁగి - బ్రోచున్‌సుహృదున్.

(Sd) వనమా వేంకటరమణగుప్త.

G. KRISHNA ARYA, B. A., B. L.,<br>
ADVOCATE (Retd.)

142, MINT STREET,<br>
SOWCARPET, MADRAS.

---

The rendering into verse of the Kanyakapuranam of Sri Vasavi by Sri Balakavi Vidwan G. Satyanarayana Gupta is an extremely praiseworthy effort. The heroic struggle of a noble maiden against the tyranny of a Ruler intoxicated by power and lust exemplifies the perenniar conflict between virtue and vice and the ultimate triumph of the former. The juvenile scholar has taken great pains to investigate and establish that the tradition is also based on historical facts. He has thereby justified the defication by the community, if any such were necessary for, polemics aside, the devotion to or worship of, a principle cannot but be recognised. The style of the composition is chaste and fluent with due stress on the pathetic aspect of the unhappy tragedy.

(Sd.) G. KRISHNA ARYA.

[శ్రీమతి "ఉభయభాషాప్రవీణ" ఊటుకూరు లక్ష్మీకాంతమ్మగారు, బాపట్ల.]

"పట్టమేలే రాజుఐతే - నట్టవీథిని - పట్టదోలే పడుచుకన్యను !<br>
పట్టమేలే రాజుఐతే - రాజునేలే దైవముండఁడో !"

ఇవి నవ్యసాహిత్య పరమేష్ఠియైన శ్రీ గురజాడ అప్పారావుగారి అమృతలేఖిని నుండి చిందిన ముత్యాల సరాలలో ఒక ఆణిముత్తెమైన "కన్యక" అనే చిఱు కబ్బం

లోని కొన్ని పాదాలు. "తనువు శాశ్వతమా? ధర్మము శాశ్వతమా? _అవమానమా ఆత్మరక్షణమా ?" అనే క్లిష్టసమస్యలు ఉత్పన్నమైనపుడు 'సతాంహి సందేహపదేషు వస్తుషు ప్రమాణమంతఃకరణ ప్రవృత్తయః' అన్నట్లు ఆత్మప్రేరణచే వాసవితల్లి అగ్ని పరీక్షకు నిలువబడి ఆత్మబలిదానమొనర్చి ధర్మవీరయైనది. పురాణములలో తొల్లి దాక్షాయణి, వేదవతి, సీతామహాసాధ్వి ఇట్లే చిచ్చుజొచ్చి జీవధర్మముల కుజ్జీవ మిచ్చినారు.

శ్రీ గట్టి సత్యనారాయణగారు కవిలోకమున ప్రసిద్ధులు. వారు వెనుక ఒక మారు 'వాసవీవిజయము' అను పేర కన్యకాపరమేశ్వరీ చరితమునే నాటకముగా రచించినారు. అంతతో తనివిపడక, వాసవిని విస్మరింపక, స్వీయధర్మము మఱచి నిద్రాణమైపడియున్న వైశ్యజాతికి కనువిప్పుకల్గించి మాతౄణము దీర్చుకొనుటలో జాతివారందఱపక్షమున కర్తవ్యము దీర్చుకొనునట్లు మఱల "వాసవీకన్యక" యను నీ యుద్గ్రంథమును రచించి జాతికి మహోపకృతి సల్పినారు.

ఇది యిట్లుండ ఈ కావ్యమున ఇంకొక ముఖ్యవిషయము నన్నధికముగా ఆకర్షించినది. అది శైలి, భాష. పూర్వకవుల ధోరణిని, పూర్వప్రబంధముల శైలిని దలపించు రచన వీరిది. సులభమైన ధారాశుద్ధిగలిగి మనస్సుల నాహరించు విశిష్టరచన పూర్వపుణ్యముననే వీరి కబ్బిన దనవచ్చును.

అన్ని విధముల ఆంధ్రజాతికి, ఆంధ్రవాఙ్మయమునకు ఆదర్శప్రాయమైన కావ్యము రచించిన శ్రీ సత్యనారాయణగారిని అభినందింపక యూరకొనలేను.

(Sd) ఊ. లక్ష్మీకాన్తమ్మ, 8—2—1947.

[శ్రీమతి నారాయణం సరోజినీ దేవి, ఆంధ్రోపాధ్యాయిని — S. K. P. V. V. హిందూ హైస్కూలు, విజయవాడ.]

లలితకళలకు నిలయము తెలుఁగునేల. కళలలోఁ గవిత్వమత్యుత్తమమైనది. పూర్వజన్మసుకృతము, దైవానుగ్రహ మున్నపుడే కవిత్వము లభించును. వైశ్య సంఘములోఁ గళాకారులు కవులు మిక్కిలి తక్కువ. ఉన్నవారికిఁ గూడ తగినంత ప్రోత్సాహము లేనేలేదు. కవులను ప్రోత్సహించి యుచితరీతిని సన్మానించుట సంఘీయుల విధి యని చెప్పవలయును. శ్రీ విద్వాన్ గట్టి సత్యనారాయణ గుప్తగారు లలిత కళలలో

నాకి తేరినవారు. కవిగారు విరచించిన పురాణమునుబట్టి చూడ ఉత్తమకళాకారుఁడని విదితమగుచున్నది. గుప్తగారు చేయుచున్న సంఘసేవ దేశసేవ అమోఘమైనది. వీరిసేవకు వైశ్యసంఘేయు లెంతయో ఋణపడియున్నారు. సహజముగా, కవి గానముఁ జేయలేఁడు. గుప్తగారు కిన్నెరకంఠముతో మృదుమధురముగను, శ్రావ్యముగను, కావ్యగానముఁ జేయునపుడదేదో అర్థముకాని ఆనందము, హాయి, మనస్సునకుఁ గలుగుచుండును.

పెక్కువత్సరములు కృషిసల్పి యెన్నియో ముద్రిత అముద్రిత తాళపత్రాది గ్రంథములను బరికించి, శాసనములను శోధించి ఈ పవిత్రమైన కన్యకాపురాణమును విరచించియున్నారు. వీరి కవితయందు సౌందర్యమాధుర్యములు నిండుగ గోచరించును. రసోచితముగ పదప్రయోగముఁజేయుటలో దిట్ట. పాఠకుల మనఃఫలకముల హత్తించుటలో నీ కవి ప్రకటించు నైపుణ్య మనన్యసామాన్యము. ఇందులో గద్యపద్య రచన నారికేళ ద్రాక్షాపాకములకు మించిన మధురపాకములో నున్నది, గాన వీరి సర్వంకష ప్రజ్ఞ వ్యక్తమగుచున్నది. పిన్నవయసులోనే యీ యుద్గ్రంథ కల్పతరువు నొసంగిన కవిగారికి నాహృదయ పూర్వకవందనము లర్పించుచున్నాను. కవిగారిని గురించి యెంతఁజెప్పుకొన్నను ఎంతవ్రాసికొన్నను కొండంత మిగులుచునే యుండును. అందుచే నింతటితో విరమించుచున్నాను. శ్రీ శ్రీ శ్రీ గుప్తగారికి చిరాయురారోగ్యైశ్వర్యములను ఈప్సితార్థములను సర్వదా ప్రసాదించునటుల వాసవీమాతను ప్రార్థించుచున్నాను.

(Sd.) నారాయణం సరోజిని.

# శ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరీ చరిత్ర

పవిత్రభరతఖండమునందు ముల్లోకపావనంబై పుణ్యరాశియై నైమిశారణ్యంబు విరాజిల్లుచుండెను. అందు ఋష్యాశ్రమంబులు పెక్కులై వెలుగొందుచుండును. ఆ యాశ్రమంబునడుమ సరస్వతి యను నొక మహానది ప్రవహించుచుండును. ఆ నదీ తటంబున మునీశ్వరులెల్లరు నొక మహాధ్వరంబును జేయఁ దలపెట్టినారు. ఋషీశ్వరు లందరు నానాప్రాంతములనుండి యాగమహోత్సవమును జూచుటకై యేతెంచిరి. అందు వసిష్ఠ, గాలవ, వ్యాస, శక్తి, పరాశర ఋషులును, శరభంగ, సుపదపాల, జాబాలి, కాశ్యప, అగస్త్య, గార్గ్య, మాండవ్య, శౌనక, విశ్వామిత్రమునీంద్రులును, ఆస్తిక, బభ్రు, మైత్రేయ, సుతీక్ష్ణ, వత్స, కుత్స, తిత్తిరి, వరతన్తు, కపిల, చ్యవన, భృగు యతీంద్రులును, ఆపస్తంబ, అత్రి, కుద్దాల, జమదగ్ని, కణాద, శతానంద ప్రభృతు లగు ఋషీశ్వరులెల్లరును బరివేష్టించియుండిరి. ఆ మునీంద్రులందరునుగలసి యజ్ఞంబు సలుపుచుండఁగా వేదవేదాంగపారంగతుండైన సూతమునీంద్రుండు యజ్ఞమహిమను వీక్షించుటకై యేతెంచెను. యజ్ఞవాటియందలి ఋషీశ్వరులెల్లరును లేచి యుచితరీతి యాతనిం దోడితెచ్చి దర్భమయంబైన ఆసనంబొసఁగి కూర్చుండఁజేసిరి. ఆ మహాత్ముని వలనఁ బుణ్యకథలను వినఁగోరి, మునీంద్రులందరొక్కుమ్మడిగా "ఓ మహాత్మా! నీవు భగవదవతారంబై భూమి నవతరించిన వ్యాసఋషీశ్వరుని ప్రియశిష్యుండవు. ఇంతకు మున్ను మీవలనఁ బెక్కుకథలను వినియుంటిమి. వైష్ణవ, బ్రహ్మ, పద్మ పురాణాదు లైన పదునెన్మిది పురాణములను వినియుంటిమి. బ్రాహ్మణ ధర్మంబులును క్షత్రి ధర్మంబులును వివరింపఁబడె. వైశ్యవంశమునుగూర్చియుఁ గొంతఁ జెప్పితిరి. అట్టి వైశ్యులు కలియుగంబున నెట్టి నడవడికను గలిగియుందురు? వారి యాచారవ్యవ హారము లెట్టివి? ఆర్యవైశ్యుల సంపూర్ణచరిత్రను వినఁగోరెద" మనిరి. ఆ యనఁగా నా సూతమునీంద్రుఁ డిట్లు చెప్పందొడంగె.

నాయనలారా! సావధానులరై వినుఁడు. ఇయ్యది అత్యంతపావనంబైన చరిత్ర. పూర్వము కృతయుగంబున శుంభ నిశుంభు లను రాక్షసులును, అప్సరసలను బరపెట్టి

గర్విష్ఠుఁడైన మహిషాసురుని బరిమార్చి, త్రేతాయుగమునందు రేణుక యను నామమునఁ బరశురామునికిఁ దల్లియై యవతరించి, యప్పరశురామునిమూలమున గర్విష్ఠులైన రాజులనెల్ల హతంబొనరించి, పిమ్మట ద్వాపర యుగంబునందు, యశోదాదేవి గర్భమున జన్మించి, శ్రీకృష్ణునకుఁ దోఁబుట్టువై కంసాదులగు దుర్మార్గులను బరిమార్చి, లక్ష్మీదేవికిఁ జెలియై యుండెను. ఆ మహాదేవియే కలియుగంబునందుఁ గుసుమశ్రేష్ఠి యను వైశ్యోత్తముని గృహమున జన్మించి 'వాసవి' యను నామమున ఆర్యవైశ్యాన్వయము నెల్ల నభివృద్ధినొందించి, వైశ్యులనిమిత్తమై విమలాదిత్య విష్ణువర్ధన సార్వభౌముని బరిమార్చి, బంధువులతోఁ గలసి కైలాసమునందుఁ జాలకాలముగా గౌరవింపఁబడుచున్నది. కలికాల దోషములనెల్లఁ బారఁద్రోలఁగల యీ వాసవీచరిత్రమును మీ మేలునుగోరి వచింపుచున్నాను. సావధానులరై భక్తిశ్రద్ధలతో వినుఁడు.

తొల్లి ప్రతిష్ఠాన మను నామమున నొక పట్టణరాజము గలదు. అందు సకలధర్మవేదియు, సత్యవాదియు, బ్రాహ్మణభక్తిగలవాఁడు నగు చూడామణి యను వైశ్యుఁడు నివసించుచుండెను. ఆతనికి సంతానము లేదు. అందులకై వగచి వగచి భార్గవచ్యవనుఁ డను బ్రాహ్మణశ్రేష్ఠునకు నమస్కరించి సంతానముంబడయుటకై తపస్సుచేయుట కనుమతిఁ గోరెను. ఆ భార్గవచ్యవనయతీంద్రునిచే నుపదేశింపఁబడి శ్రీ విష్ణుదేవుని శరణుఁజొచ్చెను. కొంతకాలమున కా విష్ణువు పుత్రభిక్షనుబెట్టెను. పుత్రుఁడు జన్మించగనే ఆకాశవాణి భూతలంబునందుఁ బ్రసిద్ధిఁజెందువాఁడగుటంజేసి ధర్మనందనుఁ డను నామం బిడెను. చూడామణి యను వైశ్యోత్తముఁడు నిజపుత్రునకు జాతకర్మము మొదలగు కర్మలను జేయించి, పన్నెండవ వత్సరము సమీపింపఁగనే యుపనయన మొనరించి భార్గవచ్యవన మునీంద్రునియొద్ద వేదాదికములఁ జదివించునిమిత్తమై భక్తితోఁ గొమరుని దోడ్కొనిపోయి వదలిపెట్టెను.

చూడామణిపుత్రుండగు ధర్మనందనుఁడు సదా గురుశుశ్రూషలు చేయుటయందాసక్తిగలవాఁడై, వేదములు, స్మృతులు, ధర్మశాస్త్రములు మొదలగునవన్నియు నభ్యసించెను. ఒకానొకరోజున గురువుగారి యనుజ్ఞచొప్పున నరణ్యమున కేగి పూలు, పండ్లు, సమిధలు, దర్భలు మొదలగునవి తీసికొని, కొంతతడ వా యటవీ చిత్రముల వీక్షించు చుండెను. ఆ వైశ్యబాలుం డాటలాడు సమయంబున "ఓరీ! నే నాంగీరసుఁ డను బ్రాహ్మణుఁడను. నన్ను వధింపకుము. వదలిపెట్టుము"—అని

భయపడుచున్న నొక విప్రుని మొఱను వినెను. ఆ ధర్మనందనుఁ డను బాలకుఁడు బ్రాహ్మణులను రక్షించుటకుఁగాని, గోవులను రక్షించుటకుఁగాని ప్రాణములనైన వదలిపెట్టినచో స్వర్గంబు నందవచ్చునని తలంచి బోయవాని నివాసభూమికి వెడలెను. ఆ బాధించుచున్న బోయవానిని గాంచి ధర్మనందనుఁడు "ఓ మహాపాపీ! విప్రుని వధింపకుము. కావలసినయంత ధన మొసంగెదను. ఆ బ్రాహ్మణుని వదలిపెట్టు" మని గంభీరముగాఁ బలికెను. వదలుటకు వ్యాధుఁ డిచ్ఛగించలేక "ఓ బాలకుఁడా! ద్రవ్యమిచ్చెదననుచున్నావు. నే నించుకేనియు ధనమును గోరుటలేదు వింధ్యగిరివాసిని యగు కాళికాదేవియొక్క బలికొఱకై యీ విప్రోత్తముని గొనిపోవుచున్నాను. బలి యొసంగుట మా కులధర్మ" మని వ్యాధుఁడు పలికెను. ధర్మనందనుని హృదయము నవనీతమువలె కరగిపోయెను. నిజప్రాణదానముచేయుటకు నిశ్చయించుకొన్నవాఁడై ధర్మనందనబాలకుఁడు "ఓ బోయరాజా! యిప్పుడు బలినిమిత్తము నా శరీరము నొసంగెదను. ఈ విప్రునికిబదులుగా నన్ను తీసికొనిపొమ్ము. బ్రాహ్మణుని వదలిపెట్టు" మనుటతోడనే యా వ్యాధుఁడు విప్రునివిడిచి ధర్మనందనబాలకుని దోడ్కొనిపోవుచుండెను. ఆహా! వైశ్యబాలకుని హృదయము. అరణ్యాంతరమునం దా బోయవాఁడు ధర్మనందనుని దోడ్కొనిపోవుచుండఁగా మధ్యాహ్నమాయెను. తప్తభానుఁడు నెత్తిపై కెక్కెను. ఆ సమయములో వేటకొఱకు వచ్చిన రాజభటులు భయంకరములైన కొమ్ములూదుచు ముందుగా వచ్చుచుండిరి. వెనుకభాగమునఁ జక్రవర్తియుఁగొంతసైన్యమును వచ్చుచుండెను. అంత నా వ్యాధుండు "అయ్యో! వేటకొఱకుఁగాబోలు రాజును సేనలును, భటులును వచ్చుచున్నారు. ఇయ్యడవి నెచ్చటనైన దాగియుండుట మంచి"దని యెంచి యా వైశ్యబాలకు నొకానొకగుహాయందు దాచి యా గుహాద్వారమున కొక పెద్ద గండశిలను గప్పివైచి తా నొక గొప్ప వటవృక్షము నెక్కి కూర్చొని యుండెను. వ్యాధుని జీవితచక్రము తిరిగిపోయినది. ఆరాజు అడవియంతయుఁ దిరిగి వేటాడి యలసి సొలసి యావటవృక్షము క్రిందనే విశ్రమించుటకై వచ్చెను. ఎల్లరును దగ్గరకొలనులో స్నానములను జేసి భోజనాదికములను బూర్తిచేసికొని, ఆ వృక్షము క్రిందనే కొంతకాలము విశ్రమించిరి. చెట్టుకొనం గూర్చున్న బోయవాఁడు చప్పుడు చేయగా రాజు వీక్షించెను. వెంటనే సేవకులం జూచి ఆగ్రహపడినవాఁడై రాజిట్లనియె. "భటులారా! ఈ నీచుఁ డగు బోయఁ డీవనమునం దెందుల కున్నవాఁడో? అయ్యో! ఈ పాపాత్ముఁ డెందఱు బాటసారులను పీడించుచున్నాఁడో! వెంటనే

జాగ్రత్తగా వీనింబట్టి కట్టి చంపుఁ"డని ఆనతీయగా భటులు యమకింకరులవలెఁ బోయి వ్యాధు నరణ్యమధ్యమునకుఁ గొంపోయి వధించి వచ్చిరి.

ఈ సమయమునందు ఈశ్వరాజ్ఞచే వాసుకి యనెడు సర్పరాజు ఆదిశేషుని దర్శింపఁగోరి పాతాళబిలంబును దరిఁజేరవచ్చుచు, ద్వారము గండశిలచేఁ గప్పియుండుటంగాంచి యత్యుగ్రకోపాటోపంబున నార్చుచు నారాతిమూతను దెఱచెను. వాసుకి సర్పవదనజనితవిషజ్వాలచే మూయఁబడియుండిన పెద్దబండ భస్మమైపోయెను. వాసుకి ఆగ్రహోయత్తచిత్తుఁడై గుహాంతరాళమునఁ బ్రవేశింపఁగాఁ దటిల్లతవలె నొక్క మెఱపు మెఱసెను. ఆ కాంతి యేమాయని వాసుకి అవలోకింపఁగా బిలమధ్యంబున భగవద్ధ్యాననిమగ్నుఁడై కూర్చుండిన ధర్మనందనుఁడను వైశ్యబాలకుని గాంచెను. "ఔరా! నా విషజ్వాలానలంబుచే శిలన్నియు బూడిద యగుచుండ నీ పిల్లవాఁడు కనలఁడయ్యె! ఈ బిలాంతరాళంబున కెట్లు వచ్చినాఁడు" అని తలపోసి వాసుకి యను సర్పరాజము ధర్మనందనుని సమీపించెను. పిన్నవాఁడగు నా వైశ్యనందనుండు వాసుకి పాదకమలములకు నమస్కరించి నిజవృత్తాంతమంతయు సాంతంబుగా నెఱింగించెను. ఆ బాలుని నమ్రతకు, వచనామృతమునకు, భక్తికి, ఆకారమునకు నావాసుకి సంతసించినవాఁడై పాతాళలోకమునకుఁ దోడ్కొనిపోయి, విష్ణుస్వరూపియు, బ్రహ్మస్వరూపియు, సకల దేవతాస్వరూపియు నైన యాదిశేషున కా బాలుని జూపించి సర్వవృత్తాంతంబును సమగ్రముంబుగా వినిపించెను. పిమ్మట యాదిశేషుండు సంతసించి యా బాలకునిం గాంచి యిట్లనియె: "వేదములు విష్ణుశరీరములు, ఆ వేదములు బ్రాహ్మణోత్తములు ధరించియున్నారు. అట్టి వేదాధ్యయనపరులగు విప్రోత్తముల నెవరు ప్రీతితో సంరక్షణముఁ జేయుచున్నారో వారికీ భూమియందు దుర్లభంబగు కోర్కె నొసంగెదను. కావున నో బాలకా! నీ వట్టి దేదైన నొకవాంఛను గోరుకొనుము నీకు మేలు కలుగును నీ కీర్తిలత పెంపొందును." — ఆ మాటలకు ధర్మనందనుఁడు హర్షపులకితగాత్రుఁడైనాఁడు. ఇప్పుడుగదా నాజన్మ ధన్యమైన దని యుప్పొంగినాఁడు. అంత నా ధర్మనందనుండు సృష్టిక్రమంబును జెప్పుమనఁగా సల్లా యని యాదిశేషుం డిట్లని చెప్పందొడంగె.

కృతయుగంబునకుఁ బదునేడులక్షల యిరువది యెనిమిదివేల (17,28,000) సంవత్సరములనియు, త్రేతాయుగంబునకుఁ బన్నెండులక్షల తొంబదియాఱువేల (12,96,000)

వత్సరములనియు, ద్వాపరయుగంబునకు నెనిమిదిలక్షలయఱువదినాలుగువేల(8,64,000) సంవత్సరములనియు, కలియుగంబునకు నాలుగులక్షల ముప్పదిరెండువేల (4,32,000) సంవత్సరములనియుఁ బెద్దలు సెప్పుదురు. ఇట్టివి నాలుగు యుగంబులు చేరిన నొక్క మహాయుగం బగును. అట్టి మహాయుగంబులు డెబ్బదియొక్కటియైన నొక్క మన్వంతర మనఁబడును. మన్వంతరమునే యింద్రకల్ప మని చెప్పుదురు. పదునాలుగు ఇంద్రకల్పములు బ్రహ్మ కొకపగ లనఁబడును. ఇట్టి శతవత్సరములు బ్రహ్మకుఁ బరమాయువు. దీనినే బ్రహ్మకల్పమనిగూడ అందురు. ఇట్టి నూరు బ్రహ్మకల్పములు దీర్ఘాయువను మునివరునకు నొకరోజని చెప్పుదురు. దీర్ఘాయువను మునీశ్వరు లిరువదియేడు కోట్ల మంది గతించిరేని, అష్టావక్రముని యొముక యొక్కటి చక్కనగును. నలువదికోట్ల యష్టావక్రమమునులు గడచిరేని పాదవృక్కను మునివరున కొక క్షణమని పెద్దలు చెప్పుదురు. ఇట్టి పాదవృక్కలను మునులు నియుతార్బుదకోట్లు గడచినను పరమేశ్వరున కొక నిముసముగూడఁ గాదు.

ఆ మహేశ్వరుఁడే సర్వమునకు నాదిపూరుషుఁడు. ఆ మహాదేవుఁడే సమస్త లోకములకు సృష్టికర్త, రక్షణకర్త, సంహారకర్తయు. ఆ మహానుభావుఁడే సర్వవ్యాపి, సూక్ష్ముఁడు, నిత్యుఁడు, అనిత్యుఁడు, జగద్రక్షకుఁడు, విశ్వేశుఁడు, సహస్రశీర్షుఁడు, సహస్రబాహువు, సహస్రకుక్షి. వేదాగమముల కగోచరుండై వెలుగొందుచున్నవాఁ డాతఁడే. పరమేశ్వరుని ధ్యానమాత్రంబున విధాత ప్రాణవాయువునుండి దక్షప్రజాపతియు, అపానవాయువునుండి క్రతువును, వ్యానవాయువు నుండి పులహుఁడును, ఉదానమునుండి పులస్త్యుఁడును, సమానమునుండి వసిష్ఠుఁడును శిరమునుండి గగనంబును, చెవులనుండి వాయువును, నేత్రములనుండి సూర్య చంద్రులును, ముఖమునుండి యింద్రాగ్నులును, నాభినుండి యాకాశమును, రోమ కూపంబులనుండి సమస్తలోకంబులును, సకలాంగంబులనుండి దేవతలును జన్మించెను. యక్షులు, రాక్షసులు, గంధర్వులు, అశ్విన్యాదినక్షత్రములు, గ్రహములును, తారలును, అష్టవసువులును, ఏకాదశరుద్రులును, ద్వాదశాదిత్యులును, ప్రమథగణంబులును, సప్తమాతృకలును, సప్తసముద్రంబులును, సప్తకులపర్వతంబులును, వృక్షజాతులును, పక్షులు పశువులు మృగంబులును, మహాత్ముండగు బ్రహ్మదేవునినుండి జన్మించినవి. ఈరీతిగా లోకంబులకెల్ల సృష్టికర్త యగు విరించి తాను సృజించి

వారందరికిఁ దగిన కార్యములను, దగిన వృత్తులను, దగిన యాహారములను, దగిన యునికిపట్టులను సృజించి కడు ముదంబునఁ బరిపాలింపుచుండెను.

ఈరీతిగా సూతపౌరాణికుండు సృష్టిక్రమంబును వినిపింపఁగాఁ బరివేష్టించియున్న మునులెల్లరు సంతోషితాంతరంగులై, "ఓ మునిసత్తమా ! వైశ్యవరులయొక్కయు మహాత్ములగు ఋషులయొక్కయు గోత్రంబు లేల ప్రాకృతంబులయ్యె! నూటరెండు గోత్రము లెందువలన పవిత్రములైనవి? తదితర ఆరునూటపన్నెండు గోత్రము లెందుచేత అపవిత్రములైనవి? ఆనతీయవే యని కోరిక లీరికలెత్త కోరఁగా సూతపౌరాణికుం డీ రీతిగా సావధానంబుగాఁ జెప్పందొడంగె.—

ఒకానొకసమయంబున నమావాస్యనాఁడు బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులెల్లరును బ్రహ్మను జూడఁగోరి బ్రహ్మలోకంబున కేగిరి. అప్పుడు విరించి వచ్చినవారందరిం గాంచి మీమీగోత్రంబులు వివరంబుగాఁ దెలుపుమని కోరఁగా నాతరి బ్రాహ్మణ సంఘములోనుండి లేచి దూర్వాసమహర్షి యిట్లనియె: మావి నూటయేడు గోత్రంబులు. అందుఁ బదునెనిమిది మాత్రమే మిక్కిలి ప్రసిద్ధములు. క్షత్రియ సంఘములోనుండి ధనంజయుం డను రాజు లేచి యిట్లు చెప్పెను: మే మేడు గోత్రములవారము మాగోత్రము లన్నియుఁ బ్రసిద్ధములైనవే. వైశ్యసంఘమునుండి సమాధియను వైశ్యసత్తముఁ డిట్లనెను: లోకాధిపతీ! మావి యేడువందల పదునాలుగు గోత్రములు. అందు నూటరెండు గోత్రములు మాత్రమే పావనములై యున్నవి. వైశ్యులగోత్రము లెక్కువగానుండుటచేత వైశ్యులనెల్లను విధాత నుతించెను. ఆ సమయంబున వైశ్యులు తమ గోత్రంబులు పెక్కులైయుండుటచేఁ దక్కినవారిని బరిహాసముచేసిరి అందు నాఱువందల పంద్రెండు గోత్రజులైన వైశ్యులు తెలివిఁదప్పి గర్వితులై చేతులుదట్టుచుఁ దక్కినవారినెల్లఁ బరిహసించిరి. తమ్ముతామే మిక్కిలిగాఁ బొగడుకొనిరి. తదితర నూటరెండు గోత్రములవారును మోములందు వస్త్రములఁ గప్పుకొని మెల్లమెల్లగా నవ్విరి. అట్లు పరిహసించుచున్న వైశ్యులఁగాంచి విప్రు లలిగినవారై నిష్ఠురవచనములతో నిట్లనిరి: "మహామునీశ్వరుల నామధేయంబులతో వన్నెకెక్కిన మీ గోత్రంబు లన్నియుఁ బ్రాకృతనామంబులతోఁ బ్రకాశించుచు మిక్కిలి దూష్యంబు లగునుగాక!" ఎక్కువ గోత్రంబులు గలవని గర్వించిన మీరలు గౌరవార్హులైన బ్రాహ్మణోత్తములన్ను బరిహాసమ్ముచేసినవారుగాన, మీరాను నిందితు లగుదురుగాక యని విప్రులా వైశ్యో

త్తములను శపించిరి. అంత నూటరెండు గోత్రజులైన వైశ్యులును దోసిలియొగ్గినవారై బ్రాహ్మణులకు నమస్కరించి వారలఁ బ్రార్థించిరి. అప్పు డా విప్రసత్తములు కోపము నాపుకొని హర్షచిత్తులై, వైశ్యులారా! మీ గోత్రంబులు ప్రాకృతంబు లయ్యును భూబీజాక్షరములతోఁగూడి భూలోకమునందు శాశ్వతములైయుండునుగాక! నూట రెండు గోత్రంబులవారుమాత్రము కన్యక కారణముగా నగ్నిప్రవేశంబు గావింతురు. అదిమొదలుకొని మీ నూటరెండు గోత్రంబులును వేరైపోవును. ఆయునూటపన్నెండు గోత్రజులును భయముచే నగ్నిప్రవేశము నొల్లక పాఱిపోయి గౌరవాఖ్యులు కాకుం దురు.—అని మాత్రమే మఱల శపించిరి. ఆరీతిగా శపించినను, ఆయునూటపన్నెండు గోత్రజులైన వైశ్యులు కులగర్వముచే విప్రులనందఱను గేలిసేయుచు పకపకనవ్విరి. మఱల నా యాయునూటపన్నెండు గోత్రజులైన వైశ్యులం గాంచి "ఓ తుచ్ఛులగు బ్రహ్మద్వేషులారా! పరనిందాసక్తులారా! మీరు వైశ్యకులమునుండి దూరులై సకల కర్మబాహ్యులై నీచులగు రాక్షసులవలె మాంసాదికముల భక్షించుచు దేశదేశంబులఁ దిరుగుచు నచ్చటి నీచజాతులవారిచే నిందితులై భూలోకంబున గౌరవములేక కులభ్రష్టులైయుండురుగాక!" యని బ్రాహ్మణులా వైశ్యులను లోకభీకరముగా శపించిరి.

ప్రజాపతియు వినయాలంకారులును, షోడశకళల నెఱింగినవారును, సకల సద్గుణసంపన్నులు నైన వైశ్యులం గాంచి, సమస్తవస్తువిజ్ఞానమును క్రయవిక్రయకౌశల మును ధర్మాధర్మముల నెఱుంగు శక్తియు శ్రేష్ఠంబైన బ్రహ్మవిద్యయు నేర్పించి, శరత్కాలము సమీపింపఁగా నొక శుభముహూర్తంబున "గర్భద్వాదశేషువైశ్యం" అని స్మృతి నుడువుచుండుటవలనఁ బుట్టిననాటనుండి పన్నెండవయేట వారికి స్వశాఖ లలోఁ జెప్పినట్లుగా నుపనయనక్రియలు జరిపి వేదవేదాంగములను నేర్పించెను. వేదంబుల సాంగంబుగాఁ బఠించి, బ్రహ్మచర్యపరాయణులై జింకతోళ్ళను గప్పుకొని, సితయజ్ఞోపవీతంబుల ధరించి, మోదుగదండంబులఁ జేఁబూని, మేలి మౌంజీ దర్భలతోఁ జేసిన మొలత్రాళ్ళుగట్టి, మధూకరవృత్తితో నిజజీవితంబులను గడుపు కొనుచుఁ బరిశుద్ధులై సూర్యాగ్నులుంబోలె వెలుఁగుచున్న యా వైశ్యులను గాంచి విధాత కడు మోదంబంది గోత్రప్రవరల కనుగుణంబుగా వివాహంబులను గావించె. ప్రజాపతి వైశ్యులం గాంచి యొక్కనా డిట్లనియె: "నాయనలారా! మీరలెల్లరును నా యాజ్ఞంబొంది పృథ్విలో బృహత్పర్వతం బను నామంబుగలదియు, నైశ్వర్యాభి

వృద్ధిగలవియు, విశ్వకర్మనిర్మితంబు నగు పట్టణంబున నివసింపుడు. మీకు మిక్కిలి శుభంబు లొదవు. నా యాజ్ఞానుసరణిని మీకొఱకై విశ్వకర్మ పదునేడు పట్టణంబులను నిర్మింపఁగలఁడు. ఆ నగరంబులన్నియు నంబరచుంబితంబులై సుధాధవళితంబులైన సౌధజాలంబులతో నొప్పుచుండును. అందు మీరలెల్లరు నివసింపుచు దేవపితృ ఋణంబులనుదీర్చి సద్భావంబుగలవారలై గోసంరక్షణము వాణిజ్యవ్యవసాయంబులను జేసి, గోమేధికపుష్యరాగాది నవరత్నవ్యాపారంబు లొనర్చుచు న్యాయార్జితంబులైన ధనంబులతో నత్యధికసంపదగలవారలై జీవించవలయు." సకలసస్యసంభరితంబైన సర్వంసహామండలంబున వసింపుఁడని విరించి పలుకగా నావైశ్యమునీంద్రులెల్లరు సాష్టాంగంబుగాఁ బ్రణమిల్లి బ్రహ్మదేవునిగూర్చి యిట్లనిరి: "కరుణాంబునిధివైన నో దేవ దేవా! ఇదే మా నమస్కారము. మీయందున్న చనవునంజేసి యొక్కనుడువు విన్నవించుకొందుము. దుఃఖనిధియు నరకతుల్యంబునైన భూలోకంబునందు మేము నివసింపలేము. అచ్చటి ప్రజలు పలుతెఱంగుల నుందురు. పరధనంబుల నపహరింతురు. పరకాంతలతోఁ గ్రీడింతురు. పరులను వంచింపుచుందురు. మోహబద్ధులై పుణ్యకర్మల క్షీణింపఁజేయుఁచున్న ప్రజానీకంబుతోనున్న భూలోకంబునందు మే మెట్లు జీవింపఁగలము? ఓ మహాత్మా! రజస్తమోగుణరహితులై పుణ్యహృదయంబులు గలవారును, దివ్యదృష్టిగలవారును నైన సనకసనందనాదు లెచ్చట నివసింతురో, నిష్కామంబుగా బ్రహ్మార్పణబుద్ధితో యజ్ఞంబులఁజేయువారును నిచ్చలు నిచ్చతోఁ బలుకువారు నైన పుణ్యపురుషులగు జనకమహారాజాదు లే లోకంబున సంచరింతురో, భూపాలురు రాజసూయము అశ్వమేధము మొదలగు యజ్ఞంబుల నొనరించి యే సనాతనబ్రహ్మపదంబు నందుదురో - అట్టి యీ లోకంబును విడిచి మే మెంతమాత్రము పోలేము" అని నుడివి యా వైశ్యులెల్లరు చింతిల్లుచుండ, విరించిగూడఁ గొంత విచారించెను.

అంతట సకలలోకాధిపతి యగు బ్రహ్మదేవుండు వైశ్యమునీంద్రులం గాంచి యింపులగు ముద్దుపలుకులతో నిట్లనియె: "ఓ వైశ్యమునులారా! సత్యము దప్పనివారు, మహాత్ములరు, మర్త్యలోకంబునకుఁ బోవ చింతిల్లుచున్న మీరు నా పలుకుల నాలకించి చంద్రమహాళీశ్వని సేవింపుఁడు. ఆతండే సర్వలోకాలోకంబులకు సృష్టిస్థితిలయకర్త. సకలలోకాధిపతి. సాధువుల కభయమొసంగువాఁడు. ఆతనిమహిమ యిట్టిదని నిర్ణయింప నాకే వశంబు గాదు. ఈశ్వరతత్త్వంబును గ్రహింపఁగలుగుట మిక్కిలి కష్ట

సాధ్యంబు. పూర్వకాలంబున నొకనాఁడు పరమేశ్వరుండు సహస్రశీర్షంబులును సహ
స్రంబులకొలంది బాహువులుగలవాఁడై జ్వాలాజాలంబులతో నిండిన కాంతిపుంజంబు
లతో బ్రహ్మాండభాండంబులను భూమ్యాకాశంబులను వ్యాపించి వెలుఁగుచుండెను.
వైశ్య మునీంద్రులారా! ఆ సమయంబున నీశ్వరుని పాదకమలంబులఁ గనిపెట్టవలెనను
తలంపు నాకును, శీర్షంబు గనిపెట్టవలెనను తలంపు విష్ణుదేవునకును గలుగగా మే మా
విధంబుగాఁ గ్రిందికిని, పైకిని బోయి ప్రయత్నించియు వ్యర్థులమైతిమి. ఆ మహాను
భావుని శరణుఁబొందుఁడు. చతుర్వేదంబులను జదివినను సకలోపనిషత్తులఁ బఠించినను
లభించువాఁడు గాఁడు. అయినను భక్తులకు లోఁబడువాఁడు.

తొల్లి యొకప్పుడు కిన్నర కింపురుష యక్ష సాధ్యాదులతోఁగూడి వేల్పులం
దఱు త్రిపురంబుల దహించుటనిమిత్త మామహాదేవుని శరణుఁజొచ్చిరి. ఆ సమయంబునఁ
బృథ్వి రథంబుగను, ఆదిశేషుండు నారిగను, మేరుగిరి ధనువుగను, విష్ణుదేవుండు బాణం
బును గాఁగా నేను సారథిగా నేర్పడ మహానుభావుఁడును, జగత్పతియు సర్వకార్య
సమర్థుఁడునైన పరమేశ్వరుండు త్రిపురంబుల దహించెను. మీరెల్లరును నా యాజ్ఞలఁ
గొని కడుంగడుభక్తితో నా పరమేశ్వరుని సేవింపుఁడు" అని పరమేష్ఠి వైశ్యమునీంద్రుల
కాజ్ఞనొసంగెను. వైశ్యప్రవరులు కన్నులనుండి యానందబాష్పంబులు స్రవింప కమల
సంభవునితో నిట్లనిరి—"ఓ మహాదేవా! మా యదృష్టవశంబున మీ రెట్లాన
తిచ్చిరో యా ప్రకారంబున నీశ్వరారాధనము గావించెదము. కాని యీశ్వ రా
రాధన ప్రకారంబుగూడ సెలవీయవలసినదని వేఁడుకొనుచున్నాము. అయ్యది ముని
పుంగవులకు సైతము వినవలవిగాదుగదా! అట్టి యీశ్వరమహామహిమ వినుటగూడఁ
దమవలన ప్రాప్తించె. తమ యానతిచొప్పున భక్తకల్పతరువగు నా దేవదేవుని సేవిం
చెదము. మీ యనుగ్రహంబున నుమామహేశ్వరవ్రతంబు నారంభించెదము" అని
వైశ్య మునిసత్తములు కోరిరి. పరమేష్ఠియుఁ గరుణార్ద్రవీక్షణంబుల వీక్షించి వారల కిట్ల
నియె: "వత్సలారా! పరమేశ్వరుని యారాధనక్రమంబు నెఱింగించెద నాలకింపుఁడు.
కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యంబులను లోనివైరులజయించి మనోనిగ్ర
హంబుగావించి యింద్రియాశల విడనాడి మిత్రులయందు శత్రువులందు సమానులై
అహింసావ్రతమును బూని శమమే ప్రధానంబుగా భావించి సత్యంబువచించుచు సదా
చారసంపన్నులై, శర్వు నెవ్వరు సేవించుచున్నారో వారు మోక్షసౌధంబుల నివసింప
గలరు. సువర్ణమయలింగంబులనుగాని మృణ్మయలింగంబులనుగాని నిర్మించి యాలిం

గంబున కెదుట విఘ్నేశ్వరప్రతిమనుంచి యత్యంతభక్తితోడ లేతబిల్వపత్రంబులతోను, ఉమ్మెత్తపూలతోను, నంద్యావర్తపుష్పంబులతోను తెల్లనిసేసలతోను బూజించి ధూపదీపనైవేద్యనీరాజనంబులనొసంగి బాహ్యాభ్యంతరశుద్ధిగలవారలై నిచ్చలును బంచాక్షరీమంత్రంబులను జపింపవలయును ఈ విధంబుగాఁ బూజించువారలకు శంకరుండు గడుంగడు సులభుఁడు.''—అనిపలికి విరించి శివపూజాప్రకారంబును వేదస్మృత్యాగమంబులఁ జెప్పిన విధంబున నుపదేశించి శివపంచాక్షరీమంత్రంబును వివరించి యా వైశ్యమునీంద్రులను దపంబు సేయుటకుఁ బంపించెను. అంత నా వైశ్యమునులు బ్రహ్మవలన సెలవొంది మేరుపర్వతప్రాంతములకుఁ బోయి యచ్చట పుణ్యవనంబులనెల్ల గలయందిరిగి హిమవత్పర్వతశిఖరంబున కేగి గంధర్వులకాటపట్టయినదియు, నేరేడు, జువ్వి, మద్ది, రావి, బొట్టుగు, మామిడి, త్రాడు, కానుగు, సురపొన్న, మాదీఫలము, నిమ్మ, పనస, కడప, యిప్ప, పారిజాతము, మందారము, అడవిమల్లె, అశోకము, పాటలము, గుగ్గులువు మొదలగు తరులతాదులతో నిండినదియు ననయెత్తగా గోకఁగోరిన గజగండస్థలంబుల దురదను దీర్పఁగోరునట్టి సింహంబులును, కేకిజొమ్ముల నీడలయందుఁ బవ్వళించెడి పాములును, ఎలుకలకు బువ్వఁబెట్టుచున్న పిల్లులును, జింకలతో నాట్యంబాడుచున్న వ్యాఘ్రంబులును గలిగి వెలుగొందునదియు, కశ్యపుఁడు, అత్రి, భరద్వాజుఁడు, పులస్త్యుఁడు, పులహుఁడు మొదలగు మహామునులతో నిండినదియు, మలయమారుతము వీచుటచే మాటిమాటికి పైకిలేచుకప్పురపుధూళితో నిండినదియునైన నొకానొకయాశ్రమంబుననుండు ఆనందస్వరూపులైన, ఆ మునీంద్రులకు నమస్కరించి వారలయానతి నంది పుణ్యస్థలంబుల కేగిరి.

అందులోఁ గొందఱు గంగాదిపుణ్యతీర్థంబుల సేవింపఁబోయిరి. మఱికొందఱు పుణ్యక్షేత్రంబులఁ గనుగొననేగిరి. వేఱుకొందఱు నియమవంతులు సప్తకులపర్వతంబులకుం బోయిరి. ఇంకనుకొందఱు పవిత్రములైన నైమిశాదిమహారణ్యంబులలో వసతుల నేర్పఱచుకొనిరి. ఈరీతిగా భూలోకంబునఁ బుణ్యభూముల కఱిగి, తపంబుల కరిగిన వారలెల్లరు నచ్చటచ్చట నివాసంబు లేర్పఱచుకొని నియమంబుగలవారలై, పరమేశ్వరుని హృదయపీఠంబుల నిల్పినవారలై శివలింగప్రతిష్ఠలను జేసి యథావిధిని బూజించుచు విభూతి నలఁది రుద్రాక్షమాలలను ధరించి నిచ్చలు నిచ్చతో నియమంబుతోఁ బంచాక్షరీ మంత్రంబును బఠింపుచు శంకరునుద్దేశించి తపంబు సేయుచుండిరి. గ్రీష్మర్తువునందుఁ బంచాగ్నుల నడుమను శిశిరర్తువునందు జలమధ్యంబునను వర్షాకాలంబు

నందు నేలపైనుండియు మౌనంబుదాల్చి యా వైశ్యమౌనులెల్లరును దపంబు లాచరించిరి. కొంద ఱాకలలములను దినుచుండిరి. కొందఱు నీరే యాహారముగా భుజింపుచుండిరి. కొందఱు వాయువునే యాహారముగా భుజింపుచుండిరి. కొందఱు భానుకిరణంబుల నశనంబుగాఁ దినుచుండిరి. కొందఱు వెన్నెలయే తిండిగాఁ గొనుచుండిరి. కొందఱు తామర తూండ్లం దినుచుండిరి. అందఱును జితేంద్రియులయి కామక్రోధాదిశత్రువులఁ బారద్రోలి మిక్కిలి ఘోరంబైన తపంబుఁ గావించిరి. ఇట్లు పుణ్యక్షేత్రములందు వైశ్యమౌనులు నిలింపులకు సైత మలవిగాని తపం బొనరించినను శంకరుండు ప్రత్యక్షంబు గాఁడయ్యె. అంత వైశ్యులందఱు వగఁగూరి యా పుణ్య భూములను వదలి హిమవన్నగంబున కేగుదెంచి యచ్చట తపం బాచరించుచున్న మునీంద్రులకు మ్రొక్కి యా పర్వతమున మానససరోవరం బందుఁ దపం బాచరించుచున్న ఋషీశ్వరులతో నిట్లనిరి: "ఓ మహానుభావులారా! మేము మీనుండి సెలవుగైకొని పుణ్యక్షేత్రంబుల కరిగి యచ్చటచ్చట బహుకాలము తపస్సుఁ గావించినాము. ఇంతవఱకు నీశ్వరుండు ప్రసన్నుఁడుగాఁడయ్యె. సులభమార్గంబునకై వేడుచున్నా" మని మనవిఁజేసికొనఁగా నా తాపసోత్తములు జ్ఞానదృష్టితో నందులకుఁ గారణంబును దెలిసికొని యిట్లు చెప్పిరి: "నాయనలారా! మా నుడువులను వినుఁడు. ఇష్టపదార్థంబుల విసర్జించుటచేఁ దపస్సు నూరింతలగును. ఎవరి కేవస్తు విష్టముగనుండునో వారు దానిని వదలిపెట్టవలయును. ఏ వంశమున నొకరు వస్తువును వదలుచున్నారో, ఆ వంశస్థు లావస్తువును వదలుచుండవలెను. ఇట్టి నియమంబులతోఁ దపంబులొనర్చినచో వేగిరమే మీరు పరమేశ్వరుని యనుగ్రహమునకుఁ బాత్రులగుదురు. మీ కార్యంబు సిద్ధింపఁగలదు" అని చెప్పగా వైశ్యమునులు సంతోషాంతరంగులై, యిట్టి నియమంబుల నిర్ణయించుకొని పరమేశ్వరునిగూర్చి భక్తితో మానససరస్తీరంబునందు నుగ్రతపంబులు సేయుందొడంగిరి. కాలి బొటనవ్రేళ్ళపై నిలువంబడి చేతులుపైకెత్తి సాయంసమయమువఱకుఁ బర్వతమువలె కదలక మెదలక పంచాక్షరీ మంత్రంబుల జపించుచు తపంబు లొనరింపుచుండిరి. వారల తపోప్రభావంబున నచ్చటచ్చటనున్న తపోధనులును దేవేంద్రాది నిలింపులును గనుగొని నెవ్వెఱగందుచుండిరి.

యక్ష రాక్షస పన్నగ గంధర్వ సిద్ధ చారణాదులతోఁ గూడిన దేవతలందఱు వైశ్యమునీంద్రు లాచరించు తపోతాపంబున గోరువఁజాలక మిక్కిలి విచారంబు నందుచుండిరి. ఆ సమయంబున తేజోవంతుఁడగు పరమేశ్వరుండు కైలాసశిఖరంబుం

బురుడించు గొప్ప నందివాహనం బెక్కి దేవేంద్రుఁడు తెల్లని గొడుగుచేఁబూని కొలుచుచుండ, కుబేరుఁడును వరుణుఁడును గరంబుల వెన్నెలంబోలు వింజామరంబులను బూని వీచుచుండ, యముఁడు ముందుభాగంబున బెత్తముచేఁబూని జోహారు నొనర్ప వాయుదేవుండు వ్యజనంబులతో విసరుచుండ, నైరృతి శూలపినాకంబులనుఁ జేపట్టి పొగడ్తలొనర్ప, ఈశానుండు స్తోత్రపాఠంబులను జేయుచుండ వసిష్ఠ, వాలఖిల్య, అత్రి, విశ్వామిత్ర, అణిమాండవ్య, భృగు, శౌనక, గౌతమ, అగస్త్య, ఆపస్తంబ, ప్రభృతులును సనక, సనందన, సనత్సుజాత, సనత్కుమారులును, ఉపనిషద్వాక్యంబులతో వెంబడింప, జటాజూటంబునఁ జంద్రలేఖను ధరించి అర్థాంగంబునఁ బర్వతరాజ పుత్రి నిడుకొని ఆ నిలింపులందఱుఁ గనుఁగొనుచుండ సాక్షాత్కరించెను. అంతట నా వైశ్యమునీంద్రు లందరును భూతాధినాథుఁడగు నా పరమశివునకు సాష్టాంగ దండప్రణామంబులొనరించి నిలువంబడి హర్షహృదయులై, పులకాంకితులై, నేత్రంబుల నానందబాష్పంబులుస్రవింప నొక్కుమ్మడిగా నిట్లు చెప్పిరి: "దేవా! యిదే మానమస్కారములు. పిన్నలలోనెల్ల పిన్నవు, పెద్దలలోనెల్ల పెద్దవు. పరమ పూజ్యుండవు. మిక్కిలి తేలికైనవాడవు, కడుంగడు బరువైనవాడవు, మృత్యుంజయుండవు, శత్రువుల జయించువాడవు నీలకంఠుండవు, లోకాధిపతివి, పినాకపాణుండవు, త్రిపురసంహారివి, దక్షమఖవినాశకుఁడవు, త్రినేత్రుఁడవు, ఘోరహాలాహలభక్షకుఁడవు, సర్వభూషణుండవు,సితస్ఫటికశరీరుండవు, సూర్యచంద్రాగ్ను లను మూఁడుజ్యోతులను నేత్రములుగాఁ గలవాఁడవు, పృథివి, జలము, తేజము, వాయువు, ఆకాశము, సూర్యుఁడు, చంద్రుఁడు సోమయాజి యను అష్టమూర్తులైనవాఁడవు, సర్వవ్యాపివి, శుభంబు లొదవించువాఁడవు, శాంతుండవు, నిర్గుణుండవు, గుణస్వరూపుండవు, శాశ్వతుండవు, విరాట్స్వరూపుండవు, మహాత్ముండవు, మన్మథుని ధ్వంసంబుగావించినవాఁడవు, కైలాస పర్వతంబున శయనించువాఁడవు, మహాత్మా! భక్తిపూర్వకంబుగాఁ బ్రణమిల్లుచున్నా"మని వినయవినమితోత్తమాంగులై ముదంబున తెప్పలల్లార్పక నిలువంబడి యుండిరి. అంత లోకరక్షకుండగు పరమేశ్వరుండు సంతుష్టాంతరంగుఁడై మందస్మిత వదనారవిందుండగుచు దయారసంబు వర్షింపుచు సుధామధురంబగు శ్రావ్యవచనంబులతో నిట్లనియె: "నాయనాలారా! మీ వచనంబులకు నమందానందకందళిత హృదయారవిందుఁడనైతిని. మీ కెల్లరకు శుభంబులగుంగాక! మీ వినయంబునకును మీతపోదీక్షకును కడుంగడు సంతసించితిని! ఉత్తమవరంబులను గోరుకొనుఁడు.

అభీప్సితంబులను దీర్చెదను. అయ్యది యొరుల కసాధ్యంబైనను, నే దీర్చెదను. మిమ్ముల తృప్తిపఱచెదను" అని పరమేశ్వరుండు పలుకగా వైశ్యమును లిట్లు విన్నవించుకొనిరి: "ఓ మహాత్మా! దేవదేవా! భక్తచింతామణీ! మీ యనుగ్రహంబే చాలును. ఓ పురుషోత్తమా! సంసారసాగరతరంగంబులనుండి తప్పించి గట్టెక్కించు శక్తిగల మీ చరణకమలంబులందు స్థిరమైన భక్తి నొసంగుము" అని వైశ్యమునులు ప్రార్థింపఁగాఁ బార్వతీప్రాణవల్లభుండు నట్లే యగుంగాకయని నుడివి, మఱియొకవరంబు నొసఁగఁగోరి 'మునిసత్తములారా! మిక్కిలి సంతసించితిని, మఱియొక వరంబును గోరుకొనుఁడు, ఇవ్వవలెనను కుతూహలమున్న'దని పలుకగా నా వైశ్యమానీంద్రులు సంతోషాంతరంగులై యిట్లనిరి. ఓ పరమదయాళూ! నీలోకంబు ఇంద్రాది దేవతలకును, జితేంద్రియులగు తాపసోత్తములకును లభింపనిది. అట్టి మీలోకప్రాప్తిని గలుగంజేసి పుత్రపౌత్రాదిగణంబులతో మీ సన్నిధిని సేవఁజేయుట కనుజ్ఞనిండు" అని వైశ్యమునులడుగఁగా మహాత్ముండగు గిరీశుండు సంతసించి నట్లేయగుఁగాకయని వరంబులొసఁగి మణినిర్మితంబులగు విమానంబులపై వారలంగూర్చుండంబెట్టికొని, కిన్నర విద్యాధర చారణ యక్షులాదిగణంబులు మంత్రంబులతోను చతుర్వేదంబులతోను స్తోత్రంబుల సలుపుచుండ నున్నతశిఖరంబులు గలదియు బ్రహ్మానందంబునకు నాటపట్టగు నదియునగు కైలాసంబునకుఁ దీసికొనిపోయెను. అచ్చట వైశ్యఋషులందఱును వింతవింతలగు గుహలందును సుందరమైన కొండచఱియలందును యథేచ్ఛగా విహరింపుచు నీశ్వరుని సేవసేయుచుండిరి.

ఆ కైలాసనగంబున నీశ్వరసన్నిధానంబునఁ బరమ సౌఖ్యంబుల ననుభవించుచున్న వైశ్యులకు సహస్రంబులుగా దేవవత్సరంబులు గడచినవి. అట్లుండగా నొకప్పుడు ప్రభాతాన్వయుండును, సకల సద్గుణ సంపన్నుండును శివపూజాధురంధరుండునగు వైశ్యుండు సోమదత్తుండను నామంబున వైశ్యవంశంబునందు జన్మించి మనోజ్ఞురాలును సౌందర్యవతియునగు కన్యారత్నంబును వివాహమాడఁ దలఁచినవాఁడాయెను. సోమదత్తుండను నామంబుగలయువకుఁడు కన్యాన్వేషియై మైత్రేయసాన్వయాలంకారుండగు వైరాజకొమరితెను వరించెను. ఆమెపేరు ప్రతాపవతి, తటిల్లతవలెమెఱయుచు రతీదేవినిగూడఁ దిరస్కరించు సౌందర్యము గలిగియుండెను. సోమదత్తుండు నిజహృదయాభిప్రాయంబును బంధువులచేత నావైరాజు నడిగించెను వైరాజు పుత్రిక నొసంగుట కంగీకరించినాఁడు. కాని, గంధర్వాధిపతివలనఁ గలిగిన

భయంబునుకూడ సవిస్తరంబుగా వినిపించినాఁడు. అదియేమనగా, గంధర్వరాజు తనకుఁదప్ప యొరుల కీ కన్యక నొసఁగినచో పంచత్వము నొందునని శపించినాఁడు. వైరాజు వచనంబులను సోమదత్తుండు వినినవాఁడై ప్రతాపవంతుండగు పరమేశ్వరునితో జెప్పికొనెను. పరమేశ్వరుం డనుగ్రహించి యాశాపము నేడురోజులుమాత్రముండు నట్లుగాఁ జేసి వివాహము జరుపుకొనుమని సెలవొసంగెను. లక్ష్మీపార్వతులతోను దేవతాసత్తములతోను గూడియున్న కల్పవృక్ష మధ్యభాగమునందుఁ బ్రపంచకర్త యగు పరమేశ్వరుండు ఏడురోజులలో వివాహకార్యంబులనేర్పాటు గావించుకొనుమని సోమదత్తున కానతి నొసంగెను. పంచకల్పవృక్షంబుల వివాహవేదికను నిర్మించిరి. బంధుజాలంబులు పరివేష్టించియుండిరి. పరమేశ్వరుండును ప్రమథ గణంబులు నుచితాసనంబుల నాసీనులైయుండిరి. ప్రతాపవతీ సోమదత్తులపరిణయంబు వైభవో పేతంబుగా జరిగెను. కైలాసపర్వతప్రాంతమున నైదుకల్పవృక్షముల మధ్యభాగములో వివాహము జరిగినదిగావున నీనాటినుండి మీ వంశమున నైదు స్తంభములుగల మంటపమునందే పరిణయము జరుగవలెనని వైశ్యులకు శివుం డానతి నొసంగెను. బ్రాహ్మణులకును క్షత్రియులకును బెండ్లితిన్నెకు నాలుగు స్తంభములుండవలెననియు, వైశ్యులకుమాత్ర మైదు స్తంభము లుండందగుననియుఁ జెప్పెను. శంకరుం డీ రీతిగాఁ బ్రతాపవతీ సోమదత్తుల పరిణయమును జరిపించి వివాహ స్తంభాదివిషయముల వివరించి సంతసమున నిజనివాసంబున కరిగెను.

దేవయోనులగు గంధర్వులు శూద్రు లని చెప్పఁబడినవారు. ఆ గంధర్వులు స్వర్గలోకమునందు వైశ్యసంబంధముల వాంఛించినవారలై దేవేంద్రునానతిఁదీసికొని యావైశ్యపుత్రికలను వివాహమాడనెంచి వరించిరి. వైశ్యు లంగీకరింపలేదు. గంధర్వుల సంబంధము వారలకు సమ్మతిగాలేదు. గంధర్వులయొక్క ప్రార్థనను వైశ్యులు నిరాకరించిరి. గంధర్వులందఱికి మిక్కిలికోపముగలిగినది. ఆగ్రహము వచ్చినది. "ఈ లోకమునందు మీపుత్రులును, పుత్రికలును విషయాపేక్షలేనివారుగా నుందురుగాక! జీవించియు జీవములేనట్లుందురుగాక! మీపెద్దలుమాత్రము గంధర్వులచే శపింపబడినవారలై దేవత లను బూజించి శాపవిముక్తు లగుదురు" అని గంధర్వులు వైశ్యవతంసుల శపించిరి. సోమదత్తుండు రెండవరోజున భక్తితో దేవతలనునర్చించి వివాహకార్యంబులను శాస్త్ర విహితంబుగా జరిపించి పెండ్లికొమరితను దోడ్కొని బంధుజాలంబులతో గృహంబున కేగి సుఖముగా నుండెను. ప్రతాపవతీ కన్యకకు షోడశప్రాయము వచ్చినది. ఒకానొక

శుభముహూర్తంబున ప్రతాపవతీ సోమదత్తుల గర్భాధానమహము జరిగెను. కొద్ది రోజులలో ప్రతాపవతీదేవికి నెలతప్పెను. నవమాసములు నిండెను. మహోత్సవేవ్వారికి నందని ఒకానొక శుభముహూర్తమునందు పుత్రిక జన్మించెను పదియవనాఁడు వైభవోపేతంబుగా జాతకకర్మ మహోత్సవంబును జరిపించిరి. కులదీపకయగు కూతురని తలంచి 'కీర్తి' యను నామకరణంబును జేసిరి. శుక్లపక్షమునందు శోభిల్లుచున్న చంద్రునివలె దిన దినప్రవర్ధమానయగుచుండెను. అయిదవ వత్సరమునందు గురువు నొద్ద నప్పగించిరి. చెలికత్తెలతో వనమునందు విహరించుచున్నప్పుడు నందనోద్యానము నందు విహరించు పులోమజయే యని జనులనుకొనుచుండిరి. విరించి లోకమునందున్న సౌందర్యమంతయు నీ కన్యయం దుంచినాఁడు. సంస్కృతమునందే వేదములు స్మృతులు, పురాణములు, ఇతిహాసములు మొదలగునవన్నియు నభ్యసించినది. చతుష్షష్టికళలయం దారితేరినది. పరమేశ్వరుని పాదకమలధ్యానముచే పావనమునై తామర తూండ్లను బోలియున్న తనకరంబులను జాచి మందార పుష్పంబులను గోయుచు జగములను మోహింపజేయు మన్మథుని విజయంపు టెక్కెమోయనం బరగి విరాజిల్లుచుండెను. అత్తరి నొక్కనాడు సుందరాకారుండైన చిత్రకంఠుం డను గంధర్వుండు యదృచ్ఛగా నా యుద్యానవనమున కేతెంచెను. చిత్రకంఠుండు వచ్చునప్పటికి కీర్తికాంత కలావతియను వీణెను నింపుగా మీటుచు ఈశ్వరపాదాంబుజధ్యాననిమగ్నయై రాల్గరగించు గానంబును గావించుచుండెను. ఆ సమయంబునఁ గీర్తి కన్యకను గాంచినవాఁడై చిత్రకంఠుండు మన్మథబాణమైన లేమావియిగుళ్ళకు బద్ధమైన హృదయకమలంబు గలవాఁడై దవ్వుననే చెలిమిచెలికాన్రడను నిలిపి దాని దాపున కేతెంచి మన్మథబాణపీడితుఁడై చంచలనేత్రంబులతోఁ జూచుచు నిట్లనియె. "ఓకల్యాణీ! నీ వెవ్వతెవు? ఎవరికొమరితెవు? నీ కరకమలంబుల నెవనినైనఁ జేపట్టితివా? నీయడుగుదమ్ములతో నే దేశమును రంజింపఁజేసితివి ? నీ నామంబెయ్యది?" అని గంధర్వుండు కోరఁగా నా కీర్తికన్య బదులు చెప్పలేదు. ప్రియసఖ కాంచన నొసంగినది. ఆ చెలికత్తె గంధర్వరాజునకుఁ గీర్తికన్యక వృత్తాంతమంతయు నుడివెను. అంత గంధర్వుండు ప్రేమార్ద్రంబులగు నా పలుకులను విని యిట్లనియె: "ఓ చంచలాక్షీ! అమృతోపమానంబులగు నీ పలుకులు విన నేను నోచుకొనలేదా! శృంగార రసంబును గురిపించుచు వికసించిన కుసుమంబువలెనున్న నీ కడగంటి చూపులచే నన్ను ధన్యుం జేయుము. గబ్బిగుబ్బల నేల గప్పుకొనెదవు ? మిక్కిలి హెచ్చుచున్న మన్మథాగ్నిజ్వాలా

పుంజంబులచే మలమల మాడిపోవుచున్న నాకు నీ యధరామృతపానీయంబు నొసంగుము. వేయేల? మనోహరంబైన యావనంబును బడసితివి. మన్మథుని సాక్షిగాఁ జేసికొని నన్నుఁ బరిణయమాడుము. కాదేని నేను బ్రదుకను. ప్రాణము లిప్పుడే వదలెదను. తరలాక్షీ! నన్ను రక్షింపుము. ఆర్తత్రాణపరాయణతయే ముఖ్య వ్రతమని పెద్ద లందురు.''—అని ధీరుండగు గంధర్వుండు సాహసంబుగాఁ బలుకఁగా విని యా కీర్తికన్యక ''ఓరీ! ఏల యీ కారుకూఁతలు గూసెదవు. నేను తలిదండ్రుల కధీనురాలను. నా తలిదండ్రులు సంతసంబుతో నెవని కొసంగెదరో, వాఁడే నా పతి'' అని చెప్పి కోపముతో గనులెఱ్ఱఁజేసి యింటి కేగి తలిదండ్రులకు నిజవృత్తాంతం బెఱింగించి సుఖంబుండెను.

ఆ గంధర్వప్రవరుండు మన్మథాగ్నితప్తుండై కీర్తికన్యకయొక్క పితృగృహంబున కేగి వైశ్యమునిసమితింగాంచి దుర్బుద్ధిగలిగినవాఁడయ్యు నణఁకువ గలిగి కీర్తికన్యకను దనకిమ్మని యాచించెను. బ్రతిమలాడెను. వైశ్యమునులు పిచ్చివాఁ డనుకొనిరి. పిమ్మట అందఱికి కోపము వచ్చెను. ''కాఱుకూఁతలు చాలించి వెడలిపొమ్ము, పెండ్లి సేయుమని కోరుట కిదియేనా పద్ధతి? నీతో నెక్కువ సమాధానము చెప్పుట కవకాశములేదు, పొమ్ము?'' అని వైశ్యులు కోపంబునఁ బలుకగా నా గంధర్వుండు కామోద్రేకంబు లతిశయించుటంజేసి పిల్లనిమ్మని దీనంబుగా యాచించెను. అంత వా రాగ్రహపడినవారై ''ఓరీ మూర్ఖా! యేల పిచ్చిపట్టినట్లు ప్రేలెదవు. ఒకతడవ నీ కొసంగమని చెప్పితిమిగదా! మఱల యాచించెద వేల? సిగ్గులేనివాఁడా పొమ్ము!'' అని తిరస్కరింపఁగా గంధర్వుండు క్రోధంబుచేఁ గన్ను లెఱ్ఱంజేసి యిట్లనియె: ''దురాత్మలారా! మీరెల్లరు కైలాసంబు విడిచి మానవలోకంబునకుఁ బోవుదురుగాత! అచ్చట కన్యకతో నగ్నిప్రవేశం బొనర్చి నశింతురుగాత!'' అని గంధర్వుండు శపింపఁగా వైశ్యపురుషులందఱు గోపావేశపూరితులై ''ఓరి! మూఢా! దుర్బుద్ధీ! నిరపరాధులమైన మమ్ము శపించితివిగాన పాపాత్మా! నీవును మావలెనే భూలోకంబున నీచయోనులందు జన్మించి గొప్పపిడుగుపడుటంజేసి ఘోరమృత్యువాతం బడుదువుగాత'' మని శపించిరి. వైశ్యులు శంకరుని సన్నిధికరిగి జరిగినవృత్తాంతంబు నివేదించి యాతని పాదకమలమ్ములఁ దవిలిన మానసంబులతో సుఖంబుగా నుండిరి.

అదేసమయంబున దక్షప్రజాపతి సకల దేవతాగణంబులను బ్రాహ్మణోత్తములను నాహ్వానించి దేవదేవుండగు నీశ్వరుని బిలువక యశ్వమేధయాగంబును జేయ

నారంభించెను. అంతకుమున్నే పరమేశ్వరుండు దక్షప్రజాపతిపుత్రిక యగు సతీదేవిని బరిణయంబాడి ధర్మంబుల నొనరింపుచు నా సతితోఁ గైలాసంబున విహరింపుచుండెను. ఈశ్వరుండును దక్షుండు నన్నాహ్వానింపక సకలదేవతాగణంబులను బిలచెనుగదా, యన్న యవమానంబుచేఁ గుపితుఁడై యక్కడికి కేగక యుండెను. అత్తటి యజ్ఞవాటంబుననున్న దధీచుండను మహాముని యజ్ఞశాలయం దీశ్వరుండుదక్క తదితర నిలింపులంద ఱుండుటఁగాంచి, దక్షప్రజాపతితో నిట్లు చెప్పెను: "ఓదక్షప్రజాపతీ! ఎందులకిట్లపచారంబుఁ గావించితివి? ఈ యజ్ఞంబునకు సమస్తదేవతాగణంబులఁ బిలువనంపించితివి! నీ కల్లుండును సమస్తలోకపూజ్యుండును నైన శంకరు నేల రావింపవైతివి? బ్రహ్మాది సకలదేవతలు నెవని యాజ్ఞనుసారంబు నడచుకొందురో, యట్టి పరమేశ్వరు నెందులకు గౌరవించవైతివి? ఏ దేవుం డన్నింటికిని బ్రభువో యట్టి యప్పరమేశ్వరుని నీ వేల పూజింపవైతివి? ఆతని కీ దేవతలందఱును సాటియగుదురే" అని యడుగఁగా దక్షప్రజాపతి యిట్లనెను: "ఓ మునీంద్రా! శివునివిషయము మీ కేమి తెలియును? ఈతండు మేలొసంగలేఁడు, రుద్రరూపుఁడు, సకలలోకంబుల సంహరించువాఁడు, తమోగుణమే ప్రధానముగాఁగలవాఁడు, కడుంగడు బీదవాఁడు, దిగంబరుఁడు, మానిసిపుఱ్ఱెలతో బిచ్చమెత్తుకొనువాఁడు, ఈతఁ డెట్లు సర్వాంతర్యామి"యని బదులు పలికెను.

అంత నా యజ్ఞంబును నెఱవేర్పవచ్చినవారును, యజ్ఞంబును జూడవచ్చినవారును, సరేసరేయని విష్ణుమాయావిమోహితులై పలికిరి. అయినను బరమపూజ్యుండగు దధీచమహాముని దక్షునిగాంచి "ఓదక్షప్రజాపతీ! పూజింపఁదగనివాని బూజించినను, బూజింపఁదగినవానిఁ బూజింపకున్నను మానవుఁడు మహాపాపము నందును. దీనికి సందేహము లేదు. ఎచ్చట దుర్జనులకు గౌరవంబును, సజ్జనుల కగౌరవంబును గలుగునో యచ్చట తప్పక దైవవశంబున వెన్వెంటనే సహింపరాని దండన విధింపఁబడును. కాన మీరు తపోబలమంతయు వ్యర్థముగావించుకొని నరకలోకంబునకుం బోండు. విష్ణుమూర్తియు శివవిరోధియై దన్నాశ్రయించినవారియెడ నుదాసీనతఁ జూపును. ఆతఁడెట్టి సహాయంబును జేయకుండుఁగాక!" యని మునీంద్రులనెల్ల శపించి సర్వపాపహారియగు పరమేశ్వరుని మనసార స్మరించుచుండెను. సతీదేవి తండ్రియజ్ఞంబు సేయుట విని తమ్ముఁ బిలువకపోయినను, పోవలదని భర్తయడ్డగించినను దండ్రియగు దక్షప్రజాపతి చేయుచున్న యాగంబుఁజూచుటకై పోయెను. సమస్త లోకంబునకును

శుభంబులొదవించెడు శంకరుండు నారదమునివలన దక్షయజ్ఞంబందు సతీదేవిపడిన పరాభవాదులను విని మిక్కిలి యుగ్రుండై దక్షయజ్ఞంబు ధ్వంసంబుం జేయఁదలంచి సహస్రశీర్షంబులును సహస్రనేత్రంబులును సహస్రబాహువులును గలిగి యాగ్రహంబు నోర్వలేనివాఁడును వాఁడి కోఱలుగలవాఁడును నగు వీరభద్రుని బుట్టించెను. వెంటనే యాతండు గరంబులను ముకుళించి శివునెదుట నిలువంబడి యాజ్ఞయేమియని యడుగఁగా, నీవు వెంటనేపోయి దక్షమఖంబు ధ్వంసంబుగావింపుము. నీకుమేలయ్యెడు గాత మని చెప్పి పుచ్చెను. అంత వీరభద్రుండు ప్రమథగణంబుల వెంటనిడుకొని గుహాంతరాళంబునుండి బయల్వెడలిన సింహంబువలెఁ బ్రయాణమై దక్షునియజ్ఞవాటంబుం జేరి యామఖధ్వంసంబుఁ గావింపంబూనెను. కొందఱు ప్రాగ్వంశమును విఱిచివేసిరి. మఱికొందఱు యజ్ఞశాలను బడద్రోసిరి. ఇంకఁ గొందఱు యజ్ఞపాత్రంబులఁ బగులఁగొట్టిరి. వేఱుకొందఱగ్ని జ్వాలలఁ జల్లార్చిరి. మిగిలినకొందఱు యజ్ఞగుండంబులందు మలమూత్రాదుల విసర్జించిరి. యజ్ఞవేదికలను ద్రొక్కి పడద్రోసిరి, ఋత్విక్కులగు మునీశ్వరులను బాధించిరి. మునికాంతలను బెదరించిరి, మణిమంతుండగు భృగుమహామునిని గట్టివేసిరి. వీరభద్రుండు ప్రజాపతిని గట్టివైచెను. చండీశ్వరుండు పూషయను దేవతను గట్టివైచెను. నందీశ్వరుఁడు భగుఁడను దేవతనుబట్టెను, భృగుండు మీసంబులను దువ్వుచు పకపక నవ్వుటంజేసి యందఱుంజేరి భృగుని మీసంబులను బెఱికివైచిరి. అణిమను శపించినప్పుడు పూషుండనువాఁడు పండ్లిగిలించుచు నవ్వుటంజేసి కాలింగునిపండ్లు పగులఁగొట్టినట్లు ఆ పూషుని పండ్లూడఁగొట్టిరి. అంత వీరభద్రుండు రౌద్రుండై దక్షునివక్షంబునం ద్రొక్కిపట్టి వాడియంచుగలకత్తితోఁనాతనిశిరమును గోసివైచి జ్వాలాజాలములతో మింటనెగయు నగ్నిహోత్రమునందా శిరమును వ్రేల్చెను. ఈరీతిగా వీరభద్రుండు దక్షయజ్ఞమును ధ్వంసముఁ జేసినవాఁడై కైలాసమునకుఁ దరలెను. ఈ విషయమును బూర్వమే తెలిసినవారై భగవంతుఁడగు బ్రహ్మయు విశ్వరూపుండగు విష్ణుమూర్తియు నా దక్షయాగంబునకుం జనరైరి. విశ్వనిర్మాతయగు విరించి పరమేశ్వరుని స్తోత్రము చేయఁగా నాతండు ప్రసన్నుండై యజ్ఞపురుషుని జీవింపఁజేసెను. అంత సమస్తభూతంబులును బరమేశ్వరుని స్తుతించెను. యజ్ఞపశువగు మేకయొక్క తల దక్షుని మొండెముతో జేర్పంబడెను. అప్పుడు దక్షుండు నిద్రనుండు మేల్కాంచినవానివలె లేచి నిలచి మ్రోలనున్న శివుని జూచెను. అంతఁ బ్రజాపతియు దక్షప్రజాపతియు నిలింపులును

గరుణాఖుండైన పరమేశ్వరుని నానావిధములగు స్తోత్రములచే వినుతించి నిజవాసంబుల కరిగిరి.

ఇట్లు సతీదేవి తన పూర్వదేహంబును వదలి హిమవంతుని ధర్మపత్నియగు మేనకయందు జన్మించెను. పిమ్మట నీశ్వరుండు సతీవియోగంబుచేఁ గుందుచు హిమవన్నగంబున నుగ్రతపం బాచరించుచుండెను. అంతఁ గొన్నివత్సరములు గడచిపోఁగా, తారకుండను మహాసురుండు బ్రహ్మనుగూర్చి యుగ్రమైన యుత్తమతపంబొనర్పఁగా లోకాధినాథుండగువిరించి తారకాసురునియందు దయగలవాఁడై యనేకవరంబులొసంగెను. ఆ తారకాసురుండు బ్రహ్మవరంబులవలన గర్వితుండై బాహుబలాన్వితులును గాటుకకొండలం బోలినవారును రథగజతురంగములఁ గలవారు నైన రాక్షససమితిని సాయముగాఁ గైకొని బాహుబలము ప్రకాశింపఁగా భూమినంతయు నాక్రమించెను. దేవేంద్రుని జయించెను. అగ్ని యమ నైరృతి వరుణ వాయు కుబేర ఈశానుల గర్వ మడంచివైచెను. యక్షగంధర్వ కిన్నెర కాంతలను జెరపట్టెను. తపోనిధులును బుణ్యాత్ములునైన బ్రాహ్మణుల నెందఱనో వధించెను.

అంత నొకానొకనాఁడు దేవ పన్నగ గంధర్వ యక్ష రాక్షసాదులు దేవేంద్రాగ్నులను ముందిడుకొని బ్రహ్మలోకమున కేగి యావిరించిని గరంబుల ముకుళించి స్తుతించి సవినయంబుగాఁ దమయిక్కట్టులను విన్నవించుకొనిరి. బ్రహ్మయు వారిమొఱనాలకించి, దేవతలారా! భయమందవలదు. రాక్షసులు కడుంగడుక్రూరులు. పార్వతీపరమేశ్వరసంతానముచే నా తారకుండు మడియంగలడు. భగవానుండగు నప్పరమేశ్వరుండు హిమవన్నగశిఖరంబున హిమవన్నగంబుమాడ్కి గదలక మెదలక యత్యుగ్రతపంబొనర్చుచున్నవాఁడు. ఆ హిమగిరియందే మేనకాత్మజ యగు గౌరీదేవి పెరుగుచున్నది. వారిరువురకును మన్మథసాహాయ్యంబునఁ బరస్పరప్రేమను గల్పింపుఁడు. సత్వరమే పరిణయంబొనరింపుఁడు. అద్దియే యిప్పు డొనరింపఁదగిన కార్యము. పార్వతీపరమేశ్వరులపరిణయంబు జరిగెనేని, మీ యభీప్సితంబులు వెన్వెంటనే నెరవేరంగలవు. మీరు వేగమే పొండని కమలాసనుం డానతీయఁగా నిలింపులుదఱు విరించి యానతింబడసి మేరుగిరిశిఖరంబునం దాసీనులై మంతనంబు గావించిరి. ఆ సమయంబున దేవగురువైన బృహస్పతి దేవేంద్రునిగూర్చి మెల్లనిమాటల నిట్లనియె: "దేవేంద్రా! శంకరుఁడు హిమవన్నగశిఖరంబున వాంఛలను వ్యజియించి రజస్తమోగుణంబుల దిగనాడి జితేంద్రియుండై నిశ్చలుండై తపస్సొనరించుచున్నాఁడు. ఆ పరమేశ్వరునకుఁ

పార్వతీకన్యయం దనురాగంబుగలిగించి సకలలోకంబులకు క్షేమకరంబైన వివాహ
బొనరించి విజయం బందుము. ఈ కార్యంబుల నెఱవేర్చుటకు మహాత్ముండైన మ
థుండే సమర్థుండు" అని నుడువగా దేవేంద్రుండు సావధానుండై మన్మథుని మనస
తలంపఁగా నతండు వెంటనే నిజాయుధంబులతోఁ గట్టెదుట నిలువంబడి ప్రణామిల్లెన
దేవేంద్రుం డానందబాష్పపూర్ణంబులగు సహస్ర నేత్రంబులతో నతనిం గాంచి య
రాగపూరితవచనంబులతో నా మదనున కిట్లనియె. "వత్సా! నీవు కుశలంబే గద
పిలిపించిన కార్యంబు సెప్పెద నాలకింపుము. హిమవద్గిరిశిఖాకుహారంబం దీశ్వరుం
జితేంద్రియుండై తపంబొనరించుచున్నాడు. ఓ మహాబాహూ! నీ వాతని దృఢధైర్య
బును విడదీయవలయు. మిత్రమా! స్వర్గరాజ్యము నీవలన శాశ్వతంబుగా నుండునట్
చేయుము" అని దేవేంద్రుం డానతిచ్చిన వెంటనే మన్మథుండు గడుంగడు నుత్సాహ
వాఁడై రమ్యగంభీరవచనంబులతో నిట్లనియెను: "దేవేంద్రా! ఇప్పుడే నేను చెఱకువిల్లు
గైకొని మేరువే ధనువుగాఁగల యాపరమశివుని నెదిరించి లోఁబఱచుకొనవీలుగా
శంకరుని ధైర్యంబు వీడఁజేసెదను. నా యమ్ములు పూవులైనను నా యంపము
దెబ్బ కందఱును లోఁబడవలసినదే. ఆకు లలములఁ దినువారును, వాయుభక్షులున
నారబట్టలఁగట్టువారును, జింకచర్మమును ధరించువారును, సత్త్వగుణాలును, రజోగు
రహితులును, బ్రహ్మజ్ఞానులును, పాపరహితులును, జితేంద్రియులునై పరబ్రహ్మ
సాక్షాత్కారము గల యోగులుసైతము నావింటినుండి వెడలు నల్లగలువ యమ
నమ్ము తగిలినచో డస్సి అప్సరస్త్రీలపాదంబులకు నమస్కరింపుచు బ్రతిమలాడుకొను
చుందురు. వేయేల? చరాచరంబైన సకలజగత్తును నాతామరపూవువింటి మొ
నున్నయది. ఈ శివుండు నాకు లెక్కలేదు. దేవేంద్రా! తమ యాజ్ఞయయ్యె నే
యిపుడ పోయి యాతనిధైర్యంబు సడలించివత్తును" అని పుష్పబాణుండు దేవేంద్ర
నితోఁ జెప్పి, జిలిబిలి పలుకుల పలికెడి చిలుకలుగలదియుఁ జందనపర్వతంబున జన్మిం
నదియుఁ బాములతిండియైన మలయమారుతంబను రథం బధిరోహించి, చలితమత్స్యాం
మగు ధ్వజపటంబు పటపటధ్వనులచే ముజ్జగంబుల బెదరించుచు, సంపూర్ణచంద్రబిం
మనెడు ఛత్రంబు బట్టుకొని, ఝుమ్మను పాటపాడు తుమ్మెదలును మదోన్మత్తములగ
గోరువంకలును పంచమస్వరగానముసేయు కోయిలలును నొక్కుమ్మడిగా నుతింప
చుండ, మాధవుండుతోడై వచ్చుచుండ ప్రయాణమై బయలుదేరి నానావిధతరుషండ
మండితంబును గిరిజాచరణరేఖాంకితంబును నైన హిమవద్గిరిశిఖరంబు సేరెను.

అంతట వసంతుండు మకరందరసంబులు మేనిం బడుపుచుండ మదోన్మత్తపికంబులు గల శాఖాగ్రంబులతో గగనంబు నొరయు రసాలంబులు శోభను గలిగించుచుండఁ గలయం దిరుగుచుండెను. నవనవలాడు నేలకీతీగెలతోఁ బెనగి మినమినలాడెడి పొన్నపూల గుత్తులును, చందనంపు మ్రాని తొఱ్ఱలలోఁ బాములు తినగా మిగిలిన మరుల్లకమనెడు సుగంధద్రవ్యంబును చిఱునవ్వులను హారరసంబులతో వెలుంగు తీవియలను లలనఁ గౌఁగిలించుకొనుటవలనఁ గలిగిన ఆనందంబుచేతనో యన్నట్లు పైకెఁబోవునవియు మనోహరంబులును కుట్మలశోభితంబులునైన చాంపేయ తఱువుల కాటపట్టులును, విఱియంబండిన పండ్లయందును కమలషండంబులందును మొగ్గలందును బూదేనియలుగ్రోలు తుమ్మెదగుంపులు గలిగి దిక్కులన్నింటను వెలుంగుచు లతాప్రతానాకీర్ణంబులైన కేసరవృక్షంబులును, మిక్కిలి యెత్తైనచిగుళ్ళతో నిండిన యశోకతరువులును, భృంగవితానంబు లెగురుటచే దట్టంపునీడలుగల పొగడమ్రాకులును ప్రకాశింపుచుండగా సర్వజన సమ్మతుండై వసంతుండు విచ్చేసెను. ఆ సమయంబున నలరువిల్తుండు దెలివిఁదప్పి మేనుసమధీసుండును సచ్చిదానందరూపుండును సర్వాంతర్యామియునైన పరమేశ్వరుని బరికించి పూవింటిని దాల్చెను. ఆ వింటియందు నెల్లరిని మోహింపఁ జేయునదైన నల్లగలువ మొగ్గయనెడు బాణంబు సంధించి ఆకర్ణాంతంబు గట్టిగా లాగి గుఱివెట్టి యేయగా నా హరునురమ్మున నాటెను. మన్మథుని సాహసమునకై సకలభూతంబులును హాహారవంబులు గావించినవి. పరమేశ్వరుండు సమాధినిష్ఠకు విఘ్నముగల్గుటంజేసి కడుంగడు నలిగినవాఁడై, కోటిసూర్యప్రభాపటలంబుతోఁ దీక్ష్ణమైన కనుబొమ ముడివెట్టి, తన మూఁడవకంటిని దెఱచి దానినుండి వెలువడు నగ్నికణంబులచే ధగధగమని వెలుంగంజేయుచు బ్రహ్మాస్త్రమును మీఱిన జ్వాలలు చెలరేగునట్లు చేసెను. ముక్కంటి మూఁడవకంటినుండి వెలువడిన నిప్పునకు వెఱచి, తననుండి వెలువడిన వెలుఁగునఁజరించువారెల్ల పఱుగులిడుచుండ, నాయగ్ని మన్మథునిపైఁ బడఁగా నాతఁడును ధనుర్బాణంబులతోఁ గూడ చరాచరజీవాళి భీతిల్లుచుండ నగ్నింజొచ్చిన మిడుతవలె నొక్కనిముసంబులో బూది యాయెను. అక్కటా! జగమున దుర్జనుల కెన్నడయినను గీడు మూడకుండునా!

పదంపడి, దేవగంధర్వపన్నగయక్షచారణాదులును, ఇంద్రాది దిక్పాలకులును బ్రహ్మను మున్నిడుకొని పశుపతిసన్నిధి కరిగి గంభీరవచనంబులతో "నో దేవదేవా! దయాళూ! భక్తవత్సలా! జయము, జయము. నీచే సృష్టింపఁబడిన జగంబులపై

కనికర ముంచుము" అని వేవిధములుగాఁ గొనియాడగా రతీకాంత తన భర్త ముక్కంటి కంటిమంట భస్మమైనందులకు మిక్కిలి దిగులొంది మోహపరవశయై ముఖంబునఁ జేతుల నప్పళించుకొనుచు కురులు విరియఁబోసికొని గొంతెత్తి యేడ్చుచు మనోనాథునిగూర్చి యిట్లు పలవింపఁదొడంగెను.

ప్రాణనాథా ! మనోనాయకా ! కడుపుపగిలెడి దుఃఖాంబునిధిని నన్ను విడిచి పోయినావే. అక్కటా ! ని న్నెడబాసి యింత తడవు బ్రతికియున్నానుగదా ! నా హృదయము శిలానిర్మితమో, వజ్రనిర్మితమో యై యుండవలెను. మందహాస సుంద రంబైన కాంతిమంతంబైన నీ ముఖారవిందంబును నే నెట్లు చూడగలను ? లోకైకవీరా ! నీ కిట్టి యకాలమరణము వచ్చునని కలనైనఁ దలంచనైతినిగదా ! నీవు పరమేశ్వరునిపైకి దండెత్తివచ్చినపుడు, బలవంతునిమీఁది కెత్తివచ్చుట మనచేటుకేనని నెత్తినోరుపెట్టి నేఁ జెప్పినమాటలు పెడచెవిం బెట్టితివిగదా ! నీ కిట్టి యాపద సంఘటిల్లుట నీ గ్రహ చారంబేగాని వేఱుగాదు.

అని యివ్విధంబున రతీదేవి, పెద్దయుం బ్రొద్దు దుఃఖించి యతని జీవనో పాయంబును దైవవశంబునఁ దెలిసికొనఁగలిగి కొంతవఱకు సంతసంబంది జగన్నాథుఁ డగు పరమేశ్వరు నీరీతిగా నుతింప మొదలిడెను.

"మహానుభావా ! అనంతరూపా ! విశ్వవ్యాపీ ! అనాథనైన నన్ను రక్షిం పుము. ఓ జగన్నాథా ! వేదాది ఉపనిషజ్జాలంబులన్నియు నిన్నుఁగొనియాడలేకున్న నిన్ను నుతింప నే నెంతటిదానను ? శంకరా ! నేను ధవునివిడిచి విధవనై మనలేను. శరణాగతవత్సలా ! నాకుఁ బతి నొసంగుము. శరణుచొచ్చినవారికి సకలాభీష్టముల నొసంగుదువని పెద్దలు పలుకుదురు. నేను నిన్ను శరణుఁజొచ్చితిని. నాకు పతి నొసం గుము. అట్లు సేయవేని నాభర్తను దహించిన నేత్రానలమునందే పాపాత్మురాల నగు, నన్నుంచుము" అని యిట్లు శంకరుని పాదకమలంబులపైఁ బడి పలవించెను.

దయామయుండగు నా మహాదేవుండు ప్రసన్నుండై శరచ్చంద్రకిరణసదృశంబు లగు దృక్కులతో రతింగాంచి యోదార్చి యిట్లనియె. వత్సా ! నీయందు నాకెల్లపుడు ప్రేమగలదు. నీవు పతివ్రతారత్నమవని యెల్లరు నిన్ను నుతింతురు. నీభర్త గర్వించి యున్నాఁడు. నేను బాహ్యాంతరములఁ బరిశుద్ధుఁడనై యితరులకుఁ గీడుచేయక

యోగనిష్ఠతో నిరాహారుఁడనై తపంబుచేయుచుండ నా సమీపమునకువచ్చి గర్వముతో నన్ను నిశితవిశిఖములతోఁ గొట్టెను. అందువలనఁ గోపంబు గలిగి నిప్పుకంటి చిచ్చుతో నతనిని బూడిదచేసితిని. నీవు పతివ్రతవుగావునఁ బ్రసన్నుఁడనైతిని. వరం బిచ్చితిని, వేడుకొనుమనఁగా రతీదేవి పతిని గోరెను. "లోకంబునఁ జచ్చినవారు బ్రదుకరు. అయినను నా యనుగ్రహమున జీవించును. కాని నీకంటికి మాత్రము కనబడును. ఇతరుల కేరికిని గానరాక యనంగుఁ డని ప్రసిద్ధికొందుంగాక" అని శంకరుఁడు రతీదేవికి వరంబొసంగెను. రతీదేవి హర్షమానసయై యెదుట ప్రియునింగాంచి మిక్కిలి యానందమునందెను. అనురాగ వారినిధి మునింగి భర్త నాలింగనముఁ జేసికొనినది. ఆ దంపతులు భక్తితోఁ బరమేశ్వరుని భజింపుచు యథేచ్ఛగా వెడలిపోయిరి. దేవతలు గిరిజాకాంతపై, కల్పకుసుమములఁ గురిసిరి. దేవజయభేరులు మ్రోగెను. అప్పుడు విరించియు, ముకుళితకరకమలుండై పరిపరివిధముల నా పురాణదంపతులఁ గొనియాడెను.

ఒకప్పుడు నారదమునీంద్రుఁడు కృష్ణాజినధారుఁడై బంగారు మూంజిని మొలకుఁ జుట్టినవాఁడై విపంచికాతంత్రులను మీటుచు జపమాలికను కమండలువును ధరించి, గానముచేయుచు శంకరుని జూడఁగోరి కైలాసంబున కేతెంచెను. ఈశ్వరుండును గౌరవించి నారదున కుచితాసన మొసంగెను. బ్రహ్మమానసపుత్రుఁడు పరమేశ్వరునకుఁ బ్రీతితోఁ హర్షబాష్పములతోఁ బాద్యమొసంగి, వాక్కుసుమములతోఁ బూజించి. వీణాగానామృత రసమును నివేదించెను. అప్పు డా ముక్కంటి "బ్రహ్మపుత్రా! తాపసులలో నీవు మిక్కిలి ఘనుడవు. ఏ యే పుణ్యప్రదేశములను గాంచితివి? ఏ యే తీర్థములను సేవించితివి? వినఁ గౌతుకముగా నున్న" దని పరమేశ్వరుండు కోరఁగాఁ బులకాంకితుఁడై నారదుఁ డిట్లనియె. ఓ లోకైకనాథా! కరుణాసింధూ! నేను గంగాది పుణ్యస్రవంతులను, హిమవంతము మొదలగు నున్నత పర్వతములను గాంచితిని. ఆపవిత్రఫలంబులెల్ల నీ పాదదర్శనరూపంబునఁ బరిణమించినవి. ఇట్టి సరసాలాపములకు బిమ్మటఁ మహేశ్వరుం డిట్లనియె నారదా! నీ వెన్నియో జగంబులఁ దిరిగివచ్చితివి గదా! ఏ కన్యక రూపలావణ్య యౌవ్వనసంపదలతో ననాఘ్రాతకుసుమము వలె నలరారుచున్నదో, చెప్పు మన నారదుం డిట్లనియె: "మహేశా! మీకుఁ దెలియని దొక్కటియు లేదు. నాయందలి వాత్సల్యముచే న న్నిట్లడిగితిరి. ఆలకింపుఁడు. హిమవంతుని గృహమున మేనకాత్మజ యగు నొకకన్యక పెరుగుచున్నది. ఆ కన్యక

మిక్కిలి సౌందర్యవతి, మహాత్మా! మీ కా కన్యక తగియున్నది. మీ యం దామె హృదయము నుంచి సదా ధ్యానింపుచున్నది. దేవా! లోకహితంబును గోరి యామెను జేపట్టుడు. మీ రుపేక్ష చేయుదురేని, ఆమె ప్రాణంబుల విడువఁగలదు" అని వివరంబులను దెలిపి బ్రహ్మమానసపుత్త్రుఁడు వెడలిపోయెను.

అంతట ఆదిపురుషుండైన పరమేశ్వరుఁడుకూడ కామమోహితుఁడై హిమవత్పర్వతమునకుఁ బ్రయాణమాయెను. ఆ సమయంబున గిరికన్యక చెలిమికత్తెలతోఁ బూవులు కోయుటకై యుద్యానవనమునఁ దిరుగుచుండెను. అప్పుడు చంద్రమౌళీశ్వరుండును, నారదుఁడు నుడివినంతకంటె నెక్కుడు సౌందర్యముగల గిరిజాదేవిం గాంచి మిక్కిలి మక్కువతో నానందవారినిధి మునిఁగెను. మన్మథ ధనుష్టంకారము వినుటవలన ధైర్యము చెడి యెక్కువ దీనత నొందెను. మన్మథుఁడును తన పని ఫలించుటంజేసి యెక్కుడుసంతసం బందెను.

ఒకప్పుడు గిరిజ మానససరస్సునందు జలక్రీడను సలుపఁగోరి, చెలిమి చెలులతోఁ దేటనీటియందుఁ బ్రవేశించెను ఆ సొగసుగత్తెల ముఖకమలముల కాంతితో, వెండ్రుకల నెడు పాచితీగలతో, కుచముల నెడు చక్రవాకదంపతులతో నా సరోవరము మిక్కిలి వెలుఁగొందుచుండెను. కమలగంధంబులగు జలంబుల నొండొరులపైఁ జల్లుకొని, మకరందరసవాహినితో, పుప్పొడితో, వికసితములగు చెంగల్వలతో, తామరలతో, కెల్లుపువ్వులతో నొకరినొకరు గెల్వఁగోరి సమరములు సలుపుచు జలక్రీడలను గావించిరి. పిమ్మట కామినులందరు గట్టుసేరి పట్టుబట్టలం గట్టిరి. నవరత్నఖచితము లగు నలంకారములతో నిజాంగంబుల నలంకరించిరి.

అంత నొకనాఁడు పార్వతి శివపూజను సేయఁగోరి గంగాస్రవంతిలోని యిసుకతో శివలింగమును నిర్మించి, పరమేశ్వరుని ధ్యానించి భక్తియుక్తంబైన మనంబుతో నావాహనంబుసేసి, గంధపుష్ప ధూపదీప నైవేద్యంబులొసంగి భక్తిపూరిత హృదయంబుతోఁ బ్రార్థనంబులఁగావించెను. అంబికాదేవి పరమేశుఁ బ్రార్థించి నమస్కారములర్పించి సప్తతంత్రీవిపంచిఁ జేపట్టి నానావిధ మధురరాగంబులతో నారోహణావరోహణంబులు పొందుగాఁ గుదురునట్లు మృదువుగా వాయించెను. ఆ యమృత వీణానాదమునకుఁ బర్వతమందలి గండశిలలన్నియుఁ గరగిపోయెను. మృగములన్నియు భయమువిడచి విచ్చలవిడిగాఁ దిరుగ నారంభించినవి. క్రొన్ననలు పల్లవములుగల

తరు లతాదులు నీరసములయ్యెను. ఆ తఱి నీశ్వరుండు పార్వతితో సంభాషింప గోరి, ముదుసలి విప్రవేషంబుం దాల్చి యామె చేరువకు వచ్చెను. పార్వతి మిషావృద్ధ విప్రుని దవ్వుదవ్వుననే చూచి సఖులతో నెదురేగి సాష్టాంగముగాఁ బ్రణమిల్లి యర్ఘ్యపాద్యాచమనీయంబుల నొసంగి కుశాసనంబుపైఁ గూర్చుండఁజేసెను. కృతక బ్రాహ్మణుండైన పరమేశ్వరుండు ప్రసన్నుఁడై పార్వతింగాంచి, "కల్యాణీ! శుభంబగుఁ గాక! నీ విపు డొనర్చిన పూజలచేతను, దపస్సుచేతను శంకరుఁడు నీ మనోనాయకుఁ డగునుగాక! నీ వెవ్వని పుత్రికవు? మృదువైన నీదేహంబు నెందుల కిట్లు గాసిపాలు చేయుచున్నావు? కోమలాంగీ! ముల్లోకములందును నీయట్టి సుందరమైన కన్యకలను గాంచను. నీ మనోరథంబు నుడువవచ్చును" అని పలికెను. ఆ మాటలకుఁ బార్వతి బదులుసెప్పఁగోరియు సిగ్గుచే మౌనంబును దాల్చియుండెను. అత్తరి దాపున నిల్చి యున్న నెఱజాణయగు చెలికత్తె మాయావిప్రునితో నిట్లనియె:—మహాత్మా! ఈమె పర్వతరాజగు హిమవంతుని కూతురు. లోకక్షేమంకరుండగు శంకరుని భర్తగాఁ బడయఁగోరి భక్తితో నాతనిని భజింపుచు తపం బాచరింపుచున్నది. ఆ మహానుభావుఁ డెప్పు డామెపై దయఁదలఁచునో యెఱుఁగము. మీరు త్రికాలజ్ఞానులుగాఁ గనిపించు చున్నారు. మా సందియములఁ దీర్పవలసినదిగాఁ బ్రార్థించుచున్నా మనెను. శశిశేఖ రుఁడు మోమునఁ జిఱునవ్వు దొలకాడ యిట్లనియె—"ఓ ముగుదరాలా! ఆగర్భ యాచకుఁడగు శివుని గోరుచున్నావా? ఇంతవెఱ్ఱివా రెవరైన నుందురా? ఆ బిచ్చగాని కాపురము వల్లకాడు. కట్టుకొనుబట్ట నెత్తురుకారుచుండు నేనుఁగుతోలు. తిండియో బిచ్చమెత్తుకొని తెచ్చుకొన్న భోజనము. దేహమున కెప్పుడు వల్లకాటి తెల్లనిబూడిద పూసికొనుచుండును. రూపమా వికారము. ఎముకలదండలు పుఱ్ఱెలు దండలుగా ధరించుకొనును. దయ్యములు భూతములు ఆయనకు స్నేహితులు. ముసలియెద్దు వాహనము. జాతి లేదు. నీతి లేదు. తల్లి లేదు తండ్రి లేఁడు. చుట్టములు లేరు. సుగణ ములు లేవు. దుర్గుణములు లేవు. ఎక్కడపుట్టినాఁడో ఎవ్వారికిని తెలియదు. పిచ్చిదానా! ఇట్టి యవలక్షణంబులుగలవానినా పెండ్లియాడునది? ప్రాయముగలవారును, అందము గలవారును, అదృష్టవంతులును, మహాత్ములు నైన వేల్పు లెందఱు లేరు? వారిలో నొక్కసంపన్నుని వరింపుము అని నుడివెను.

పార్వతి కర్ణకఠోరంబులైన యామాటలనువిని సహింపలేక, కృతకముని నెఱ్ఱని కన్నులతోఁ జూచుచుఁజూచుచు, కన్నులనుండి యశ్రుకణంబు లుఱల, డగ్గుత్తికచే

గంతస్వరంబు హీనంబుగాగ, 'మహాదేవ, మహాదేవ, మహాదేవ'యని ముమ్మాఱుచ్చరించి, కరకమలంబులతోఁ జెవులు మూసికొని మేమనంజాలక యూరకుండెను. అప్పుడు పార్వతిసఖులందఱును గోపపడి 'బ్రాహ్మణాధమా! నీచుఁడవుగాఁ గన్పట్టుచున్నావు. ఛీ! లేచిపో'యని పలికిరి. వారిలో నొక్కతే యాబ్రాహ్మణుని జడలు పట్టి లాగి పకపక నవ్వెను. వేఱొక్కతె యాతనిచేతనున్న పుస్తకమును దీసి దాచెను మఱొక్కతె కోపముతోఁ గమండలువునుబట్టి లాగెను. ఈరీతిగా బాధింపుచుండగాఁ బార్వతి నివారించి "చెలులారా! యీతఁడు ముదుసలి విప్రుడు. జడుఁడు. బుద్ధిస్థైర్యంబులు లేనివాఁడు. తెలివితప్పి యేదియో చెప్పినాఁడు. దీని కింతఁగోపము సేయఁగూడదు. వలయునేని యిక్కడనుండి వెడలఁగొట్టుఁడు" అని చెప్పి మిన్నకుండెను. చెలులందఱు వానినిదఱుముసన్నాహంబు తలపెట్టునంతలోనే చంద్రశేఖరుఁడగు పరమేశ్వరుఁడు శశికళను శిరంబున ధరించి, నాలుగుచేతులుగలవాఁడై, కిరీటము, హారము, భుజకీర్తులు మొదలగు నవరత్నఖచితభూషణములతో దరహాసవదనుఁడై సాక్షాత్కరించెను. ఆచేడియ లందరు విస్మయముఁజెంది, ఆనందాబ్ధి నిమగ్నులైరి. చేతులను జోడించి నిలువంబడిరి. గిరిజాదేవి లజ్జాపరవశయై ముందునకుఁబోక వెనుకకురాక యట్లే నిలిచిపోయెను. పరమేశ్వరుఁడు పాణిఁబట్టి ప్రియముగా భాషింపఁగాఁ బార్వతి 'పరాధీన'నని మిన్నకుండెను. ఈశ్వరుండు గ్రహించినవాఁడై కైలాసంబున కేగెను.

పిమ్మట పరమేశ్వరుఁడు సప్తఋషుల రావించి జరిగిన వృత్తాంతమును వినిపించి పార్వతిని దననిమిత్త మడుగుటకై వారిని హిమవంతునికడ కంపెను. హిమవంతుఁడు సప్తఋషులను బ్రీతిపూర్వకముగా నాదరించి విషయమును విని ఆనందభరితుఁ డాయెను. సప్తఋషులు మహేశ్వరుని కీ వృత్తాంతమును విన్నవించి ముహూర్తమును నిర్ణయించిరి.

ఇంద్రాదిదేవతలును, బ్రహ్మవిష్ణువులును, సమస్తఋషులును, రాజశ్రేష్ఠులును నానారత్నమయంబులయి దివ్యంబులైన కానుకలను గడువేడుకతోఁగైకొని సకుటుంబములుగా విచ్చేసిరి. ఆసమయంబున దేవతలు మ్రోయించు నమరభేరీనాదంబులును, కిన్నరకాంతలుగావించు వీణానిక్వాణంబులును, గంధర్వులుపాడెడి పాటలును, మహర్షులొనర్చు వేదనాదంబులును మిక్కుటంబులుగా వినిపించుచుండెను. బ్రహ్మవిష్ణువు లిరువురును పెండ్లిపెత్తనంబు వహించువారలై యందఱకన్నముందే యేగిరి. ఇంద్రాదిదేవతలందఱును జయజయధ్వనులతో నుతియింపుచుండిరి. శంకరుఁడు గణా

నాథుని వెంటనిడుకొని వెండికొండవలెనున్న తెల్లయెద్దునెక్కి మునీంద్రులందఱు బృహద్రథంతరాది సామగానంబులతోఁ గొనియాడ, కిన్నరాంగనలు వీణియలను మీటుచు గానముసేయుచుండ హిమవంతుని గృహమునకుఁ బయనమాయెను. చంద్రమౌళీశ్వరుఁడు రత్నభూషణాలంకృతుఁడై, హేమాంబరంబులఁదాల్చి వేడ్కఁగొలువు చుండెను. హిమవంతు డీవార్తనువిని స్వబంధువులగు మేరువు,పారియాత్రము,వింధ్యము, నిషధము, గంధమాదనము, మాల్యవంతము, హేమకూటము, సహ్యము, మైనాకము మొదలగువారు వెంటరా నెదురేగి పెండ్లివారిని గౌరవించి పరమేశ్వరుని స్తుతించి, రమ్యహర్మ్యములలో విడిది నేర్పాటుచేయించెను. బృహస్పతి వివాహ వేళయాసన్నంబయ్యెనని తెలుపఁగా నెల్లరును బరమేశ్వరునిబెండ్లికి తరలిరమ్మనిపిలిచిరి. వసిష్ఠ వామదేవాది మునులెల్ల సామంబులతో స్తుతింపుచుండఁ బరమేశ్వరుండు పర్వతరాజు కల్పించిన వివాహమంటపముపై నధిష్ఠించెను. హిమవంతుఁ డుత్సాహపూరితుఁడై గౌరీదేవికి మేటిదువ్వలువలఁగట్టి మణిమయభూషణంబులఁ దొడిగి, యా దేవిఁ దోడితెచ్చి యామె హస్తంబును బరమేశ్వరుని హస్తంబున నునిచెను. దేవ దుందుభులు మ్రోగినవి. పుష్పవర్షము గురిసినది. సూర్యచంద్రులు ప్రకాశించిరి. పదిదెసలు తేటతెల్లంబులై వెలుఁగుచుండెను. మలయ మారుతములు వీచెను. భూదేవి వృద్ధి నొందెను. పిమ్మట మంగళకరుండగు శంకరుండు పార్వతిని బరిణయమాడి పెక్కేండ్లు శృంగార రసాస్పద క్రీడా వినోదములతో నుండెను.

అంత నొక నా డీశ్వరుండు పార్వతీ పరిణయ మహోత్సవముచేఁ గడుంగడు సంతసించినవాఁడై స్వర్గలోకమునుండి దేవతలు దెచ్చిన మణిమయంబులగు కానుకలను, పాతాళలోకవాసులగు నాగంబులు దెచ్చిన యమూల్యములగు కానుకలను గాంచి, మనుష్యలోకమునుండి మానవులేమియుఁ గానుకలు దేకుండుట నెఱింగి, కుబేరుని గాంచి చిఱునవ్వుతో నిట్లనియె. "మిత్రమా! కుబేరా! నా వివాహమహోత్సవమునకు దేవతలును, దానవులును, నాగులును నానావిధ రత్న భూషణములు మున్నగు కానుకలను దెచ్చి యిచ్చిరి. భూలోకవాసులు మిన్నకున్నా రేమి" యని యడుగఁగాఁ గుబేరుండు చెలిమి పలుకులతో నిట్లనియె; "దేవా! మీకుఁ దెలియని దేమున్నది? అయినను నావలన వినఁగోరెదరేని విన్నవించెదను. బ్రాహ్మణులకు వేదపఠనము, యాజనము, వృత్తియనియు, క్షత్రియులకు బలపరాక్రమములను బ్రకటించుట వృత్తియనియు, వైశ్యులకు వస్తుక్రయవిక్రయాదులు వృత్తియనియు,

శూద్రులకు సేవకాదులువృత్తియనియు, నేర్పఱచితిరిగదా! అందులో వైశ్యులు దుష్కరతపాదులొనర్చి మహాత్ముఁడవగు మీయనుగ్రహంబువలన బ్రహ్మానంద సంధాయియైన నీకైలాసంబున నివసించుచున్నారు. కావున నిపుడు భూలోకంబున వస్తుక్రయవిక్రయంబులు సరిగా జరుగకున్నవి. మానవలోకంబునుండి యిందు వలననే కానుకలు రాకున్న"వని యానతీయగాఁ బరమేశ్వరుండు — "కుబేరా! వైశ్యు లిచ్చట నివసించుటవలన లోకవ్యవహారములు కష్టముగానున్నట్లు తోచుచున్నది. గోరక్షణము నవరత్నాది క్రయవిక్రయంబులు గొప్పగొప్ప మూలికలు బంగారు మున్నగులోహంబులును లభింపకపోవును. అందువలన దేవతలకును అతిథులకును బూజలు నిల్చిపోవును. యజ్ఞాదిపుణ్యకర్మలు నశించును" అనిపలికి వైశ్యులెల్లరనురావించి యిట్లనియె: "నాయనలారా! మీరు సంతసంబుతో భూలోకమున కేగి వస్త్రాదివస్తుసముదాయములను గొని వ్యాపారముసేయుచుఁ గొన్నివత్సరము లచ్చట యుండి పిమ్మట నాసన్నిధికిఁ జేరుఁడు." ఆమాటలకు వైశ్యులెల్లరును మారుపలుకక వల్లెయని బ్రహ్మదేవునకుఁదెలిపి భగవంతునిధ్యానించుచు ప్రయాణమైరి. బ్రహ్మ యానతినిగైకొని విశ్వకర్మ వైశ్యులనిమిత్తమై ఆంధ్రదేశములో గోదావరీప్రాంతమున జ్యేష్ఠశైలము, నిరవద్యకము, ఏలాపురము, వీరనారాయణము, విశాలము, శివపురము, అసంటము, సరసము, ధనదము, ధర్మపురము, జగన్నాథము, కళింగకము, పాంచాలము, పాలకుండము, త్రిగుణము, భీమము, ఘంటసాలము, పీఠికాపురము అను పదునెన్మిదిపట్టణములను నిర్మించెను.

ఆ పదునెన్మిది పట్టణరాజములందుఁ బెనుగొండపట్టణము రాజధానిగా నుండెను. కుసుమశ్రేష్ఠి యను వైశ్యసామంతరాజు పదునెన్మిది పట్టణములను బరిపాలించుచుండెను. ఆ నాడు 714 గోత్రజులైన వైశ్యనగరస్వాములు సకుటుంబములుగా నా పదునెన్మిది పట్టములందు నివసించుచుండిరి. అనాదిగా నార్యవైశ్యులు నూటరెండు గోత్రములవారు. (అప్పుడు వైశ్యగోత్రప్రవరలను శాస్త్రయుక్తంబుగాఁ జెప్పించుకొని, ఆర్య వైశ్యాచారముల స్వీకరించునెడల నెవ్వరినైనను వైశ్యులలోఁ జేర్చుకొనుచుండువారు. అట్లు చేర్చుకొనుచుండుటవలన 102 గోత్రములు 714 గోత్రములైనవి). స్వతస్సిద్ధము లైన 102 గోత్రజులుమాత్రము రాజధాని యైన పెనుగొండనగరమునందే నివసించుచుండువారు.

ఆర్యవైశ్యులెల్లరు నష్టైశ్వర్యములతోఁ దులదూగుచుండెడివారు ఆనాఁడు సర్వ పరిశ్రమలు వైశ్యులహస్తగతములైయున్నవి. ఎక్కువభాగము రత్నవ్యాపారులు,నావికా ప్రయాణమునం దనేకసులభోపాయములను గనిపెట్టిరి. ఓడవ్యాపార మన్న వారలకు మంచినీళ్ళమర్యాద. ఆర్యవైశ్యులందఱికిఁ బరమేశ్వరి యిష్టదేవత. ఎల్లరును నిత్యము పరమేశ్వరి నారాధించుచుండువారు. అప్పు డెవ్వరునుగూడఁ బరమేశ్వరీదేవ్యాలయమునకుఁ బోనిదే, పరమేశ్వరీపూజను గావించనిదే యేపనినిగూడఁ బ్రారంభించరు. ప్రాతఃకాలమునఁ బరమేశ్వరీపూజ ప్రధానకర్తవ్యము. కొందఱు వైశ్యులు భక్త్యాధిక్యమువలన సంతానమును బరమేశ్వరీదేవి కర్పించువారు. అట్లు పరమేశ్వరీదేవి కర్పించినబాలికలను గౌరబాలికలందురు బాలురను బాలనగరు లందురు. గౌరబాలికలు బాలనగరులనుమాత్రమే వివాహమాడవలెను. అన్యులను బెండ్లిచేసికొనఁగూడదు. గౌరబాలికలకుఁ బాలనగరులకు సంపూర్ణస్వాతంత్ర్యము గలదు. వారలను మహారాజుల కంటె నధికముగా గౌరవించుచుండిరి. వారలజీవితమంతయుఁ బ్రజోపయోగమునకే వినియోగ మగుచుండెడిది.

పదునెన్మిది పట్టణములను బాలించుచుండిన కుసుమశ్రేష్ఠిగారికిఁ బతివ్రతాశిరోమణి యగు కుసుమాంబ ధర్మపత్ని. కుసుమశ్రేష్ఠిగారు, ఉద్వాహకుల (పెండ్లికుల) గోత్ర సంభూతులు. దాతలలో నెల్ల దాత. నేతలలో నెఱనేత. సమస్తైశ్వర్యములు సమృద్ధిగాఁగలవు. కాని సంతానముమాత్రములేదు. సంతానముకొఱకా దంపతులు దేశదేశములందుండు దేవతానాథులందఱికి మ్రొక్కిరి. లెక్కలేనన్ని నోములను నోచిరి. నూర్లు,లక్షలు,కోట్లు వెచ్చించి యనేకసత్కార్యముల నొనరించిరి. నిసుగు నొకండైనను బొందలేక విసువుఁజెందియుండిరి. ఒకనాఁడు గురువర్యులైన భాస్కరాచార్యులవారు కుసుమశ్రేష్ఠిగారి నోదార్చి, యాశీర్వదించి,'పుత్రకామేష్టియాగ మొనరించి దశరథుఁడు రామ, లక్ష్మణ, భరత శత్రుఘ్ను లను నల్వురు పుత్రులను బడసియున్నాఁడు. అనేకులకుఁ బుత్రకామేష్టి యను మఖముఁ జేసినందున సంతానము లభించియున్నది. మీ రీ పవిత్రయాగమును గూడఁ జేసిచూడుఁ' డని పలికెను. కుసుమశ్రేష్ఠియు భాస్కరాచార్య వచనంబుల ననుజ్ఞగా భావించి శిరసావహించి తన సంపదల నెల్లను బుత్రకామేష్టి మఖమునందు వెచ్చింప మదిఁ దలంచెను. భాస్కరాచార్యవర్యులు సుముహూర్తమును నిర్ణయించి కుసుమశ్రేష్ఠిని దీవించెను. ఆ సుముహూర్తము సమీపించు

సరికి, ఆంధ్ర దేశమం దున్న సమస్త చక్రవర్తులను, వణిగ్వరులను, నగరస్వాములను ఆహ్వానపత్రిక లంపించి రావింపఁజేసెను. 714 గోత్రజు లైన వైశ్యనగరస్వాములు, చక్రవర్తులు మొదలైన వా రెల్లరును వచ్చిరి. అందఱికి నుచితరీతిగాఁ దగిన సౌకర్యముల నేర్పఱిచిరి. పట్టణమంతయు మహావైభవోపేతముగా నలంకరింపఁబడెను. వీథులన్నియుఁ బందిళ్ళు వేసియుండెను. పట్టణ మెల్లెడలఁ బచ్చని తోరణములతో ముత్యాల ముగ్గులతో విచిత్రమైన చిత్రపటములతో నలంకరింపఁబడియుండెను.

కుసుమాంబా కుసుమశ్రేష్ఠి దంపతులు, మడుగువలువలను ధరించి, యజ్ఞేశ్వరు నెదురుగా వేదికలపై నధిష్ఠించిరి. అత్యంత భక్తిశ్రద్ధలతో వైభవోపేతముగా యజ్ఞమును నిర్వహించుచుండిరి. ఋత్విక్కులు వషట్కారాదిమంత్రములను బఠించుచుండిరి. చక్రవర్తి లోకప్రక్కను, బ్రాహ్మణు లోకదిక్కునను, నగరస్వాము లొక చక్కని, బాలనగరు లొకవైపున నుచితాసనములయం దాసీను లైయుండిరి.

ఆ సమయమునఁ గైలాసపర్వతమునందుఁ బరమేశ్వరుఁడు పార్వతిం గాంచి, దరహాసవదనముతో దివ్యదృష్టి నొసంగి భూలోకమునందు జరుగుచున్న యీమహామఖమునుజూపించెను గౌరీదేవి యాదంపతులయభీప్సితం బీడేర్ప మనికోరెను. అంత శర్వాణిడు 'ప్రేయసీ ఆజంపతీమణు లపత్యావాంఛవలన నెంతభక్తితో హృదయము లొసంగి మనకుఁ బ్రీతిసేయుచున్నారో గాంచుము! ఇంత మేరలేనిభక్తితో యజ్ఞంబు నొనర్చువారు కోటికి నొక్క రున్నైన నుండ' రనిపలికి, కల్పకఫలద్వయంబునొసంగి గిరిపుత్రికను బంపించెను. వెన్వెంటనే యాజగన్మాత పెనుగొండలోఁ గుసుమశ్రేష్ఠి యొనర్చుచున్న యజ్ఞకుండంబునందుఁ బ్రత్యక్షమై కుసుమాంబాకుసుమశ్రేష్ఠిదంపతులకా ఫలద్వయమొసంగి యెల్లరుఁజూచుచుండ క్షణములో నంతర్ధాన మయ్యెను. అమరులు గుసుమవృష్టిని గురిపించిరి. జనులందఱు విస్మయచేతస్కులై యాపరమేశ్వరీమతల్లి భక్తతత్పరతను వేనోళ్ళఁబొగడి, యొడలుమఱచి భజనలు గావించిరి. కొంత తడవునకు భాస్కరాచార్యులు క్రతువును ముగింపఁజేసిరి.

మంచి ముహూర్తమున నొకానొకరోజు, కుసుమాంబ ఆఫలద్వయమును భుజింపఁగా నెలఁదప్పి యంచితరీతి గర్భవతియాయెను. నవమాసములు నిండెను. అంతట నాకుసుంభవత్సి శుభదినంబున వైశాఖమాసశుక్లపక్షదశమియందు శుక్రవారమునాఁడు పునర్వసూనక్షత్రంబున శుభగ్రహములచే నధిష్ఠింపఁబడినదియు, శుభ

గ్రహము లుచ్చస్థితియందుఁ గలదియు, శుభగ్రహములు మూఁడింటిచేతఁ జూడఁబడినదియు నైన శుభలగ్నంబున మొదట కూఁతు నొక్కతెను, బదంపడి వంశవృద్ధికరుం డగు నొక్కకుమారుని గనెను. ఈ శిశువులిరువురును శుక్లపక్షమునందు శోభిల్లెడి చంద్రునిచందంబున, దినదినప్రవర్ధమానముగాఁ బెరుగుచుండిరి. పదియవనాఁడు ప్రాప్తించఁగా జాతకర్మమహోత్సవంబును జాటించి కుసుంభశ్రేష్ఠి అత్యంత వైభవంబుగా జరిగించెను. పెద్దలయనుమతివలన నాత్మజాతునకు 'విరూపాక్షుఁ'డనియు, నాత్మసంజాతకు 'వాసవాంబ' యనియు నామకరణములఁ గావించినాఁడు. గోదాన భూదానములను స్వర్ణదానములను భూసురోత్తములకు యాచకతతులకు నొసంగి కుసుమశ్రేష్ఠి ధన్యచరితుఁ డాయెను. ఇరుగింటి పొరుగింటి యంగనామణులును, గన్యకలును వచ్చి శిశువులను బంగరు తూఁగుటూయెలల నుంచి జోలపాటలను బాడి వేడుకలు చేసిరి. అప్పటినుండి కుసుమాంబికా కుసుంభ దంపతులా శిశువుల నల్లారుముద్దుగా, గారాబముగాఁ బెంచుచుండిరి. వాసవాంబ కన్యక యాయెను. యుక్తవయస్సు వచ్చినది. వాసవి తలిదండ్రులు విద్యాలయమున కింకఁ బోవల దని ముద్దుబిడ్డకు నుద్దులు దిద్దిరి. వాసవీకన్యక మహారూపవతి, సౌందర్యవతి. జిలుగు పావడఁగట్టి, వల్లెవాటువేసి, శ్వేతజాబిల్లిఁబోలు ఫాలభాగము నందుఁ జక్కని కస్తూరి చుక్కఁ బెట్టి, ఇంద్రనీలమణులం బోలి పొడవుగా నున్న నెఱికురులను జడవైచి పూలమాలికలను గట్టి, గజ్జెలందెలు ఘల్లుమని మాఱుమ్రోయఁగా వచ్చుచున్న వాసవీకన్యఁ గాంచని కన్నులు కన్నులుగావని ప్రజ లనుకొనుచుండిరి.

ఒకనాఁడు ప్రభాతకాలమున వాసవీకన్యక ప్రియసఖులతోఁ బరమేశ్వరీదేవాలయమున కరుగుచు ముందుఁ జెంతనున్న పూలతోఁటలోనికిఁ బోయెను. అప్పుడుద్యానవనములోఁ జేమంతులు, బంతులు, మనోరంజన సుమాలు, మాధవీ కుసుమాలు, మల్లెపుష్పాలు, విరజాజులు మొదలగు పువ్వుల మొత్తంబులన్నియు వికసించి విరఁబూచి యెల్లరహృదయములకు నానందమును గొలుపుచున్నవి. వాసవీ సఖులు గూడఁ గన్యక లగుటచే నం దొక సఖియ వాసవిని వెంట నిడుకొని, ప్రణయానంద మునకుఁ బురిగొల్పుచున్న ప్రకృతి చిత్రములను జూపించుచు నిట్లనెను: "వాసవీ ఇట రమ్మా. ఆ మాధవీలత చెంతనున్న చెట్టుకొమ్మలకుఁ జుట్టుకొని యెంత యానంద మును గొలుపుచున్నదో చూడుము. ఈ వైపునకు రమ్మా. చెలీ! ఈ చక్రవాకి శోకసంతతము [illegible] ముక్కలుగాఁ జేసి యరఁటిదొప్పలోని మధురరసముఁ

మంచి చక్రవాకమున కందించుచున్నది. ఆ ద్వంద్వ మెంతటి యానందము ననుభవించు చున్నదోగదా ! సఖి ! ఈ ప్రక్కకు రమ్ము. ఆ కోయిలజంటను గాంచుము. ఇటు చూడుము. చెలీ ! ఆ బెదరు కన్నుఁ లేడి యెంతయందముగా నున్నది ? అది తన ప్రియుని ప్రక్కఁ బన్నుండి, ముందు కాలితో నాత్మేశ్వరుని మూపును గోకుచున్నది. ఆహా! యేమి వాని సౌఖ్యము ! చెలీ! ఈ వాయుపథమున నల్లనిమబ్బులు రెండును గలిసి యెట్లు విహరించుచున్నవో గాంచుము. ఇదిగో, రెండుపాయలుగానున్న ఆకాలువలు, ఒకే లోయగా మారి యెట్లు ప్రవహించుచున్నవో చూడుము. ఆహా! యేమి యీ ప్రకృతి సౌందర్యము ?

గీ॥ బండిగురివెంద లత నోలేఁ - బరిఢవిల్లి
సుందరం బగు మోముఁ గ - స్తూరి నుంచి
ప్రణయ కుసుమాల ధరియించి - ప్రకృతి కాంత
యెంత హృదయంగమంబుగ - నెసఁగె నొక్కొ !

వాసవీ ! ఈ ప్రకృతిదృశ్యమును బరికించినచో, మనజీవితములుగూడ నెప్పు డెప్పుడు ప్రణయాంకితముఁజేయుదమా యన్నకోరిక జనించుటలేదా ! ఈ శిరీషకోమల యౌవనమును ఆనందమయముగాఁ జేయవలదా ! సఖి ! వాసవీ ! మనజీవితమునందుఁ బ్రణయసౌఖ్యము లెప్పుడు గలుగునోగదా !" అని భాషించుచున్న చెలికత్తెను గాంచి హృదయమును మార్పఁదలఁచి, చిఱునవ్వు నవ్వి వాసవి యిట్లనెను : "ఎంతపిచ్చి దానవు, సఖి ! మనస్సు మిక్కిలి చపలమైనది. నీరు పల్లమునకే ప్రవహించునట్లు, మనసు విషయవాంఛలకే లోనగుచుండును. ఈ ప్రకృతిసౌందర్యమున యథార్థతత్త్వ మును నీవు గమనింపలేదు. ఆవికసించిన శిరీషకుసుమముయొక్క వికాసము, పరిమళము ఎంతతడ వుండును! చెలీ! ఒక గడియ, లేదా ఒకరోజు అంతియేగదా మన సౌందర్యము. యౌవనముగూడ నంతియే. అందులో శాశ్వతానందమున్నదా? కేవల మాధ్యాత్మిక దృష్టిగలవారికి ప్రకృతియే జీవితము ధన్య మగు విద్యను గఱపుచున్నది. మాటి మాటికిని మాసిపోవుచున్న నీటిబుగ్గలు మనదేహముయొక్క యస్థిరత్వమును దెలు పుటలేదా! తామరపాకుమీఁదఁ జలించుచున్న జలకణంబులు చిత్తముయొక్క చప లత్వమును జెప్పుటలేదా! నఱకుడువడియు నేమియుఁ జేయకున్న తరులతాదులు ఓర్పును నేర్పుటలేదా! ప్రళయవాతూలమునకైన భయపడకుండు పర్వతములు

ధైర్యమును జెప్పుటలేదా! ఈవిధముగాఁ బ్రకృతి నర్థముఁజేసికొని యాచరించినచోఁ బ్రణయానందముగాదు, శాశ్వతానందము గలుగును" అని నుడువుచుండఁ బరమేశ్వరీ దేవ్యాలయమునఁ బూజకు వేళయైన దని తెలుపుచున్న జాగంటమ్రోఁత వినఁబడెను. అందఱును బూజార్థము దేవ్యాలయమున కరిగిరి. వాసవికిఁ బరిణయయుక్తమైన వయసు వచ్చినందునఁ దలిదండ్రులు వివాహమును జేయ నెంచి తగినవరునికొఱకు విశ్వప్రయత్నములు చేయుచుండిరి.

ఆ నాఁడు దక్షిణమున నెల్లూరునుండి యుత్తరమున విశాఖపట్టణమువఱకు నుండు నాంధ్రదేశమునఁ జాళుక్యరాజులు పరిపాలించుచుండిరి. అప్పుడు రాజమహేంద్రవరము రాజధానికాఁగా విమలాదిత్యవిష్ణువర్ధనుఁడు పాలించుచుండెను. పెనుగొండ మొదలగు పదునెన్మిది పట్టణములుగూడ నాతని సామ్రాజ్యములోనివి. అతఁడు రాజసూయయాగమును జేసినాఁడు. నిజభుజోద్ధతిచేత విజయధ్వజంబును స్థాపించినాఁడు. ప్రజలను బిడ్డలరీతిగాఁ బ్రేమించి పాలించినాఁడు. కాని, కాంతాకాంచనములం దీతని కాసక్తి మెండు—ఒకప్పుడు సామంతభూపాలురు గప్పములను గట్టలేదు. వనమృగంబులవలనఁ బంటలన్నియుఁ పాడై పోఁగాఁ బ్రజలు మొఱఁబెట్టుకొనిరి. ఒకరోజున నీఘోరములను విష్ణువర్ధనుఁడు వినలేకవినలేక విసువుఁజెంది సైన్యసమేతుండై వేటకు బయలువెడలెను. మిక్కిలి నిపుణతగా వేటనొనర్చి యనేక క్రూరమృగంబులను మడియింపఁజేసిరి. అలసటఁ దీర్చుకొనుటకై యందఱును బ్రాంతంబుననున్న గోదావరీ తీరంబునకు బయలుదేరిరి. మార్గమధ్యంబునఁ బెనుగొండపురవరసౌధశిఖరరాజంబులు గొన్ని గానవచ్చుచుండెను. చక్రవర్తి యవ్వానినిగాంచి యప్పట్టణమును వీక్షింపఁ దలంచి సైన్యజాలములతోఁ బెనుగొండపట్టణమున కభిముఖుఁ డయ్యెను. పెనుగొండ పట్టణమునకు దాపుననున్న నొకానొకయుద్యానములో గుడారములు, డేరాలు వేయించిరి. మహారాజు కొంతతడవు విశ్రమించెను.

వనమునందుఁ బరివారముతోఁ జాళుక్యాధీశ్వరులు విడిదిచేసి రన్నవార్త పుర వాసులెల్లరకుఁ దెలిసిపోయెను. కుసుమశ్రేష్ఠిగారు సామంతరాజుగనుక నవీనఫలమ్ముల లను, నవరత్నములను బెనుగొండలో నుత్పత్తియగుచున్న వివిధవస్తుసామగ్రిని సేకరించి మహారాజును గౌరవించుటకై పరివారముతో, స్త్రీపురుషులతో, గౌరబాలికలతో, బాలనగరులతో బయలువెడలిరి. మహారాజుగారికి నుచితరీతిగా నధికభక్తితో గౌరవములు చేసిరి. ఆ యమాయకదినములలో మహారాజునకు గౌరవార్థము, అవివా

హిత లగు కన్యకలచేత నీరాజన మిప్పించు నలవాటు గలదు. ముఖ్యముగా గౌరబాలిక లగు కన్యకలచేత మహారాజునకు మంగళహారతి నిప్పించిరి. కుసుమశ్రేష్ఠిగారి కొమరిత యగు వాసవి గౌరబాలిక, కన్యక యగుటవలనఁ దండ్రిగారియనుమతితో వాసవీకన్యక నీరాజన మొసంగెను మహారాజు స్త్రీలోలుఁడుగాన వాసవిసౌందర్యమును వీక్షించి నంతనే మోహాక్రాంతుఁడై పోయెను. ఆ లావణ్యమును, ఆ తనూవిభవమును ఆ యా కారమును ఆనుపూర్విగాఁ దలపోయుచుండెను. కొంతతడవునకు మహారాజు మతిఁ దప్పినాఁడు. అమాత్యులు చికిత్సలను జేసినారు. అసలువిషయ మెవ్వరికిని దెలియదు. విష్ణువర్ధనుఁడు మూర్ఛనుండి తేరి రహస్యముగా మంత్రిని బిలిచి యిట్లు పలికెను— "అమాత్యా! ఆ కన్నియను గాంచుము! చక్కని-చుక్క. వైశ్యకులసాగర కన్యలయందు మిన్న. వారలతో సంప్రదించి యాచక్కనిఁబోఁడి నేవిధముగనైన నాకు వివాహముచేయుము." — అంత మంత్రిసత్తముఁడు వైశ్యశ్రేష్ఠులనందఱను రావించి మహారాజుగారి మనోభీప్సితమును వివరముగా విన్నవించెను. విన్నవార లందఱు విస్మయులైరి. ఎట్టకేలకు నంద ఱొక్కుమ్మడిగా, గౌరబాలిక బాలనగరులను దప్ప యొరులను బరిణయమాడుట కనర్హురా లని గట్టిగా నొక్కిచెప్పిరి. మహారాజున కాగ్రహము వచ్చెను. ఎనిమిదిరోజులు గడువిచ్చి కొంతపరివారమును పెనుగొండలోఁ గాపుంచి విష్ణువర్ధనుఁడు నిజపురమున కరిగెను. మార్గమధ్యములో నాఱునూట పన్నెండు గోత్రజులు నగరస్వాములు కొందఱు మహారాజుతో నిట్లు మనవిఁజేసి కొనిరి. చాళుక్యసార్వభౌమా! జయము, జయము! వాసవీకన్యకను దేవ కొసంగి పరిణయముగావించుట కఖిలవైశ్యులు నంగీకరించినారు. జ్యోతిష్కులను బిలిపించి శుభలగ్నమును నిర్ణయించుచున్నారు. వైవాహికోత్సవాహ్వానపత్రికలను ద్వరలో మీకుఁ బంపింతుమని పలికినారు. నగరమెల్ల శృంగారముగఁ జేయుటకుఁగాను గొలఁది రోజులు గడువు గోరినారు. మాభాగ్యమే మని చెప్పుదుము మహీవల్లభుం డల్లుఁ డయ్యెనుగదా! తమకుఁ గన్యక నర్పింపనిచో మాకు మరణము నిశ్చయముగదా! ప్రభూ!—అన్న నీ పలుకుల కెక్కువగా మక్కువపడి సంతోషించి, చక్రవర్తి రాజ మహేంద్రవరమున కరిగెను.

పెనుగొండనగరములోఁ గుసుమశ్రేష్ఠి విచారపరితప్తహృదయుఁడై కోరిన గడువుగూడ మీరుచున్నందున నొకానొకసభఁ జేయ నెంచెను. పరిసరకుగ్రామపట్టణ ములందు నివసించుచుండు 714 గోత్రజులైన వైశ్యనగరస్వాముల రావించి స్వీయ

సౌధరాజమునం దొక మహాసభను గావించెను. ఏతత్సభకు భాస్కరాచార్యు లధ్యక్ష పీఠము నలంకరించిరి. వసుమతీశునకు వాసవి నీయవలె నని కొందఱు, నీయరాదని కొందఱు రెండుపక్షము లేర్పడినవి. ఆఱు నూట పన్నెండు గోత్రజు లైన నగర స్వాములు వాసవీకన్యకను మహారాజున కిచ్చి వివాహ మొనర్చుట యుక్తము నని యేక కంఠముగాఁ బలుకుచు నొక్కొక్కరుగా లేచి యిట్లనిరి—"అయ్యలారా! ఆ నాఁడే విష్ణువర్ధనమహారాజునకు వాసవీకన్య నొసంగి పాణిగ్రహణమహోత్సవం బొనరించిన నో నెంత బాగుండెడిది? సకలభూమండలము వైశ్యులహస్తములలోనుండదా? భూపుకే వల్ల భుఁడల్లుఁడౌనుగదా! మన మీవిధముగా నెంతకాలము యోచించినను, యుద్ధమున నిలుచు సామర్థ్యము మన కేమి గలదు? కత్తు లున్నవా? కటారు లున్నవా? సైన్యజాలము లున్నవా? గజము లున్నవా? తురగము లున్నవా? తగిన బల మున్నదా? ఎందుల కీ ప్రగల్భములు? ఏ ధర్మము నిల్పఁ బూనినను, ఏ సత్యమును జాటవలె నన్నను, ఏ కార్యమును నిర్వహింపవలసి వచ్చినను ఆయుర్దాయము, దేహదార్ఢ్యము బాగుగా నుండవలెను గదా! చచ్చి మన మేమి సాధింతుము? రెండు! అందఱు నేకభావము గలిగి యుండుఁ" డని ఘోషించుచుండఁగా సభలోఁ గలకలపాటు బయలు దేరెను. వారలదర్పములను సహింపలేక, యావేశపూరితులై బాలనగరులు నూట యిర్వండు గోత్ర నగర స్వాములు లేచి నిలువంబడి యిట్లు చెప్పిరి.—"మలభాండమైన నీ పాడు పొట్ట నింపుకొనుటకై మానావమానములను గమనింపక యిట్లు పలుకుచున్నారా? భూమిలో జీవించియున్నంతకాలము ఊరును పేరును నిల్పి ప్రశస్త యశోవిశాలురై మనవలెనుగాని మూర్ఖులై దుర్విధులై యున్న వారిజన్మములు గాల్పనా! ఆర్యవైశ్యాన్వయమునందు జన్మించి కూళలై సిగ్గుమాని యున్నారా? చక్రవర్తులకుఁ గన్యకల నియ్యఁగూడదన్న ధర్మశాసనము నప్పుడే మఱచితిరా? స్వకుల మానాభిమానములు సమసెనా? తార్పుకాం డ్రైనారా? సప్తకులపర్వతములు స్థానములు మాని కూలిపోవుఁగాక! సప్తాబ్ధులు సమస్తలోకములను ముంచునుగాక! సూర్య చంద్రులు నేల రాలిపోవుదురుగాక! ముందు మన కొంపలకే కీడు మూడునుగాక! కంఠములయందుఁ బ్రాణములున్నంతవఱకు వాసవీకన్యను మనుమతీశున కర్పింపము. ప్రాచీనాచారభాగ్యమును బాడుచేయుటకంటెఁ గొండంబులం దూకి మండఁగూడదా? అధికారులకు భయపడి యల్లాడుటకంటె మున్నీటికెరటాలలో మునిఁగిపోఁగూడదా? మదనపీడితులకు జాతి, మతము కూడఁ గావలయునా? నిర్ణయము గావలయు" నని ముక్త

కంఠములతో గర్జించిరి. సభావసానమున వాసవీకన్యను విష్ణువర్ధన రాజున కీయఁగూడ
దని తీర్మానించుకొనిరి. వెంటనున్న వృద్ధ వైశ్యు లెల్లరుఁ దటాలు వచ్చునని తలంచి
వార్తనైన వసుమతీశునకుఁ బంపుఁడని కోరిరి. అందఱును వల్లె యని ధీరుఁడైన వృద్ధ
శ్రేష్ఠు నొకనిని బిలిచి జరిగినవృత్తాంతమంతయుఁ బూసఁగ్రుచ్చినట్లు తెలిపి మహారాజు
కడకుఁ బంపించిరి. ఆ వృద్ధ వణిజశ్రేష్ఠి మహాధైర్యముగాఁ గతిపయదినములలో
రాజమహేంద్రపురమునకుఁ జేరెను. చాళుక్య సామ్రాజ్యాధిపతి ముమ్మిడిభీమ
బిరుదాంకితుఁడు విమలాదిత్య విష్ణువర్ధనుఁడు కొలువుదీరి యున్నాఁడు. ఒకవైపు
సామంత మహీపాలురు కానుకల నొసఁగుచున్నారు. మఱొకవైపు నమాత్యవర్యులు
రాజ్యసందేశములను జెప్పుచున్నారు. ఒకప్రక్క గాయకావళి మధుర సంగీతమును
వెదజల్లు చున్నారు. ఒకక్రేవ దాసీజనము సేవలు సేయుచు వింజామరలు వీయు
చున్నారు. మహారాజుగారు మహానందముతోనున్నారు. ఆ సమయమునఁ బెనుగొండ
వార్తావాహకుఁడైన వణిజశ్రేష్ఠి కోటగుమ్మము సమీపించి పెనుగొండ వైశ్యుఁడ నని
చెప్పినందున భటులు గౌరవమును జూపుచుండిరి. పదునెన్మిది సింహ ద్వారములను
దాటి యాస్థానమునకుఁ బోయినాఁడు. మహారాజు దూరమునుండి వైశ్యోత్తముని
జూచిన వెంటనే మంగళవార్తఁ దెచ్చెనని మానసమునం దుప్పొంగి యధికానందముతో
సింహాసనమును డిగ్గి, వైశ్యశ్రేష్ఠున కెదురేగి, యాలింగనముఁ జేసికొని యుచి
తాసనముపైఁ గూర్చుండఁజేసెను అధికగౌరవముఁ జూపుచున్నందున నా వైశ్యునకు
భయ మధికమై పోయెను. ఏమి విన్నవించుటకు నోరాడలేదు. ఎట్టకేలకు ధైర్యముఁ
దెచ్చుకొని, చల్లకు వచ్చి ముంత దాచుకొనుట పాడి గాదని తలంచి యిట్లు విన్న
వించెను : "మహారాజశేఖరా! పెనుగొండవైశ్యులెల్లరు మీకు నమస్కారములను
జెప్పినారు. ఆ యుద్యానవన వృత్తాంతమంతయు మీకు విదితమేగదా! మా వాసవీ
కన్యక నెంతమాత్ర మితరుల కియ్యమని తీర్మానించుకొన్నారు. వాసవిపై కోరికవలదని
చెప్పినారు. ఈ తప్పులు మన్నించుటయే గొప్ప యని పలికినారు. అదియునుగాక
సీతామహాదేవికై తపించిన రావణాసురుఁ డేమైనాఁడు? ద్రౌపదీదేవిని వాంఛించిన
కీచకుని గతి యేమైనది? గౌరవకులమువారి బాలపై మీకింత వల పెందులకు?
మహారాజా! వంచనలేక సత్యము వచించితిని. నాపైఁ గోపగింపకుఁ" డని పలుకఁగా
మహారాజు దండతాడితభుజంగమువలె మండిపడినాఁడు. కన్ను మిన్నుఁ గానక
కావరములఁ బలుకుచుండఁగా సచివాగ్రణులు శాంతింపఁజేసిరి. రాయబారి నెంత

మాత్రము శిక్షింపఁగూడదని ఆంజనేయుని యొక్కయుఁ గృష్ణపరమాత్మయొక్కయు చరిత్రలను జెప్పి నెమ్మదిగా నా వైశ్యు నచ్చటినుండి పంపించిరి.

బెబ్బులి బారి నుండి తప్పించుకొని బయటకు వెల్వడు భీతకురంగముభాతి నా రాత్రియే ముదుసలి మిక్కిలి వడిగాఁ బెనుగొండఁ జేరెను. అప్పటి కప్పుడే తెల్లవారుజామున నందఱి నొక చోటికి రావించి జరిగిన వృత్తాంత మిట్లు చెప్పెను—
"వణిజులారా! గతజలసేతుబంధనమునకై విలపించుట పాడి గాదు మహారాజుగారి మనస్సును మఱల్చుటకు బ్రహ్మదేవునికైన వశముగాదు. అవన్నియు నిప్పు డనవసరము. కాఁగల కార్యములు యోచింపవలెను. వాసవీ కన్యకను దీసికొనిపోయి వాని పాద కంజాతములందు సమర్పించి రావలెను. లేదా విష్ణువర్ధన భూపతియొక్క తీవ్ర కార్య శౌర్యాగ్ని జ్వాలలోఁ జొచ్చి గెల్పొందవలెను. వాసవీకన్యక నొసంగుటయో, ప్రాణ పరిత్యాగమున కంగీకరించుటయో యిప్పుడు నిర్ణయముకావలెను అదియునుఁగాక వైశ్యాన్వయమనఁగా ననాదిగా ధాత్రిలో విదితయశంబుఁగన్నది. పవిత్రతఁ గొన్నది. నేఁడు మనము బుద్బుద సమాన దేహముల కాసపడి కళంకమును దెచ్చిపెట్టఁగూడదు. కులమున ధర్మముల నిలుపఁగోరి, పదుగురితోఁ జచ్చిన పెండ్లితో సమాన మగును. ఇట్టి క్లేశములు దెచ్చి పెట్టుటకే, జ్యేష్ఠ భవాని జన్మించె నని వాసవీ కన్యకను, ఎంతమాత్రి మనుకొనరాదు"— ముదుసలి రాయబారి పలుకఁగా నాఱు నూట పన్నెండు గోత్రిజుల వారును బెటపెట పండ్లుగీటి మహారాజునకుఁ గన్య నియ్యనిచో మీరలే యగ్ని కాహుతి కండు మేనఁ బ్రాణము లున్నచో నువ్వుగల్లు నమ్ముకొని యైన జీవించమా? వనజసంభవువ్రాలు తప్పునా? అని యొక్కుమ్మడిగా నందఱు వచించుచుఁ గుటుంబములతో నా పదునెమ్మిది పట్టణములనుండి పాఱిపోయిరి.

అట్లు నగరములనుండి వారు పాఱిపోయినందునఁ గుసుమాఖ్యుండు విచారించి, జ్వాలనవార్తను బురంబునఁ జాట నంపి చింతాపరీతచేతస్కుఁడై గృహమునకు వెడలెను. నిజపుత్రిక దుర్గాంశ సంభూత, దివ్యజ్ఞానపారీణ యని గ్రహింపనేర్చినవాఁడై వాసవిని గుడితొడపైఁ గూర్చుండఁ బెట్టుకొని విషయములన్నియు వివరముగా వినిపించెను. జరిగిన సంగతులు, జరుగుచున్న విశేషములు, జరుగఁబోవు విషయములు తెలిసిన వనుచుఁ జిఱునవ్వునవ్వి వాసవీకన్యక, "తండ్రీ! మహారాజు నాపై నిల్పిన మోహ మమోఘమనియు, నీచాత్ముఁడైన నా రాజు నిత్యమును మిముఁబెట్టుబాధ లమితములనియు, నా మదాంధుని కొఱకు మహాభయమున మీరు చేయుచున్న

ప్రయత్నము లశేషములనియు, మనవారలందఱు నాకుగా నిత్యముఁ బడెడి పాట్లు మిక్కిలి పశ్చాత్తాపకరములనియు, ధామశీలుఁడు చేయరాని చెడు పనులు చేసి న్యాయములేక వర్తింప నున్నాఁడనియు నే నెఱుఁగుదును. ఎందులకుఁ జింతిల్లెదవు? నా హృదయాభిప్రాయమును జెప్పుచున్నాను, వినుఁడు. భక్తశేఖరుఁడును బతితపావనుఁడును నైన కుసుమశ్రేష్ఠియే నా యొక్క కూర్మి తండ్రి, సాధ్వీమతల్లియు వైశ్యకులకల్పవల్లియు నైన కుసుమాంబయే నా యొక్క తల్లి. నాయందున్న భక్తితో సర్వకార్యములను సాధించు బాలనగుటలే నాకుఁ బరమహితులు. నాతో నగ్నిప్రవేశ మగు పుణ్యదంపతీసంతానమే నా భక్తికిఁ బాత్రము. ఎన్ని జన్మములకైన మీ క్షేమములనే సరయుచుండెదను. మాటిమాటికిని మనస్సులో రాజక్రౌర్యమును దలపోయవలదు. అగ్నికుండంబుల సిద్ధపఱుచుఁ" డని దీర్ఘముగా భాషించి కార్యక్రమము నివేదింపఁగాఁ గుసుమశ్రేష్ఠి స్వస్థచిత్తుఁడై ధన్యుఁడ ననుకొని, 103 అగ్ని కుండంబులను సిద్ధపఱచెను. అందఱు నంగీకరించిరి. వీరకంకణములను ధరించి యహమహమికతో ముందునకు వచ్చుచుండిరి.

ఆ నాఁడు సాయంకాలమున నార్యులెల్లరు నిత్యసంధ్యలను ముగించిరి. ఇష్టదేవతల నెల్లరను నిష్కాములై పూజించిరి. రమణీయ మైన పుష్పమాలలను, రుద్రాక్షమాలలను గంఠములందు ధరించిరి. 'భర్గ! సర్వేశ! గిరిశ! కన్యకామతల్లి! కనకవల్లి! మాం పాహి' యనుచు భజనలఁ జేయుచు నత్యంతభక్తితోఁ గుసుమశ్రేష్ఠిగారిగృహమునకు వచ్చిరి. కాంతలెల్లరు వాసవీకాంతను స్నానాదికములఁ జేయించి వస్త్రభూషణంబుల ధరింపఁ జేసిరి. మాణిక్యతాటంకమణికాంతు లక్కవైపునఁ దళతళ మెఱయుచుండఁగా నభ్యంజనస్నానమాచరించినందున భ్రమరకంబులు నిండు నెలమోమును మూయుచుండఁగాఁ బసుపుపచ్చని జరీపట్టుపుట్టము శరీరకాంతికి సాయ మగుచుండఁగా, దరహాసరుచులతో వాసవాంబ బయలుదేర నెల్లజనులును సంకీర్తనల సలుపుచు బయలువెడలిరి. పరిచారికలు కొందఱు పన్నీరుఁ జల్లుచుండిరి. ఇంతులు కొందఱు వాసవీకాంత బలాహకవేణి నెత్తిపట్టుచు నడచుచుండిరి. లలనలుకొందఱు కర్పూరనీరాజన మొసంగుచుండిరి. కాంతలుకొంద ఱడుగులు నేలపైఁ బడకుండ మడుగువలువలు వరుసగాఁ బరచుచుండిరి. అటు లఖండవైభవముతో నడుగు డెంచు శ్రీ వాసవాంబ నరసి, వైశ్యులెల్లరు నానందవార్ధి మునిఁగినవారై జయజయారావములను స్తోత్రశబ్దములను మంగళనినాదములను జేసి పొంగుచుండిరి.

దేవాలయప్రాంతంబున నగ్నికుండంబులసన్నిధి నొకానొకశిలావేదిక నెక్కి వాసవాంబకరుణార్ద్రదృక్కులతో వీక్షించి యెల్లరం జీరి—"కామక్రోధలోభమోహ మదమాత్సర్యంబుల జయించి, పృథ్విలో నత్యంతప్రఖ్యాతి వహించినారు. ధరణీ కాంతుఁడు మి మ్మెంతమాత్రముఁ జేరలేఁ"డని పలికెను. లక్షలకొలఁదిగా మూఁగి యున్న జనము లా మహాదేవి యేమివచించునోయని యట్లే నిర్విణ్ణులై చూచుచుండిరి. నవ్యభాస్కరకాంతులు నాలుఁగువైపుల వెదఁజల్లునట్టి నవరత్నమకుటంబుతో, ఫాలము నందుఁ బ్రకాశించుచున్న మూఁడు సిందూర రేకలతో, హరువైన నందివాహన ముతో,రోదసీకుహరము మేదురాభావముగ దివ్యకాంతిపుంజములతోఁ,గౌముదీదరహాస వదనముతో నాపరమేశ్వరీమతల్లి నిజరూపంబున సాక్షాత్కరించెను. దేవదుందుభులు మ్రోగినవి. అమరులు పూలవానను గురిపించిరి. అంత నా మహాజనులందఱు భయో త్సాహంబు లావరింప, అంబికాతేజోరాశిని వీక్షింపలేక, యిట్లుస్తోత్రమును జేసిరి— "ఓ మహాదేవీ! నీదివ్యకాంతిపుంజంబులఁ గాంచలేము. తల్లీ! మేము నోచిననోము లీనాఁడుగదా ఫలించినవి. అమ్మా! నీతేజోరూపమును సురలుగాని, సన్మునివరులు గాని చూడలేనప్పుడు మేము చూడఁగలమా! కన్నెవేసమును ధరించి మము దయా రసముతో మన్నింపవా" — అని పరిపరివిధములఁ బ్రార్థింపఁ బ్రదుటిలో మఱల వాసవి కన్యకారూపమును దాల్చెను: అందఱు,గూడ ముకుళితకరకమలులై కన్యకామాత యేమివచించునో యని వేచియుండిరి. వాసవీకన్యక యెల్లరను జీరి దయారసముట్టిపడ నిట్లనెను.—"నాయనలారా! మన మగ్నిహోత్రుని లీనమైతక్షణమే విమలాదిత్యుని శిరస్సు వేయివ్రయ్యలై పోవును. బాలనగరయువకులారా! ఆగుఁడు! మీర లెంత మాత్ర మీ కార్యమునకు సాహసింపకుఁడు. అమలము నైన వైశ్యకులమంతయుందును గదా! బిడ్డలారా! వైశ్యకులాధిదేవత యగు నగరేశ్వరస్వామిని గొలువుఁడు. వింధ్య వాసిని యనఁగా వెలయుచున్న కాత్యాయినీదేవిని బూజింపుఁడు. బాల్యమునందు విద్య నార్జింపుఁడు. ప్రాయమువచ్చినపిమ్మట సర్వసౌఖ్యముల ననుభవింపుడు. స్వప్నము లందుగూడఁ బరకామినీ కాంక్షను బరధనాపేక్షను మఱువవలెను. ఎన్నికష్టములు వచ్చిన నెన్నినష్టములు వచ్చిన నోర్చుకొని కులధర్మములను నిలువవలెను సర్వజీవుల యందును సానుభూతిని జూపవలెను. గోబ్రాహ్మణుల మేలుఁగోరవలెను. కులదేవతా పూజ, గోత్రపూజ, స్నానసంధ్యాద్యనుష్ఠానసద్వ్రతన మీర లెంతమాత్రము మానవలదు" యని యనేక ధర్మంబులతో బోధించుచుండఁగాఁ గొందఱు చారులు విష్ణువర్ధనరాజ్యా

సైన్యసమేతుఁడై వచ్చుచున్నాఁడన్న వార్తను దెలిపిరి. మహాసభయంతయుఁ గలవర పాటుఁ జెందుచుండెను.

అంత వాసవీకన్యక పీఠిహోత్రునిదరికిఁ బోయి “వైశ్వానరా! ఏమీ! నీయుత్సాహము. పావనాకారా! మమ్ములఁ గైలాసమునకుఁ జేర్పుము పావకా! చల్లఁదనముఁ బ్రసాదింపుము” అని ప్రార్థించుచు నాభవాని, ఆపరమేశ్వరి, ఆనీలవేణి, ఆనిత్యకల్యాణి, ఆసరసపాణి అగ్నిజ్వాలలో లీనమై కానరాదాయెను. వీరకంకణములను ధరించిన, 102 గోత్రదంపతులు నానుపూర్విగా నొకరినొకరు జూడకయే, అగ్నికుండం బులొదుదూకిరి, —వెన్వెంటనే కన్నీరుమున్నీరుగా వేనవేల్జనము దుఃఖవారాశిలో మునిఁగిపోయెను. ‘వాసవీకన్యా’ అను హాహారవము లెల్లెడల బయలు దేరెను. ‘ఇది కలయా, మాయయా, నిజముగా జరిగినదా’ యని యెవరికి వారు తర్కించుకొనిరి. శిల్పి నిర్మించినశిల్పములవలె, చిత్తరువులవ్రాసిన చిత్రములభాతి ఆమహాసభ నిశ్శబ్ద ముగా నిలిచిపోయెను వందలాదిగా నాబాలబాలికలు తలిదండ్రులు లేనివారైరి. భాస్క రాచార్యులు కొంతవఱ కుపశమనవచనంబులఁ బలికి కొంచె మోదార్చెను. రాజ మహేంద్రనగరమున విష్ణువర్ధనునిశిరము వెయ్యిప్రక్కలైపోయెను. ఈ విషాదసమయ మున విష్ణువర్ధనుని సైన్యజాలములు, పెనుగొండపట్టణమునకు వచ్చినవి, బీభత్సము చేయుచున్నవి. పెనుగొండలో విప్లవము బయలు దేరినది. నగరమంతయు నల్లకల్లోల మైపోయినది విష్ణువర్ధనుఁడు పెనుగొండలోఁ గాపుంచినసైన్యములన్నియు, బాలనగర సంఘమునకు సహాయముఁ జేయుచున్నవి యుద్ధమారంభమైనది. రాజమహేంద్రవర మునుండివచ్చిన సైన్యసమూహములన్నియుఁ జెల్లాచెదరై పాఱిపోవుచున్నవి. ఇంతలో విష్ణువర్ధనమహారాజుయొక్క యేకైకపుత్త్రుఁడైన, రాజరాజేంద్రుఁడు పరుగుపరుగున వచ్చి విరూపాక్షునిపాదకమలములపై వ్రాలెను. విరూపాక్షుఁడు నరేంద్రుని స్వీయ హస్తములతో లేవనెత్తి—“నరేంద్రా! లెమ్ము! మీపై వ్యక్తిగతముగా నెవ్వరికి నేవిధముగాఁ గోపములేదు నీవైన ఈచాళుక్యసామ్రాజ్యమును ధర్మబద్ధముగా, సత్య రీతిగాఁ బాలింపుము”— అని వచింపఁగా రాజనరేంద్రుఁ డధికభక్తితో విరూపాక్షు నకు మ్రొక్కి యీ సామంతరాజ్యాధిపత్య మొసంగి, యాత్మహస్తాలంతో మకుటంబు నుంతు” ననెను. భాస్కరాచార్యులు వారించి, కాశికిఁ బోయి, పితరులకుఁ బిండదా నాదికృత్యంబుల నిర్వర్తించి పిమ్మట అట్లుగావింతు ననఁగా నందఱును వల్లె యని యంగీకరించిరి. భాస్కరాచార్యునాజ్ఞానుసారము వైశ్యులందఱును గొలఁదిరోజులలో,

గాశికిఁ జేరిరి. ఒకరాత్రి జాగరణఁ జేసిరి. ఒక నెలరోజులు నివసించిరి — ఒక్కనాఁడమల గంగానదిలో స్నానమాచరించి, భక్తితో హృదయ పద్మములందు వాసవీ కన్యకను నిలుపఁగా నా వాసవీమతల్లి మఱల సాక్షాత్కరించెను. భౌతికశరీరముల మఱచిపోయి స్తుతియించిరి. అంత వాసవీకాంత మఱల నిట్లు పలికెను — "పితృదేవతలును నేనును బిండదానాదులవలన సంతసించితిమి. కులవృద్ధినిగోరి బాంధవ్యమును జేయుఁడు. మీకే కష్టముసంభవించిన నన్నుఁ దలంచుకొండు"మని పలికి యంతర్ధానమయ్యెను.

పెనుగొండనగరమున రాజరాజనరేంద్రుఁడు, సచివోత్తములు, సైన్యజాలములు నిజతేజములను మానినవారలై కందమూలములను, ఆకులలములను భుజింపుచు మఱ్ఱిచెట్లనీడలను నివసింపుచుండిరి. భక్తునకుఁ గనిపించు భగవంతునివలె, వేచివేచి వాచిపోయియున్న వనితకు భర్తవలె చాలదూరములో వచ్చుచున్న వైశ్యసమూహములను గాంచిరి. పిమ్మట సమీపమున కేతెంచిన వైశ్యబాలురందఱికి నుచిత సత్కారగౌరవముల నొనర్చిరి. రాజరాజనరేంద్రుఁడు విరూపాక్షు నాలింగనముఁ గావించుకొని, కొంతతడవు నానందవారాశి మునిఁగిపోయెను. పట్టాభిషేకమును జాటనంపించిరి. ఆంధ్రదేశములో నుండు చక్రవర్తులందఱికి నాహ్వానము లంపఁబడెను. కురుర, కేరళ, పాండ్య, కర్ణాట, అంగ, వంగ, కళింగ, కాకతీయ, చోళ మొదలుగాఁగల దేశదేశములనుండియు, ననేక చక్రవర్తులు సామంతభూపాలురు వచ్చియుండిరి.

విరూపాక్షుఁడు ఫలయుతమైన భాస్కరాచార్యు నాశీస్సుల నఘమర్షణస్నాన మాచరించినాఁడు. జిగిజిగి యనెడు జిలుఁగువలువలఁ గట్టినాఁడు. ధర్మయజ్ఞోపవీతమును ధరించినాఁడు. కస్తూరి చుక్కను బెట్టి నవరత్నమయమైన భూషణములను దాల్చినాఁడు. ఎల్లరును జేరి పట్టాభిషేక సింహాసనమునఁ గూర్చుండఁ జేసిరి.

జయజయధ్వనులతో జనులందఱు సంతోషములను వెలిబుచ్చుచుండఁగా నవరత్నమయమకుటంబును రాజరాజనరేంద్రుఁడు నిజహస్తములతో విరూపాక్షుని మస్తకంబున నుంచెను.

దక్షిణదిశలో నక్షయసౌఖ్యములు గలుగుఁగాక! యని భాస్కరాచార్యవర్యులు పలుకుచుండ, రాజరాజనరేంద్రరాజు దాపల నిలువంబడి వింజామరంబులను వీచుచుండఁగా, ధన్వి భక్తితోఁ బాదకమలములను బట్టుచుండఁగా, దేశదేశముల నుండి వచ్చిన భూపాలవితతి యణఁకువతో వెంబడించఁగాఁ, బురవనితలు లాజలను జల్లుచుండఁగా దివ్యసుమమాలికావస్త్రసందీప్తమైన భద్రగజముపై నెక్కి విరూపాక్ష సామంతచక్రవర్తి యూరేఁగెను.

శు భ మ్



# శ్రీ వాసవీ కన్యకా జననము

శ్లో॥ తతః కాలే శుభే లగ్నే సుషువే పుత్రికాం పురా
అనంతరం తు తనయం సా వంశకర ముత్తమం
వైశాఖే ౽ దితినక్షత్రే శుభే భార్గవ వాసరే
శుక్లపక్ష దశామ్యాంచ శుభలగ్నే శుభగ్రహైః
అధిష్ఠితే శుభోచ్ఛస్థే శుభదృష్టే గ్రహత్రయే
జాతం శిశుద్వయ మిదం వైశ్యవంశవివర్ధనమ్.

★

## కలియుగ 4121 - వ సంవత్సరము—

వైశాఖ శుద్ధ దశమీ శుక్రవారమునాఁడు పునర్వసూ నక్షత్రమునందు శుభగ్రహములచే నధిష్ఠింపఁబడి శుభగ్రహము లుచ్ఛస్థితియందుఁగల శుభలగ్నంబున శుభముహూర్తంబున శ్రీ వాసవీ కన్యకామతల్లి పెనుగొండ పట్టణమునందు శ్రీ కుసుమాంబా కుసుమగుప్త దంపతులకు జన్మించెను.

★

---

గమనిక:—ప్రతి సంవత్సరము వైశాఖ శుద్ధ దశమీ తిథి దినంబున నార్యవైశ్యులెల్లరు శ్రీ వాసవీ జయంత్యుత్సవంబులను జరుపవలెను.

# శరభలు - దండకములు

## ఖడ్గములు - జాతులు

[ శ్రీ కన్యకాపీఠము నెత్తునపుడును, నవరాత్రోత్సవములందును, శ్రీ వాసవీ జయంత్యుత్సవము లాదును, వైవాహికసమయములలో సమ్మణ్ణిని నిలుపునపుడును భజంత్రీల సాయమున వీరవంతముగా వీనిని పఠింపవచ్చును.]

| ల | ల | ల | ల | ల | ల | ల్ల | ల్ల | ల్ల |
|---|---|---|---|---|---|---|---|---|
| తకిట | తకిట | తకిట | తకిట | తకిట | తకిట | తకధిమిత | తకధిమిత | తకధిమిత |

1\. శ్రీమంతమైనట్టి శరభ
జ్యేష్ఠశైలమున ,,
సత్యంబు ధర్మంబు ,,
శాశ్వత యశము ,,
నీతిబోధలనెల్ల ,,
నెలకొల్పినట్టి ,,
వాసవీ దేవికి ,,
వందనములు ,,

(ఖడ్గము)

2\. బాలనగరులాది శరభ
వైశ్యులందరునూ ,,
ఇలవేల్పు నీవంచు ,,
హృదయంబు నర్పించి ,,
భక్తితో నిత్యంబు ,,
పూజించుచున్నారు ,,
వాసవీకన్యకా శరభ
వందనములు ,,

(ఖడ్గము)

3\. శ్రీకుసుమాంబకు శరభ
శ్రీ కుసుమశ్రేష్ఠికి ,,
బంగారుబిడ్డవై ,,
వైశ్యజాతికినెల్ల ,,
వన్నె తెచ్చినతల్లి ,,
వందనములు ,,

(ఖడ్గము)

4\. వీరుండు క్రూరుండు శరభ
విష్ణువర్ధనరాజు ,,
శీర్షంబువ్రక్కలై ,,
చెలగునటుల ,,
చేసి యారాజ్యంబు ,,

భాసిల్లగాఁజేసి శరభ
మోక్షసౌధమునిచ్చి ,,
బ్రోచినట్టి ,,
వాసవీకన్యకా ,,
వందనములు ,,

(ఖడ్గము)

5. ధర్మంబుకొఱకునై శరభ
సత్యంబుకొఱకునై ,,
ధరనూటయిబ్బండు ,,
గోత్రదంపతుల ,,
ధర్మకంకణములను ,,
ధరియింపఁజేసి ,,
అగ్నిలో నాహుతై ,,
ఆనందమిడిన ,,
వాసవీకన్యకా ,,
వందనములు ,,

(ఖడ్గము)

6. శౌర్యవంతంబైన శరభ
వీర్యవంతంబైన శరభ
వైశ్యాన్వయానికి ,,
వన్నెనిచ్చుచును ,,
మమ్ము నీ బిడ్డలను ,,
బ్రోవు మమ్మ ,,
వాసవీకన్యకా ,,
వందనములు ,,

(ఖడ్గము)

7. అంబ ! సుగుణకదంబ ! శరభ
ఆదిశక్తి ,,
శాంభవీ ! సావిత్రి ,,
లలితాస్వరూపిణీ ! ,,
నిత్యంబు మమ్ముల ,,
రక్షించుమమ్మ! ,,
వావసీకన్యకా ! ,,
వందనములు ! ,,

# క వి

★

అతిపవిత్రంబైన ♦ అమ్మనబ్రోల్ పురం,
బందున జననంబు ♦ నందినాడ

వ్యవసాయ వాణిజ్య ♦ భాసమై వర్ధిల్లు,
నార్యవైశ్యాన్వయం ♦ బాత్మజాతి

భాగవత గ్రంథ ♦ పఠనధురీణుండు,
వీరరాఘవులు నా ♦ ప్రియజనకుండు

కష్టనష్టంబుల ♦ గణనసేయక మమ్ముఁ,
గాంచిన పున్నాంబ ♦ కన్నతల్లి

తమ్ము లున్నార లిద్దరు ♦ నమ్మువారు
సోదరీమణి నను జూచు ♦ నాదరమున
గఱ్ఱె సత్యనారాయణ ♦ కవి యటంచు
పిలుచుచుందురు మిత్రులు ♦ చెలిమివలన.

గ్రంథకర్త.

★

# శ్రీ కన్యకా పురాణము

## వాసవీ కన్యక

ఉ. శ్రీగణనాయకా! తొలుత ♦ చేతులు మోడ్చి నమస్కరించెదన్
వాగమృతంబు చేసెదను ♦ వాసవ కన్యక లోకమాత, నై
శ్యాగమపూత కావ్యమును ♦ నల్లి; యవిఘ్నముఁ జేయఁగోరెదన్
వేగమె వాంఛితార్థములఁ ♦ బ్రీతి నొసంగుము లోకనాయకా!

ఉ. గుండెలు బ్రద్దలౌ నటులఁ ♦ గుమ్మచు రేయిఁబవళ్ళు పాఠముల్
మొండికి వల్లెవేసినను ♦ మూల్గినఁగాని కవిత్వ మబ్బునే
పండితమౌళికైనను భ ♦ వత్కృప సుంతయు లేకయున్నచో
నిండు మనంబునన్ దలఁతు ♦ నీదుసమాదృతి నాద శారదా!

చ. సిరులిడుతల్లి! పొల్కడలి ♦ చెల్వఁపుఁగూతుర! కల్పవల్లిగా
వరముల నిచ్చు దేవి! నినుఁ ♦ బ్రార్థనఁజేసెద భక్తితోడ, సే
కరణను జేసి యిచ్చితిని ♦ గావ్యము చేర్చియు నన్నిసంగతుల్
వర వణిజాన్వయంబునకు; ♦ భాగ్య మొసంగుమ యెల్లవేళలన్!

సీ. ఎంగిలాకుల నెత్తు ♦ వృత్తిని దప్పించి, ఈమహా గౌరవ ♦ మిచ్చి నావు
వస్తులతో మాడి ♦ బాధలందెడి నాకు, మృష్టాన్నములను ది♦న్పించినావు
చదువు సంధ్యలు లేని ♦ శ్రమజీవి కీ గాన, సంస్కృతాంధ్రాల నో♦సంగినావు
విశ్వవిద్యాలయ – విద్వాన్ బరీక్షలో, నుంచి యుక్తిగను గె ♦ ల్పించినావు
గీ. చిరతరంబుగ నీపూజఁ ♦ జేయుచుంటి
తల్లి తండ్రివి, సర్వంబు ♦ దైవ మీవ
జానకీదేవి శ్రీరామ-చంద్రుఁ జేర్చి
నట్టి హనుమన్న! దీవించు ♦ మన్న నన్ను!

క. శ్రీకాత్యాయిని ! గౌరీ !
హేకాళీ! కనకదుర్గ ! ♦ ఈశ్వరి! ఆర్యా !
లోకాధీశ్వరి ! మాతా !
శ్రీకన్యాదేవి ! నీకు – సేవలొనర్తున్ !

శా. శ్రీరమ్యంబయి సాంద్రకీర్తియుతమై ♦ శ్రేయోవిలాసంబునై
ధీరోదారమునీంద్రవర్ణితమునై ♦ దేదీప్యమానంబునై
పారావారగభీరసాశ్రియమునై ♦ పావిత్ర్యయుక్తంబునై
పేరొందెన్ బెనుగొండ పట్టణము నాఁ ♦ బృథ్వీస్థలీరత్నమై.

సీ. రమణీయమై రమా♦రమణీమణీ తాండ,వమున నుప్పొంగు భ♦వనగణంబు
నందనోద్యాన సౌం♦దర్యంబు నిందించి, ప్రమదంబు నొందు నా♦రామగణము
వారణాసీపుర ♦ వరదేవతాగార,ములఁ గేళిసేయు దే♦వళదళంబు
దవ్వేగి నవ్వెడు ♦ తారాపథాలను, లీలమై గేరు హ♦ర్మ్యాల బారు

గీ. కలిగి కన్నులపండువై ♦ గానుపించుఁ
బున్నెములఁ బుట్టినిల్లయి ♦ పొలుపు నించుఁ
బుడమిఁ బరహితకంకణం♦బున్ ధరించు
సురపతినుతంబు పెన్గొండ♦పురవరంబు.

క. బంగరు సౌధంబులు స
న్మంగళయుత రామభజన ♦ మంటపచయముల్
శృంగారవిలాస మనుజ
పుంగవులకు నిలయము నయి ♦ పురవర మమరున్.

సీ. సత్యమే జయమంచు ♦ నిత్యంబు మదినెంచి, యనృతం బెఱుంగని ♦ యార్యులుండ
ధర నహింసాకాంక్ష ♦ పరమధర్మం బని, భూతదయన్ జూపు ♦ పుణ్యులుండ
తను వశాశ్వతమంచుఁ ♦ దమలోనఁ దర్కించి, సత్కార్యములఁ జేయు ♦ సాధులుండ
భక్తియే నిక్కమౌ ♦ ముక్తిమార్గం బని, దేవదేవుని గొల్చు ♦ ధీరులుండ

గీ. దానధర్మంబు లెప్పుడు ♦ దనరుచుండె
భోగభాగ్యంబు లెప్పుడు ♦ పొరలుచుండె
హర్ష వారాశిలో నోల♦లాడుచుండె
పుణ్యనిలయంబు పెన్గొండ ♦ పురవరంబు.

క. అందఱు భుజబలవిక్రము
లందఱు విజ్ఞానమతులు ♦ నందఱు ధీరుల్
అందఱు పరమపవిత్రులు
నందఱు వేదాంతవేత్త ♦ లందఱు సౌమ్యుల్.

సీ. ఘటంబుఁ గైకొని ♦ గంటకు వంద పద్యములను వ్రాసెడి ♦ తెల్గుకవులు
ఇది ఱాయి యెల్లొ? కా♦దే? యను నట్లుగ, శిలలను జెక్కెడి ♦ శిల్పగణము
వేదవేదాంతాల ♦ విఱిసి సారముఁ దీసి, ధర్మంబు నిల్పెడి ♦ తత్త్వవిదులు
గండశిలల నైనఁ ♦ గరగింపఁగాఁ జేయు, గానమాధురి నిచ్చు ♦ గాయకులును
గీ. కలిగి కళలకు నిలయంబు♦గా రహించుఁ
బాడిపంటలు నిచ్చ ల♦పార ముండు
నతిథిసత్కారముల కిక్క♦యై మెలంగు
భూరి పీఠంబు పెన్గొండ ♦ పురవరంబు.

సీ. హరికదంబము మత్త♦కరులతోఁ గరుణతో, నీటుగా వనిఁ జెర♦లాటలాడు
శార్దూలములు సాధు♦జంతుసంతతిఁగూడి, చెలిమిమై నొకచోట♦జలముఁ ద్రావు
శ్వాన బిడాల మూ♦షక శకుంతంబులు, సఖ్యంబుతో నిండ్ల ♦ సంచరించు
విషధరంబులు ప్రేమ ♦ విశ్వజీవులయందుఁ, దనరంగఁ జెంత నృ♦త్యంబొనర్చు
గీ. దుష్ట నిరపాయసత్త్వంబు ♦ లిష్టమతుల
రతులఁ దులఁదూఁగు మహితచి♦త్రంబు నెంచ
ధర్మదేవత స్థిరముగాఁ ♦ దాండవించు
బుధవరనుతంబు పెన్గొండ ♦ పురవరంబు.

సీ. పరకామినులను స్వ♦ప్నంబులం దైనను, సోదరీమణులట్లు ♦ చూచువారు
శరణన్నఁ బగవారిఁ ♦ గర మిచ్చి రక్షించి, భ్రాతృవాత్సల్యంబుఁ ♦ బఱపువారు
బీదసాదలయందు ♦ నాదరంబును జూపి, వెస నన్నపానాదు ♦ లొసఁగువారు
ప్రాచీన ధృత పావ ♦ నాచారసంచార, కౌశలత్వంబునఁ ♦ గ్రాలువారు
గీ. కపట మానసులఁ జండ♦కరులు గారు
సురసములు నౌ నిశీథినీ♦చరులు గారు
వరులు గాని తస్కరజార♦వరులు గారు
ఘనులు పెన్గొండ పురమందు ♦ మనెడి జనులు.

సీ. నిరతాన్నదానవి♦స్ఫురితంబులై కీర్తి, సాంద్రంబులై యొప్పు ♦ సత్రములును
నిఖిలసారగ్రంథ ♦ నిక్షిప్త సంస్కృతీ, శీలంబులైన గ్రం♦థాలయములు
హేలాభరంబులై ♦ కేళికూళులు గల్గి, చవుకంబు లగు నాట ♦ చౌపటములు
సంగీత సాహిత్య ♦ శాస్త్ర గోష్ఠి సుధల్, చిలుకు లలితకళా♦క్షేత్రములును
గీ. సరసపూర్ణంబులౌ చిత్ర ♦ సత్రి పత్ర
శాల జాలంబు గలిగి పౌ♦రాలి కమిత
సంతసముఁ గూర్చు పెనుగొండ ♦ సంతతంబు
ప్రకృతి కన్యామణీ శేఖ♦రంబు గాదె?

సీ. ధవులు దైవములంచుఁ ♦ దలపోయుదురు నిత్య,భక్తిచే గాఢాను♦రక్తిచేత
అతిథిసత్కారంబు ♦ నభిలషింతురు సదా, ఖ్యాతిచే మిగుల సం♦ప్రీతిచేత
బంధుసన్మానంబు ♦ పరమార్థ మని యెంతు, రెలమిచే నెలకొన్న ♦ చెలిమిచేత
సేవకాదరణంబు ♦ సేయుచుందురు కృపా, జవముచే లోకాను ♦ భవము చేత
గీ. చంద్రవదనలు పద్మలో♦చనలు భ్రమర
కచలు కీరవాణులు శైల♦కఠినకుచలు
మందయానలు సింహేంద్ర♦మధ్యలు మణి
లత లపరభారతీరమా♦సతులు స్త్రీలు.

క. ఆ పట్టణమును నేలెడు
భూపతి వైశ్యుండు గలఁడు ♦ పుణ్యాత్ముఁడు భూ
వ్యాపితయశోధనుఁడు ని
ష్పాపగుణాకరుఁడు కుసుమ♦సెట్టి యనంగన్.

సీ. ధనధాన్యములయందు ♦ ధనదుం డగును గాని, దానధర్మంబులఁ♦దరణిసుతుఁడు
భోగభాగ్యంబులఁ ♦ బురుహూతుఁ డగుఁగాని, పరసతీమాతృభా♦వమున రాముఁ
డందచందంబుల ♦ నలరువిల్తుఁడు గాని, దర్పరాహిత్యాన ♦ ధర్మసుతుఁడు
బలపరాక్రమమున ♦ భార్గవుం డగుఁగాని, సాధు వర్తనమున ♦ జైనమూర్తి

గీ. వర్తకంబున శ్రీ హరి♦శ్చంద్రమూర్తి
వైశ్య ధర్మాల నిష్ఠల ♦ బ్రహ్మమూర్తి
సరసుఁ డయ్యును సంఘసం♦స్కర్త యగును
కువలయము నేలు జగజెట్టి ♦ కుసుమసెట్టి.

సీ. కనఁగోరఁ డెపుడైనఁ ♦ గామినీసౌభాగ్య, లావణ్య గుణగణ ♦ లక్షణముల
వినఁగోరఁ డెపుడైన ♦ వీనుల విందుగాఁ, బరవంచకులు చెప్పు ♦ భాషణములఁ
దలఁపఁగోరఁ డెపుడు ♦ ధర్మవిరుద్ధమై, దనరుచుండెడి ధన♦ధాన్యకాంక్షఁ
బలుకఁబోవఁ డెపుడు ♦ పరమావసర మైనఁ, బాపహా కాఠిన్య♦భాషణముల

గీ. సతత సౌందర్య వీర్య భూ♦షణ యుతుండు
సకలజగతికి నెప్పుడు ♦ సమ్మతుండు
రాజసింహులలో ధర్మ♦రాజసముఁడు
కూర్మితోనుండుఁ బ్రజలకుఁ ♦ గుసుమసెట్టి

సీ. వెడదకన్నులవాఁడు ♦ నిడుదకూకటివాఁడు, డంబైన మేల్ లలా♦టంబువాఁడు
భాగ్యసూచితభవ్య♦వదనబింబమువాఁడు, మవ్వంపు శ్రోత్రయు♦గ్మంబువాఁడు
తిన్నచేతులవాఁడు ♦ దిటవు వక్షమువాఁడు, రవణిల్లు కంబుకం♦ఠంబువాఁడు
తమ్మిరేకులను బా♦దముల మీటినవాఁడు, నలరువిల్తుని సాటి ♦ యందగాఁడు

గీ. ప్రకటితానంద సద్గుణ♦భ్రాజితుండు
ధర్మనిరతుండు వ్యాపారి ♦ ధనికవరుఁడు
వైశ్యవంశాబ్ధిపూర్ణ జై♦వాతృకుండు
కుందనపుఁ జేటి జగజెట్టి ♦ కుసుమసెట్టి.

సీ. రమణీయగుహలచే ♦ రజతపర్వతము నా, శోభించి సౌధంబు ♦ సొంపునింపు
జలయంత్రములు మధ్య ♦ గలిగి చుట్టు సుగంధ,ముల నింపు పూలమొ♦క్కలు వెలుఁగ
కన్నుల మిఱుమిట్లు ♦ గలిగించు కాంతులఁ, గుడ్యభాగంబులు ♦ గొమరుమిగుల
వెలుఁగు విద్యుద్దీపి♦కలచెంతఁ దారాడు, వ్యజనసంతతి మనో♦హారము నుండ
గీ. నట్టి పరమాద్భుతంబు లె♦న్నెన్నొ చూపి
పట్టణమువారలకు దారి♦వచ్చువారి
కన్నులకుఁ బండువుగఁజేసి ♦ కానిపించు
పసిడి మేడను నివసించు ♦ కుసుమసెట్టి.

గీ. వైశ్యకులశేఖరులు మాఱు♦వల్కకుండ
మేటితేని విధంబునఁ ♦ మెలఁగుచుండి
అనుపమానందభాగ్యంబు ♦ లావరింప
నేలుచుండెను బెన్గొండ ♦ నెల్లవేళ.

సీ. కవి వచ్చె నని విన్నఁ ♦ గడువేగమున వచ్చి, కనకాంబరాదులఁ ♦ గప్పువాఁడ
సత్కార్యములఁజేయఁ♦జనుటందుఁ గడు సంత, సించి పౌరుల హెచ్చ♦రించువాఁడ
బీదవిద్యార్థులఁ ♦ బ్రీతిమైఁ బిలిపించిఁ, హెచ్చువిత్తంబుల ♦ నిచ్చువాఁడు
దుర్మార్గులకు డీక్ష♦తో సత్యమును జూపి, మంచి కర్జములఁ జే♦యించువాఁడ
గీ. నతిథు లెందరు వచ్చిన ♦ మితములేక
భక్ష్యభోజ్యంబుల నొసఁగి ♦ పంపువాఁడు
పరిమళంబున కెప్పుడు ♦ తఱుగులేని
కుసుమ మన నొప్పు జగతికిఁ ♦ గుసుమసెట్టి.

సీ. పూలహారంబున ♦ మూర్తిగఁ గన్పించు, వరరత్న మట్టుల ♦ మెఱయుచుండు
కొలఁకులం జరియించు ♦ పులుఁగుమూఁకలయందు, నంచచందంబున♦నలరుచుండు
గగనంబునందునఁ గన్పట్టు నక్షత్ర, ములయందుఁ జందురుఁ ♦ బోలియుండు
సర్వాంగములయందు ♦ సర్వదా శోభిల్లు, శీఘ్రంబుగతి వన్నెఁ♦జెలఁగుచుండు

గీ. గొప్పవారలలో నెల్ల ♦ గొప్ప పేరు
గౌరవము గల్గి వాక్శుద్ధి ♦ గలిగియుండు
సుగుణధన్యుండు శుభకర♦శోభితుండు
కుసుమగుప్తుండు శ్రీ పెను♦గొండయందు,

క. ఆకారము సౌందర్యం
బేకత్వముఁ బొందినట్టు ♦ లెసక మెసఁగ సు
శ్లోకుఁడు గంభీరుఁడు నగు
నా కుసుమార్యుని సతి కుసు♦మాంబయుఁ జెలఁగున్.

సీ. పతి వస్త్రమును దాల్ప♦సతి వస్త్రమును దాల్చుఁ, బతిపూజఁ జేసిన♦సతియుఁ జేయు
పతి జడల్ ధరియింప♦సతి జడల్ ధరియించుఁ, బతి తపంబును జేయ♦సతియుఁ జేయు
పతి మౌనమూనిన♦సతి మౌనమూనును, పతిపల్కరించిన ♦ సతియుఁబల్కు
పతి స్నానమాడిన ♦ సతి స్నానమాడును, బతి భుజియించిన♦సతియుఁదినును

గీ. పతికి మించిన దైవ మె♦వ్వరును లేరు
లే రని వచించు నానంద♦లీల మెఱయఁ
దోడికాంతలు చూచి సం♦తోషమంద
సతియుఁ బతిఁ జూచి ముదమందు ♦ సంతతంబు.

గీ. ఇటుల సామ్రాజ్య మెల్లఁ బా♦లింపుచుండ
కష్టములు దుఃఖములు గాని ♦ కని యెఱుఁగక
సర్వసౌఖ్యంబులను నంద♦సాగియుండి
కుసుమగుప్తముఁ బొగడు♦కొనును జనము.

గీ. ఆయు రారోగ్య భోగ భా♦గ్యములఁ గలిగి
జనులు ప్రేమచేఁ జేయు మ♦న్ననల నొంది
ఇత్థసౌఖ్యముల ననుభ♦వింపుచుండి
సంతతిఁ బడయఁగా లేక ♦ వంత నంది.

ఉ. అంతములేని భాగ్యముల ♦ నందుచు సంతతి లేకయుంటచేఁ
జింత మునుంగు వారల కి♦సీ! యిడ నేరక బిడ్డలన్; సదా
అంతములేని పేదరిక♦మంది కృశించెడువారి కిచ్చి య
త్యంతము పాపలన్, జడుఁడ♦టంచును నిందల బమ్మ దాల్చఁడే!

క. సంతతిలేనికతంబునఁ
జింతావారాశియందుఁ ♦ జిరకాలం బ
త్యంతము మునిఁగిరి కాంతా
కాంతులు గత్యంతరంబుఁ♦గాననివారై.

సీ. అనపత్య సదనంబు♦నందు విందారగిం, చరు మహాత్ములు లోటు♦తలఁగు టెట్లు?
ఎందఱు బిడ్డలం♦చే వారలైనను, బల్కలే రను పల్కు ♦ పలుకు టెట్లు?
జాతకర్మార్హ వ♦స్త్వంబు గాదని పల్కు, రపహాస మొనరించు ♦ టడఁగు టెట్లు?
పరడింభకుల నంక♦భాగంబుపైఁ జేర్చి, ముద్దాడు నభిలాష ♦ ముగియు టెట్లు?

గీ. ఊగుటుయ్యాలలోనుంచి ♦ యూచి యూచి
చేతులారంగఁ బైకెత్తి ♦ చిన్నపాప
ముద్దుఁగైకొంచు లే బుగ్గ ♦ నద్దుకొంచు
మనుపుకాలంబు రాదంచు ♦ మదిఁ దలంచు.

సీ. దేశదేశములందుఁ ♦ దేజరిల్లెడు దేవ,తా రత్నముల మ్రొక్కి ♦ తన్పినారు
నోములెన్నియొ నోఁచి ♦ నూర్లు లక్షలు కోట్లు, సత్కార్యములు వేడ్క♦సలిపినార
గంగాది నదుల ము♦నింగి గేహము వచ్చి, భూసురాళిని దృప్తిఁ ♦ జేసినారు
లోకబాంధవు సేవ ♦ నేకదీక్ష నొనర్చి, కఠినోపవాసము ♦ల్గడపినారు

గీ. మించు భక్తిని ఋషుల ద♦ర్శించినారు
చేయఁజాలని కర్జముల్ ♦ చేసినారు
పండితులయెడ సత్కీర్తిఁ ♦ బడసినారు
భవ్యమతు లను పేరుచేఁ ♦ బరగినారు.

ఉ. భానుఁడులేని వారము; శు♦భస్కరమై తగు తావి లేనిదా
సూనము; నిష్కళంకుఁ డగు ♦ సోముఁడు; సూత్రములేని పెండ్లి; సం
తానము లేని సంపదలు ♦ తథ్యము వ్యర్థ మటంచు దంపతుల్
పూనెడు వంతలన్ని తల♦పోయఁగలారొకో! మర్త్యు లెల్లరున్

ఉ. వాసవుఁ డైనఁ బొందని య♦పారధనంబులు సౌఖ్యసంపదల్
వాసిగ నింటఁ గాంచితిమి ♦ భక్తిమెయిన్ నిజదేవపూజని
శ్వాస మెలర్పఁ జేసితిమి ♦ సంతసమందఁగ; నవ్వి యెల్లయున్
దోసములై చెలంగెనని ♦ నోముల నోఁచుచునుండు నిచ్చలున్.

గీ. రాజ్యభోజ్యంబు లన్ని క♦రంబుగలిగి
భాగ్యభోగ్యంబు లన్ని య♦పార ముండి
తనయులు గలుగకుంట వ్య♦ర్థంబుగాదె!
అడవి వెలిగెడి వెన్నెల♦యట్లు పుడమి.

సీ. పసుపు నూనెలు పూసి ♦ పసిపాపకున్ గోరు, వెచ్చని నీళ్లోయు ♦ ముచ్చటకును
పాలిచ్చి లాలించి ♦ జోలపాటలఁ బాడి, జోకొట్టి నిద్రింపఁ♦జూచుటకును
వన్నె లొల్కెడు మేడ♦పయి మేల్మి రత్నంపు, టుయ్యాలలోఁ బెట్టి♦యూచుటకును
పాలు బువ్వను జాళు♦వాపళ్ళెరము నుంచి, పేర్మి నెత్తికొని తి♦న్పించుటకును
గీ. చిలుకలన్ జూపి జిలిబిలి♦పలుకు నేర్పి
సికను నును దువ్వి బొట్టుకా♦టుకలు పెట్టి
పక్కనన్ నవ్వుటకును ని♦ర్భాగ్య నైతి
నంచుఁ గుసుమాంబ మదిని జిం♦తించు నెపుడు.

గీ. కుసుమగుప్తుండు దుఃఖానఁ ♦ గుందికుంది
కొడుకు నైనను లేకున్నఁ ♦ గూఁతు నైనఁ
బొందఁగాలేక విసువును ♦ జెందియుండి
చేయవలసినఁ గర్జముల్ ♦ చేసిచేసి.

చ. కడుగడు బాష్పధారలను ♦ కన్నులనుండి స్రవించుచుండినన్
విడువడు చిత్తవేదనము ♦ బిడ్డలకోసము వాచివాచి యి
ప్పుడమి నపత్యవాంఛ యెటు ♦ పోవునొకో యని కోరికోరి వృ
ద్ధుఁడయి నిరంతరంబు సుత♦దుఃఖసముద్రనిమగ్నచిత్తుఁడా.

గీ. పూజ్యులౌ దేవతలనెల్లఁ ♦ బూజఁజేసి
పుణ్యతీర్థంబు లన్నిఁట ♦ మునిఁగి మునిఁగి
కడకుఁ గందును నొందైనఁ ♦ గాంచలేక
విసువుఁ జెందుచు వెత నొంది ♦ కుసుమసెట్టి.

ఉ. సర్గ మొనర్చు బ్రహ్మకును ♦ సత్కృపఁ బ్రోచెడు శౌరికిన్ సునై
సర్గికవృత్తి లోకమును ♦ సాంగముగా లయ మొందఁజేయు నా
భర్గునకున్ స్వవాత్మయుఁ బ్ర♦పంచమునంతయు నిండియున్న స
న్మార్గిణి నాదిశక్తిఁ దన ♦ మానసమందుఁ దలంచు నిచ్చలున్.

చ. తెలతెలవార మేల్కని, న♦దీజలమందు మునింగి, భక్తిఁ జే
తలు మొగిడించి, శక్తిని న♦తుల్ ప్రియమందఁగఁజేసి, తాను ని
శ్చలమతితోడ నొంటరిగ ♦ సైకతభూస్థలినిన్ జపించుచున్
శిలలు గరంగురీతి తన♦చిత్తమునన్ నుతియించు నిట్టులన్.

సీ. ప్రకృతిస్వరూపిణి ♦ సకలప్రపంచంబు, ప్రభవించి నీలో న♦డంగుఁ గాదె!
అఖిలచరాచరం♦బైన జీవాళికి, జీవనాధారంబు ♦ నీవు గాదె!
అణువు మొదలుగ బ్ర♦హ్మాండభాండంబెల్ల, నంబ! నీ చిద్విలా♦సంబు గాదె!
హరిహరబ్రహ్మమ♦హామహులెల్లరు, తల్లిరో నీదు పు♦త్రికులు గారె!

గీ. పంచభూతాత్మకంబు ప్ర♦పంచమంత
నీకు లోఁబడియుండును ♦ లోకమాత !
సంతతి నొసంగు టన్న నీ ♦ కెంతటి పని
పుత్రభిక్షను బెట్టు మో ♦ పుణ్యచరిత !

క. అని నుతియింపుచు నా శ
క్తిని దన మనమందు నిలిపి ♦ స్థిరసంకల్పం
బున సంతానముఁ గోరుచు
దినములు గడిపెడును దిక్కుఁ ♦ దెలియనివాఁడై.

గీ. అంతిపురమునందు నొకనాఁ ♦ డధికచింత
నొందు కుసుమాంబ లేచి తా ♦ నెందువలనొ
కాంచనాసనాసీనుఁ డౌ ♦ కాంతుఁ జేరి
హితమయాలాపముల తోడ ♦ నిట్టు లనియె.

చ. ధనదుని కైన నొక్కపుడు ♦ దాచక యాచనసేయకుండఁగన్
ఋణ మిడఁజాలు కీర్తిని స♦మృద్ధిగఁ గైకొను నంతపాటి వా
కదనదురురత్నశైలములు ♦ కాంచనరాసులు నింట వెల్గు కా
రణమును నెంచ నామదిని ♦ రాజిలె కొండొకయుక్తి వల్లభా !

చ. పుడమి నపత్యసౌఖ్యమును ♦ బొందని హేతువుచేత నెంతయేన్
దడఁబడఁ బూర్వులెందరొ వి♦ధాన మొకందును గానలేక నా
నుడివెడు జన్నమున్ సలిపి ♦ నోఁచిననోములు పండబారి మేల్
కొడుకులఁ గూఁతులన్ గని య♦కుంఠితమోదము నుల్లసిల్లరే !

ఉ. ఎందుల కింత కొందలము ♦ హెచ్చుట చెచ్చెర నిచ్చతో దశ
స్యందనుఁ డే మఖంబు ముని♦చంద్రులు మెచ్చఁగ నాచరించి తాఁ
బొందెనొ పుత్త్రసంతతిని ♦ బూర్వము నట్టి సవంబు నేఁడు పెం
పొందఁ బొనర్చినన్ గలుగ♦కుండురె బిడ్డలు సొడ్డు తీరదే !

క. హైమవతీకృపవలనన్
ప్రేమను గడియింపఁ గోరు ♦ విశ్వప్రాణి
స్తోమమున కింతకంటెను
నేమము గల వ్రతములేదు ♦ నిజ మిది నాథా !

గీ. పుత్రకామేష్టి యన్ యాగ♦మును రయంబ
చేసినన్ మనకోరికల్ ♦ జీవితేశ !
సిద్ధియగు వైశ్యవంశ వ♦సిష్ఠుఁ డైన
మన పురోహితుఁ డుండంగ ♦ మనకు నేమి.

చ. అని సతి పల్కు పల్కులకు ♦ హర్షసమాన్వితమానసుండు నై
వణిజకులప్రభుం డపుడు ♦ భాస్కరవర్యులఁ బిల్వనంపి యా
తనికి సవిస్తరంబుగను ♦ దా మొనరించెడు యజ్ఞవైభవం
బును వచియించి మూర్తమును ♦ ముచ్చటగా విధియింపఁగోరఁగన్.

గీ. పుత్రకామేష్టికిం దగు ♦ పుణ్యదినము
తత్పురోహితుఁ డప్పుడు ♦ తమకుఁ జెప్ప
సంతసం బంది యజ్ఞమున్ ♦ జరుపనెంచి
తగిన కర్జంబులన్ జేయఁ♦దలఁచి మదిని.

సీ. తనసంపదల నెల్ల ♦ ఘనపుత్రకామేష్టి, మఖమున వెచ్చింప ♦ మదిఁ దలంచి
నగరంబు సురవర♦నగరంబునుం బోలె, సింగార మొనరింప ♦ సెలవు నిచ్చి
సకలపట్టణ వణి♦గ్జనులకు శుభలేఖ, లనిపి రప్పించి సౌ♦ఖ్యములఁ గూర్చి
ఆంధ్రప్రపంచంబు♦నం దంతటన్ గల్గు, ద్విజుల నాహ్వానించి ♦ దీప్తిమించి
గీ. రాజసూయ మహాధ్వర♦రాజరాజి
తుండు పూజ్యుండు నౌ ధర్మ♦జుండు వోలె
నిజకళత్రసమేతుఁ డై ♦ నిష్ఠతోడ
హృష్టుఁ డై యజ్ఞమును నిర్వ♦హింపుచుండె.

చ. నయముగ నేడునూర్ల పదు♦నాలుగు గోత్రజు లైన వైశ్యసం
చయములు వచ్చె నంచు వెల♦చానలు మిన్నలు సంతసించి పై
పయిఁ మెఱుఁగుల్ విలాసములు ♦ బాగుగ దిద్దఁగ నేర్చెనార్ధనా
శయు విజయధ్వజంబునకు ♦ సాధన మీయదె యంచు నత్తఱిన్.

ఉ. ఆ సమయంబునందు మణి♦హాటకసౌధశిరంబునందు సం
తోసముతోడ నీశ్వరుఁడు ♦ తొందరఁజెందుచుఁ గాంచి ప్రేయసిన్
ఓ సతి! మర్త్యలోకమున ♦ నుండు వినోదములన్ గ్రహించితే
భాసురవైశ్యదంపతుల ♦ పావనయాగముఁ జూడు మల్లదే!

ఉ. వార లపత్యవాంఛ నిటు ♦ భక్తికొలందిగ నాచరించుచు
న్నారలు పుత్త్రికామసవ♦నంబును గావున వారికోరికల్
దీరుగఁ దీర్చుటందు మన♦దే పని నిన్నును నన్ను నింతగాఁ
గోరి భజించు దంపతులు ♦ కోటికి నొక్కరు నైన నుందురే?

చ. అలికులవేణి! ఆకసము♦నందు విమానములందు దేవతల్
నిలఁబడి చూచుచుండిరొ వ♦ణిగ్వరుఁ డొప్పఁగఁజేయు యజ్ఞమున్
జలనములేని భక్తి నిటు ♦ సల్పుచు భూసురబాంధవౌఘమున్
జ్వలనుని నిన్ను నన్నుఁ గడు♦సంతసపర్చిరి వైశ్యదంపతుల్.

క. అని కల్పఫలద్వయమును
మనమాఱఁగ లోకమాత ♦ మంగళహస్తం
బున వైశ్యరత్నమున కిడి
యును నంతర్ధాన మయ్యె ♦ నొకత్రుటిలోనన్.

గీ. పూలవానలఁ గురిపించి ♦ యాలుమగల
గౌరవించిరి నిర్జరుల్ ♦ గరము నాఁడు
వైశ్యులెల్లరు పూజించి ♦ ప్రస్తుతించి
రెంచి దంపతు లంతఁ జా♦లించెఁ గ్రతువు.

క. అంతన్ శుభలగ్నంబునఁ
గాంతామణి, దేవి యిడిన ♦ కల్పకఫలముల్
సంతోషముతోఁ దినియెన్
గాంతుఁడు కట్టెదుట నిల్చి ♦ కనుచుండంగన్.

ఉ. అంచితరీతి గర్భవతి ♦ యై నవమాసములున్ భరించి మే
లెంచెడి బాంధవుల్ చెలులు ♦ హెచ్చుగ నిచ్చలు సంతసింపఁ దాఁ
గాంచెను నొక్కనాఁ డుదయ♦కాలమునన్ సుకుమారు నొక్కనిన్
మంచి కుమార్తెనుం గవలు ♦ మాసతి పల్కిన పల్కుచొప్పునన్

గీ. భాసమానంబుగాఁ బూల♦వాన గురిసె
శుభము పలుకుచు నమరదుం♦దుభులు మ్రోఁగె
జననిజనకుల జన్మముల్ ♦ సఫలమయ్యె
నగర మొక నూతనం బాయె ♦ నాఁటినుండి.

గీ. గురువరేణ్యు నానతిఁగోరి ♦ కుసుమసెట్టి
ఆత్మజాతునకున్ విరూ♦పాక్షుఁ డనియు
ఆత్మసంజాతకున్ వాస♦వాంబ యనియు
నామముల నుంచె నఖిల మా♦నంద మొంద.

చ. సమకొను బారసాలదివ♦సంబున నింపుగ వైశ్యదంపతుల్
ప్రమదముతోడ దానము ల♦పారముగా నిడి వచ్చినట్టి చు
ట్టములకుఁ గొల్వుగాండ్రకు ది♦టంబుకొలందిగ సన్నుతుల్ సమ
గ్రముగఁ జేసినా రతుల♦కీర్తి దిగంతరవిశ్రుతంబుగన్.

ఉ. కట్టు ప్రసూనవాసనలఁ ♦ గ్రమ్ము పదారుపసిండి మేనుతోఁ
బెట్టిన చిన్నివెన్నెలకు ♦ వ్రీడ నొసంగెడు లేతనవ్వుతోఁ
జట్టి బెడంగు తేంట్లను హ♦సించెడు కుంతల వింతకాంతితోఁ
బుట్టిన వాసవిం గనని ♦ పున్నెము లేటికి పూజ లేటికిన్ ?

గీ. బాలనగరునిగా విరూ♦పాక్షవరుని
గౌరబాలికగాఁ గన్య♦కాకుమారి
వైశ్య ధర్మానుసారంబు ♦ వారు చేసి
రర్యు లా దేవతాలయ♦మందు నెలమి.

గీ. వాసవాంబయుఁ బుట్టిన♦ప్పటిమొదలుగ
అఖిలశుభలక్షణములతో ♦ నలరుచుండె
నిత్యమును దల్లిదండ్రుల ♦ నెమ్మనములు
కొలఁది మించినకూర్మిచే ♦ వెలయుచుండె.

సీ. రంగారు బంగార♦ముం గారు సింగార,పుం గాయమును నిండ ♦ భూష లుంచి
హొంబట్టు కెంబట్టు♦లం బుట్టు పుట్టంబు, లం బట్టి కట్టించి ♦ లంబుఁ గూర్చి
బీరెండ రేయెండ ♦ నీరెండ నేయెండ,లో నుండనీకుండఁ♦గా నమర్చి
పరహస్తవిన్యస్త♦దురవస్థవ్యత్యస్త,మస్వస్థతాగ్రస్థ ♦ మని తలంచి

గీ. షడ్రసోపేతభోజనసౌఖ్య మిచ్చి
పరగ నరచేతిలో నిమ్మ♦పండు మాడ్కి
వాసవిం బెంచి కన్యకం ♦ జేసినార
లర్యకులదంపతులు మహా♦దార్యగతుల.

చ. సరసిజపత్రనేత్రములు ♦ చందురుఁబోలెడు సుందరాస్యముఞ్
బరభృతగానమాధురిఁ బె♦నంగు మనోహరవాక్యగీతముల్
సురుచిరశుక్లపక్షమున ♦ శోభిలు గల్వలతేనిచందముఞ్
బెరుగుచునుండె నెల్లరికిఁ ♦ బ్రీతిగ వాసవి ముద్దుగుమ్మయై.

సీ. కొమరొప్ప గుజ్జన ♦ గూళ్ళాడు చెల్లరి, జిహ్వా కింపుగ వంట♦సేయుచుండు
ప్రేమమై బొమ్మల♦పెండ్లిండ్లఁ బొనరించి, వియ్యంబులం బొంది♦వెలయుచుండు
తమిమీరఁగా వింత♦దాగురుమూఁ తలాడుచు మూలమూలల ♦ దూయుచుండు
ఉల్లంబు రంజిల్ల ♦ నోమనగుంట లెంతయు నేర్పుతో నాడి♦తనరుచుండు

గీ. జిలిబిలి హారంగు పల్కు లం ♦ జిలుకుచుండు
నొప్పుగా వాకిటన్ ముగ్గు ♦ లుంచుచుండు
నందముగఁ బేరటమ్ముల ♦ కరుగుచుండు
వాసవిని గాంచువారి పా ♦ పములు వాయు.

సీ. జిలుఁగుపావడఁ గట్టి ♦ చిన్నారి పొన్నారి, వన్నె లొల్కెడు వల్లె ♦ వాటువేసి
బాలచంద్రునిబోలు ♦ ఫాలభాగమునందుఁ, జక్కఁ గస్తూరిచే ♦ ర్చుక్కఁ బెట్టి
నిగ్గు లీనెడు సోగ ♦ నెఱికురుల్ జడవైచి, సికఁజుట్టి పుష్పమా ♦ లికలఁ గట్టి
చిగురుటాకులఁబోలు ♦ చిన్ని యొజ్జని వ్రేళ్ళ, రమ్యంబుగాను గో ♦ రంట పెట్టి

గీ. పొలుపుమీఱంగ భూషణం ♦ బులను దొడిగి
గజ్జె లందెలు ఘల్లంచుఁ ♦ గరము మ్రోయ
నూయెలల నూఁగు వాసవీ ♦ ప్రాయసురభిఁ
గఱవుదీరంగఁ గనువారి ♦ కనులె కనులు.

చ. ప్రతిదివసంబునన్ సఖుల ♦ వాసవి యేగుచు నాలయంబునన్
మతిని దలిర్చు భక్తిని న ♦ మస్కృతులన్ బచరించి యిచ్చమై
యతులితగానమాధురిమ ♦ వ్యక్తముగాఁగను గీతికావళుల్
సతతము సల్పుచుండు మన ♦ సా వచసా నుతియింపుచుండియున్.

ఉ. అచ్చట నున్న నొక్కవన ♦ మందునఁ బూవులతావిఁ గ్రోలుచున్
ముచ్చటగా సఖీజనము ♦ ముందుఁ జనంగను బ్రీతిపాత్రమై
యిచ్చకువచ్చినట్టుల వ ♦ హించిన యా ప్రకృతీమతల్లి నిన్
విచ్చిన చిత్రపద్మముల ♦ వేడ్కగ నర్పణసేయు నిచ్చలున్.

గీ. ప్రతిదినంబును జెలులకు ♦ భక్తిఁ గఱపి
డెంద మానందముగఁ జేసి ♦ విందు లిచ్చి
యైహికాముష్మికానంద ♦ మందఁ జేయు
ప్రియసఖి! యంచుఁ జెలులెల్లఁ ♦ బిలుచుచుండ.

సీ. పసుల సోదరులట్లు ♦ భావించి వీక్షించి, ప్రియమునుఁ జేసియు నాద♦రించుచుండు
దేవదేవులయందు ♦ దివిసముద్భవులందు, మిక్కిలి భక్తితో ♦ మెలఁగుచుండు
బీదసాదలయందుఁ ♦ బిన్ననాటను గోలెఁ, గరుణాకటాక్షముల్ ♦ పరపుచుండు
ఆటపాటలయందు ♦ నీటుగోటులు సూపి, యెల్లవారికి మోద ♦ మిచ్చుచుండు

గీ. లీల మోక్షద కథల నా♦లింపుచుండు
వాసవీ కన్య కెనయగు ♦ బాల లెందు
లేరు లేరంచుఁ జాటి సొం♦పారుచుండు
వైశ్యకుల కీర్తిలతలఁ గా♦పాడుచుండు.

ఉ. యావనుఁడైన పుత్త్రునికి ♦ నొనరఁ దా వ్యవహారభాగముల్
బావనుఁడైన వైశ్యమణి ♦ బాగుగ నప్పనసేసి హాయిగాఁ
గోవిదగోష్ఠిఁ గాలమును ♦ గోరికతీరఁగఁ బుచ్చుచున్ మహా
శైవమతప్రధానమున ♦ శాస్త్రవిచారమునందు మున్గెడున్.

చ. జనకుఁడు దల్లియున్ దనకు ♦ సమ్మతినీయగ వాసవాంబ తా
దినమును బోయి విద్దెలను ♦ దేశికునొద్దను నభ్యసించి స
ద్గుణమణియై కళావిదిత♦కోవిదురాలయి సర్వసాహితీ
ధనము గడించి శోభిలుచుఁ ♦ దద్దయు ముద్దయి పెద్ద యాటచేన్.

చ. పరిణయయుక్తమౌ వయసు♦వచ్చినదాటను వాసవాంబనున్
గురువును జేరఁ బంపు టికఁ ♦ గూడదటంచును దల్లిదండ్రు లా
దరమున నిల్పి సౌధమునఁ♦దప్ప మఱెచ్చటి కేరితోడనున్
దిరుగుట గొప్పదోసమని ♦ దిద్దిరి సుద్దులు ముద్దుబిడ్డకున్.

మ. అరయన్ గూఁతురు పెండ్లియీడు గల క♦న్యారత్న మయ్యెంగదా
పరితృప్తుండగు భర్త యెచ్చటను సంప్రాప్తంబుగా లేదెటుల్
తెరు వింకెద్దియుఁ గానరా దనెడు సం♦దేహంబు బాధింపఁగా
శరణ్యం బార్యయు తోట్రుపాటు మన వై♦శ్యస్వామికిన్ గల్గెగా.

సీ. ఆ కన్యకాహస్త ♦ మే కుమారుఁడు పట్టె, యిం దుండ నేర్చునో ♦ యింద్రప
ఆ చంచలాకార ♦ నవలోకనముఁ జేయఁ, గలుగదే మనపుణ్య ♦ ఫలమునిండ
నవరత్నములబొమ్మ ♦ నవరించి శోధించి, సృజియించె విధి ధీవి ♦ శేషపటిమ
ఆ మోహవల్లీకృ ♦ పామానసముఁ గాంచి, ప్రకృతీమతల్లి సం ♦ బరము పడును

గీ. కన్నె గా దది యెలమావి ♦ గున్నగాని
గున్న గా దది మరునిపూఁ ♦ దిన్నె గాని
యెవ్వఁ డీ వన్నెమిన్నతో ♦ నీప్సితములఁ
దనివినందునో వాఁడెపో ♦ ధన్యతముఁడు !

ఉ. అన్నిటఁ గిన్నరేశ్వరుని ♦ నైన జయించెడు భోగభాగ్య సం
పన్నుల మంచు నెందఱో క్ర ♦ మంబుగఁ గోరఁగ నేగుదెంచఁగా
వన్నియలాడి కీడయిన ♦ వల్లభుఁ డొండును లేని కారణం
బెన్నియు మిన్నకుండెఁ గుసు ♦ మేశుఁడు. దీర్ఘవిచారలోలుఁడై.

చ. వరులు సమస్తభాగ్యగుణ ♦ వర్యులు వైశ్యకులావతంసముల్
సురుచిరరూపశేఖరులు ♦ చూడఁగ వచ్చి వధూమణీనిరం
తరదరహాసహాసవచ ♦ నంబులచందమునున్ దనూమనో
హరభరమున్ గుణార్ణవము ♦ నారసి సిగ్గునఁబోయి రెందఱో !

గీ. ఆంధ్రసామ్రాజ్యలక్ష్మికి ♦ నాటపట్టు
పుణ్యచాళుక్యవంశసం ♦ పూజితంబు
భూరి కవి పండితాళికిఁ ♦ బుట్టినిల్లు
రాణ్మహేంద్రపురంబు క ♦ రంబు వెలుఁగు.

ఉ. సుందరమందు దర్పకుఁడు, ♦ చూపులయందు దివాకరుండు, సం
క్రందనుఁ డాజియందు, నుడు ♦ రాజు శరీరవికాసమందు, గో
విందుఁడు సత్కృపాహృదయ ♦ విశ్రుతమందు, బుధుండు, సచ్చిదా
నందుఁడు, విష్ణువర్ధనుఁడు ♦ నాయఁడు తన్నగరంబు నేలెడున్.

సీ. రాజసూయం బొందు ♦ రాజసం బొప్పఁ గా,వించినాఁ డరులఁ దూ♦లించినాఁడు
నిజభుజోద్ధతిచేత ♦ విజయధ్వజంబు స్థా,పించినాఁ డర్థ మా♦ర్జించినాఁడు
ఘనవిపశ్చిత్కాండ♦మును గృపాదృష్టి ర,క్షించినాఁ డెదురు వీ♦క్షించినాఁడు
ప్రజల బిడ్డలరీతి ♦ సుజను లెన్నంగ లా,లించినాఁ డెలమిఁ బా♦లించినాఁడు

గీ. కలితపరిపంథినృపసింహ ♦ కామినులను
నెంచి వంచించినాఁడు మో♦హించినాఁడు
దోస మొకకొంత వర్తింపఁ♦గా సతంబు
కుందినాఁడు పరాజయ ♦ మొందినాఁడు.

గీ. కడల సామంతరాజులు ♦ కప్పములను
మీఱి తనకు నర్పింపని ♦ కారణమునఁ
బ్రజల యార్తారవంబు లు♦ప్పతిలుకతన
విష్ణువర్ధనుఁ డంతట ♦ విసువుఁజెంది.

చ. అగణితవాహినీయుతుఁడు ♦ నై ధరణీధవుం డహో
పగతుర నొంచి కప్పములఁ బ్రాభవమొప్పఁగ స్వీకరించి తా
నొగి వనసీమఁ జేరి యట ♦ నుండు సమస్తకిరాతయుక్తుఁడై
మృగములఁ జంపియుఁ ముదము ♦ మీఱఁగ దక్షిణతీరమందునన్.

చ. మరకతపద్మరాగమణి♦మౌక్తికనిర్మితహేమకుడ్యమం
దిరములు చంద్రశాలలు వి♦నీలజలాకరపుష్పవాటికల్
స్థిరశుభదేవళంబులును ♦ దేవ నమస్కృతయజ్ఞభూములుఁ
గురుమతరాజి గల్గు పెను♦గొండపురంబును జూడ నేగియున్.

చ. ధగధగ వెల్గు ధర్మగుణ♦దర్పముచేతను మిన్నుముట్టు త
న్నగరసమీపమందుఁ గల ♦ నవ్యమనోహరసూనగంధముల్
నిగనిగలీను నీటిపయి ♦ నీరజకైరవముల్ జెలంగు బల్
పొగసు సరస్సులుఁ గలిగి ♦ శోభిలు సుందరనందనంబునాన్.

చ. వనమునఁ జక్రవర్తి పరి♦వారముతోఁ విడిదింబొనర్చు వా
ర్తను పురవాసులెల్లరును ♦ బ్రాసము సమ్మద ముప్పతిల్లఁగా
విని చనుదెంచినారలు న♦వీనఫలమ్ములు తమ్ములమ్ములున్
గనదుపహారసంచయముఁ ♦ గైకొని భూతలవల్లభున్ గనన్.

గీ. చక్రవర్తిని బ్రార్థించి ♦ సమ్మతింపఁ
జేసి పట్టణమందున ♦ భాసురముగ
నుండు విడిదిగృహంబున ♦ నుండఁజేసి
రార్యవైశ్యులు భక్తితో ♦ నాదరముగ.

ఆ యమాయకదినముల♦యందు సతము
కన్యకలు భేదభావ మొ♦కంత లేక
భక్తి నీరాజనము చక్ర♦వర్తులకును
నొసఁగుచుండెడి యాచార♦మొండు గలదు.

గీ. కన్యకాబాల సుందర♦కనకవల్లి
తల్లిదండ్రుల యాజ్ఞచేఁ ♦ దానుఁగూడ
విమలనీరాజనమును హ♦స్తమునఁ బూని
భూపతికి నిడి కుసుమాలఁ ♦ బూజ సేసె.

శా. ఆ లావణ్యము నా తనూవిభవ మా ♦ యాకారసౌందర్యమున్
దా లక్ష్యంబుగఁ జూచి చూచి యహహా! ధన్యంబు జన్మం బటం
చాలాపించుచుఁ బెక్కురీతులుగఁ దా ♦ నాత్మన్ స్పృహన్ దప్పియున్
నేలంగూలె నశేషసంఘముకడన్ ♦ నిర్భీతిగా మోహమున్.

ఉ. అంతటఁ జూపరుల్ మిగుల ♦ నచ్చెరుపాటున రిచ్చవోవ ధీ
మంతులు మంత్రిసత్తములు ♦ మానవనాథునకున్ జికిత్స ల
త్యంతముఁ జేసినారు, వసు♦ధాధిపుఁ డొక్కట మూర్ఛఁ దేరి యే
కాంతమునం దమాత్యునకు ♦ నాదరమొప్పఁగఁ బిల్చి యిట్లనున్.

ఉ. చక్కనిచుక్క వైశ్యకుల♦సాగరకన్యకలందు మిన్న యా
చక్కటిఁ గాంచ మల్లదియె ♦ చక్కని పూవులమాలఁ జేతఁ దా
నొక్కటిఁ దెచ్చి తల్లికడ ♦ నొప్పుగ ముచ్చట మెచ్చ నిచ్చె నా
చక్కెఱఁబోఁడి నెట్లయిన ♦ చయ్యన నా కిడి పెండ్లిసేయుమా!

ఉ. శ్రేష్ఠులనందరిన్ సచివ♦శేఖరుఁ డొక్కటఁ బిల్చి భూపతి
శ్రేష్ఠుఁడు వాసవిన్ వలచి ♦ చెందిన చిత్తవికారమంతయున్
శ్రేష్ఠముగాఁగఁ జెప్పి ప్రతి♦షేధముకూడ దటంచు వేడియున్
శ్రేష్ఠము క్షేమ మంచుఁ బలు♦రీతులఁ జేసె హితోపదేశముల్.

చ. పలికెడు మంత్రివల్కులకు ♦ వైశ్యకుమారులు విస్మయంబునన్
గలవఱపాటు నొంది తమ♦కన్యను రాజున కీయకున్నచో
నలజడు లెన్నియో జరుగు ♦ నాతఁడు సూడగు, నిచ్చియున్నచోఁ
గులమతవైమనస్యమును ♦ గూడునుగాదె యటంచుఁ బ్రోడలై.

ఉ. అంతటఁ బెద్దలైన కుసు♦మార్యునితోడను భాస్కరార్యుతో
మంతనమొంది రెల్లరను ♦ మానము మానససీమలందు నా
క్రాంతముగాఁగ భూపతికిఁ ♦ గన్యనొసంగుట కూడదంచు సి
ద్ధాంతముఁజేసి రాజును బ్ర♦ధానిని జేరి వచించి రీ గతిన్.

సీ. వసుధనాయక! మీరు ♦ వచియించినదియెల్ల, వినినార మద్ది కా♦దనఁగలేము
మీ రెఱుంగని ధర్మ ♦ మీమాంస లవి లేవు, శాస్త్రవిరుద్ధముల్ ♦ సలుపలేము
ఏ పురాణములందు ♦ భూపాలకావళి, కన్యలన్ హింసించు♦కథలు వినము
కులసమ్మతముగాని ♦ యలవాటులు వహించు, నాచార మీ గ్రామ♦మందుఁగనము
గీ. ఆర్యజనసమ్మతముగాని ♦ కార్యములకుఁ
దెగువఁజేసినఁ దలలెత్తి ♦ తిరుగలేము
క్షత్రియాన్వయరత్న భూ♦షణమవయ్యు
రోషమున వైశ్యకన్యాభి♦లాష యేల?

గీ. అదియునుంగాక మా దేవ♦తాలయమున
గౌరబాలిక యయ్యె మా♦కన్యకాంబ
బాలనగరులు తప్ప యె♦వ్వరును గాని
గౌరబాలికలను గోరఁ♦గడగరాదు.

సీ. సుగుణవిద్యారూప♦సుందరీరత్నంబు, లెందఱో మీ కుల♦మందు లేరె!
అందచందము గల్గి ♦ యలరుచుండెడి వైశ్య, వనితఁ గోరెడిబుద్ధి ♦ వదలలేరె!
మిమ్ము మమ్మును మీఁదు ♦ మిక్కిలి సాటివా, రపహసింతు రటంచు♦నరయలేరె!
"జాతిన్యూనంబైన♦శౌర్య మంధం బౌనె," యనెడు లోకోక్తిఁ గ్ర♦హింపఁగలేరె!

గీ. మీరు మముఁబోంట్ల నీ రీతిఁ ♦ గోరరాదు
కోరినంతనె మే మియ్య♦కొనఁగరాదు
నీతినియమాలు భారత♦జాతి కెపుడు
ఊతకఱ్ఱలు గావె భూ♦నేతచంద్ర!

గీ. కులము రోషము లోకనిం♦దలకు నేమి
ఆత్మసంఘంబు రప్పించి ♦ యాదరమునఁ
గలిసి కర్తవ్య మూహించి ♦ కార్యసరణి
చెప్పఁగల నంచుఁ గుసుమశ్రే♦ష్ఠియును బలుక.

గీ. గడు వి దెనిమిది దినము లి♦క్కాలమునకు
దాటి యుండినచో మహా♦దండుతోడ
వచ్చి నిర్బంధరీతి మీ♦బాలకన్యఁ
బెండ్లిఁగావించుకొందు నని ♦ వెడలిపోయె.

గీ. కుసుమగుప్తునకును వైరి♦కోటియైన
ఆఱునూర్ల పన్నెండుగో♦త్రాధిపులును
చక్రవర్తికి సాయంబు ♦ సలుపఁదలఁచి
మార్గమధ్యానఁ గలిసి సా♦మ్రాజ్యపతిని.

గీ. జయము ! జయము ! మహారాజ ♦ సార్వభౌమ !
సర్వచాళుక్యసామ్రాజ్య♦చక్రవర్తి !
మార్గమునఁ జెప్పఁగా నవ♦మాన మనక
వినఁగఁగోరెద మీ చిన్ని♦విన్నపములు.

సీ. కన్యకన్ మీ కిచ్చి ♦ కళ్యాణమొనరింప, నఖిలవైశ్యులు మోద♦మందినారు
జ్యోతిషులన్ బిల్చి ♦ శుభలగ్న మేర్పాటు, సేతు మంచును వేడ్కఁ ♦ జెప్పినారు
వైవాహికోత్సవా♦హ్వానపత్రిక మీకుఁ, బంపింతుమని చక్కఁ ♦ బలికినారు.
పురమెల్ల శృంగార♦ముగఁ జేయుటకుఁగాను, కొలఁదిరోజులు నేఁడు ♦ గోరినారు

గీ. ఏమి చెప్పుదు మా భాగ్య ♦ మే మనందు
అల్లుఁ డయ్యెను ధారుణీ♦వల్లభుండు
కన్య నర్పింతు మో మహీ♦కాంత ! మీకు
లేకయుండిన మరణంబు ♦ ప్రాకటంబు.

క. అను శపథంబున కెంతయు
జననాథుఁడు సంతసించి ♦ చనె పురిఁ జేరన్
మనముల సంతోషముతో
వణిక్కులశిరోమణులును ♦ బట్టణ మేగెన్.

గీ. గడువుఁగోరితి మయ్యది ♦ గడచుచుండె
మేదినీశునితోఁ బోరు ♦ మేరగాదు
ఎద్దియే వార్త నంపు టెం♦తే ఘనంబు
గాదె! యం చర్యపాలుండు ♦ కడుఁ దలంచి.

సీ. ప్రాభాత సద్గోత్ర ♦ వైశ్యాబ్ధి సోముండు, కుసుమరత్నము మదిన్♦గోర్కెహెచ్చి
పరిసరంబుల గ్రామ♦పట్టణంబుల నుండు, వణిజపుంగవుల రాఁ♦బనిచి మెచ్చి
ఆహ్వానపత్రంబు ♦ లంపి నగరస్వామి, సముదాయమును రభ♦సమునఁ దెచ్చి
విజ్ఞానమయులైన ♦ విపణిసంఘము వార్త, లనిపి రాఁ జేసి యా♦హ్లాద మిచ్చి

గీ. చర్చితాంశంబు లమితంబు ♦ సంగ్రహించి
సౌధరాజంబునం దొండు ♦ సభ నమర్చి
కల్పపరిషత్సమావేశ♦కారణముల
వినయగౌరవముల విన్న♦వించి మించి.

క. కర్తవ్యము నూహించెడు
కర్తలు దా రనుచు రచ్చఁ♦గల్పించితి మీ
కర్తృత్వము నెఱ్ఱఁ♦గింపుఁడు
వర్తన మా భర్త కనుప♦వలెనని పలుకన్.

ఉ. ఆర్యుఁడు భక్తవర్యుఁడు మ♦హాగుణధుర్యుఁడు, పుణ్యకార్య తా
త్పర్యుఁడు, శౌర్యసాహసుఁ డ_పారగుణాకరవర్యుఁడున్ గృపా
చార్యుఁ డుదార చర్యుఁడు ల♦సన్నుతపండితుఁ డైన భాస్కరా
చార్యుఁడు చర్చితాంశములఁ ♦ జక్కఁగ విప్పి వచించె నాసభన్.

గీ. రాజునకుఁ గన్యనీయగా ♦ రా దటంచు
శౌర్యమున్ జాటి రొక్కప♦క్షంబువారు
ఇచ్చుటే మేల టంచును ♦ ముచ్చటించి
సంతసించి రింకొక్కప♦క్షంబువారు.

గీ. బాల నిచ్చుట మేలంచుఁ ♦ బలుకువార
లొక్కరొక్కరుగా లేచి ♦ నొక్కిచెప్పి
రన్నిరీతుల వారికి ♦ నవనిపతికి
నిచ్చగాఁ జేయు బుద్ధుల ♦ నీ విధాన.

లోనఁ బుట్టిన ♦ వారమయ్యు
భవుతోడ ♦ సంతసముగ
బ శుభ మని ♦ వేడ్క వాడమ
గ్గ వచ్చుట ♦ కేమి కతము ?

గీ. విష్ణువర్ధనపతిశ్రోడ ♦ వియ్యమంద
సకలభూమండలము వైశ్యా♦జనులఁ బొందు
నట్లు చేయనిచోఁ గన్య ♦ నపహరించి
అతఁడు గొనిపోడె మనగర్వ♦మణఁగఁ ద్రొక్కి.

గీ. మన మిదేరీతి యోచనన్ ♦ మునిఁగియుండి
"రాజునకుఁ గన్య నీయఁగా♦రా దటంచు"
శౌర్యములఁ జాటుచుండిన ♦ సంగరమున
నిలుచు సామర్థ్య మినుమంతఁ♦గలదె మనకు ?

శా. ఏ యే ధర్మము నిల్పఁ బూనొకొనిన నే ♦ యే నీతులన్ బొల్చినన్
న్యాయంబుల్ మతముల్ స్వజాతినియమం ♦ బాసించినన్లైన ముం
దాయుర్దాయము దేహదార్ఢ్యమును బొం♦దై యుండినన్ గా దొకో !
కాయం బొక్కటి ధర్మసాధనమునన్ ♦ గాంచంగ నాద్యంబె కా !

గీ. బాలనగరులు నూటయి ♦ బ్బండు గోత్ర
దంపతులు నిల్చి వారల♦దర్పములను
విని సహింపఁగలేక ఆ♦వేశపూరి
తాత్ము లయి యిట్లు నుడివినా ♦ రానుపూర్వి.

మ. మలభాండంబగు పాడుపొట్టకొఱకై ♦ మానంబు వోనాడి ని
చ్చలు జీవించుటకంటె సంఘమున నై♦చ్య బుండు నే యింకఁ గ
న్నులఁ గానబడుచుండె దృశ్య మిది య♦న్యుల్ క్రూరులై సంఘమున్
నలుపంజూచుచునుండ నూరటను జె♦న్దన్గల్గునే యొంతకున్

సీ. దండతాడితఘోర♦కుండలి తతి సభ, రెట్టించి బుసకొట్టి ♦ లేచినారు
ప్రళయకాలోద్ధూత ♦ వైవస్వతులరీతి, భయదస్వరూపులై ♦ పరగినారు
కదనరంగాక్షీణ♦కౌక్షేయకము లట్లు, ఆవ్వాన రెపరెప ♦ రేగినారు
స్థైర్య ధైర్య క్రౌర్య ♦ హర్యక్షముల భంగి, గర్జించి తర్జించి ♦ కదలినారు

గీ. ప్రాణములపైని స్పృహలేని♦వాఁ డెవండొ
వాసవిని విష్ణువర్ధన ♦ వసుమతీశ
వశముఁ జేయంగఁ బితాధి♦పతుల మ్రోల
ధైర్యముండినఁ బ్రతినఁ దాఁ ♦ దాల్చవలయు.

ఉ. ఉర్విఁగలన్నినాళ్ళు కుల ♦ మూరును బేరును నిల్పుచుండియున్
సర్వ మెఱుంగుకైవడిఁ బ్ర♦శస్త దిగంతసితాంత విశ్రుతా
ఖర్వయశంబు నొంది మనఁ♦గావలె నంతియెఁగాని మూర్ఖులై
దుర్విధులై కళంకముల♦దొర్లెడువారల కేల జన్మముల్

సీ. ధనదాన్వయమునందు ♦ జనియుంచి మీ రౌర, హీనులై కడుసిగ్గు ♦ మాని నారె!
పరకులోద్భవుఁ డైన ♦ ప్రభువర్యులకుఁ గన్నె, నర్పింతురే మీకు ♦ నాత్మ లేదె!
మనకులంబునఁ బుట్టి ♦ మన వరునకు నీయఁ, జాలరే! మీకు మీ♦సాలు లేవె!
గోత్రశౌర్యము నామ♦మాత్రంబునకు నుండఁ, జూతురే సుంతయుఁ ♦ నీతి లేదె!

గీ. నేతలకుఁ గన్నియలఁ గూర్చు ♦ నీచులైరె?
స్వకులమానాభిమానముల్ ♦ వదలి నారె?
తార్పకాండ్రైరె! నీతులు ♦ దప్పినారె!
క్రూరులైరె? సంసారులు ♦ గారె మీరు.?

సీ, కులశైలములు స్థాన♦ములు మాని వెతలూని, కోపించి శాపించి ♦ కూలుఁగాక!
సప్తాబ్ధు లొండొంట ♦ జగడించి చలియించి, వంచించి లోకముల్ ♦ ముంచుఁగాక!
యినచంద్రములు పర్య♦టన వీడి గతులూడి, రాలుగా నేలపై ♦ రాలుఁగాక!
సురవర్గ మా స్వర్గ♦పురి కగ్గి నిడి డిగ్గి, పూర్ణాసురత్వంబుఁ బొందుఁగాక!

గీ. మేటి దవు లేడును నస్త♦మించుఁగాక!
ముందు మన కొంపలకె కీడు♦మూడుఁ గాక!
కంఠములయందుఁ బ్రాణాలు ♦ గలిగియుండఁ
గన్య నన్యుల కర్పింపఁ♦గా వశంబె!

సీ. కులజనితల నన్య♦కులజన్ములకు నిచ్చి, మనుటకంటెను బల్మి ♦ మడియరాదె ?
ప్రాచీనసన్మార్గ♦భాగ్య మూడ్చుటకంటె, గుండంబులం దూకి ♦ మండరాదె ?
అధికారులకు భయం♦బంది యేడ్చుటకంటె, మున్నీటికెరటాల ♦ మునుఁగరాదె?
పుడమియొడయని బుద్ధి ♦ పొగడి పొంగుటకంటె, మీానోళ్ళకుఁ గడ్డి♦ మేపరాదె?
గీ. మదనపీడితులకు జాతి♦మత మదేల ?
తల్లిచెల్లెలు పిల్లయఁ ♦ దగ వదేల ?
పౌరుషం బేల ? న్యాయవి♦చార మేల ?
సజ్జనప్రోక్తహితవాక్య ♦ సరణి యేల ?

క. మీాసము లుండిన మగవా
రీ సభయం దుండిరేని ♦ యేరీ ! రం డా
వాసవి నెటు నరపతి కిడి
చేసెదరో ? పెండ్లి; బదులు ♦ సెప్పుఁడు మాకున్.

సీ. బల మాన పౌరుషం♦బులు సూపలేకున్న, ప్రాణంబులం దాస ♦ మానుకొనుఁడు!
చీమునెత్తురు మేన ♦ క్షీణించియున్నచో, వనితాసుతాదుల ♦ న్వదలికొనుఁడు !
మీాసాలపై రోస♦మీాసడించిన ఘోర, నరకప్రయాణంబు ♦ సరకుఁగొనుఁడు !
వగలాడు నగుతేఁడు♦పగవాఁడు గాకున్న, మించు భోగములఁజా♦లించుకొనుఁడు !
గీ. బ్రతికియుండిన సుఖములు ♦ భాగ్యములును
బడయ నౌనన గాజులఁ♦దొడిగికొనుఁడు !
కాటుకల దిద్ది చీరెలం ♦ గట్టుకొనుఁడు !
అవనినాథుండు వలచు మి ♦ మ్మటకుఁ బొండు !

ఉ. నాటిసభాస్థలి న్నిలిచి ♦ నాటిరి శౌర్యమహీరుహంబులఁ
బోటరులై ప్రతిజ్ఞలను ♦ బూనిరి మానక మానధైర్యముల్
దీటెరి తేటమీాసలను ♦ దెంపుగ నింపుగ వైశ్యసింహముల్
చాటిరి సింహనాదముల ♦ జాతివిరుద్ధనిషిద్ధపద్ధతుల్.

గీ. ప్రళయకాలదావాగ్నులు ♦ ప్రజ్వలింప
రోషభీషణవాక్యముల్ ♦ ఘోష లెత్త
వాసవిని రాజునకు నీయ♦వల దటంచుఁ
జాటి రిట్టులఁ బూర్వప♦క్షంబువారు.

ఉ. వెంటఁ గలట్టి వైశ్యకుల♦వృద్ధులు పెద్దలు దీనిఁ జూచి బల్
తంటలు వచ్చునం చెఱిగి ♦ తత్ క్షణ మెల్లఱ బుజ్జగించి యా
పంటవలంతిపెన్మిటికి ♦ వాసవి నిచ్చుటఁ గూడ దంచు నె
న్నోటనె వార్తనంపుటకు ♦ నిర్మలనిశ్చలచిత్తమత్తులై.

శా. అంతన్ వైశ్యకులావతంసములు పీ♦ఠాధీశులున్ బెద్దలున్
అంతర్వాణులు మారువల్కుటకు నే♦యాధారము న్లేక ని
శ్చింతంబొంది వితర్కము ల్సలిపి శే♦ష్ఠిన్ ధీరునిం బిల్చి వృ
త్తాంతం బిట్లు వచింపఁబంచిరి సభా♦ధ్యక్షుండు మేల్మేలనన్.

సీ. తొల్లిఁ బూఁదోఁటలోఁ ♦ జెల్లు పల్కులకెల్ల, పంతంబు కగ్గె మా♦వారికనుము
ప్రాణగొడ్డము లెన్ని♦యోనాఁడు ప్రాప్తించి, అరవాయిఁగొనుటదా♦నెఱుఁగుననుము
పెఱకులంబున కేప్డు ♦ బిడ్డ నీయంగరా, దంచు సిద్ధాంతంబు ♦ నుంచిరనుము
గురువరేణ్యుల రాక ♦ జరిగి నేల్సభ యొందు, విషమభావములతో ♦ వెడలెననుము

గీ. తనమనోరథ మిా జేరఁ ♦ దగనిదనుము
నేఁటి మాతప్పులెల్ల మ♦న్నింపుమనుము
ప్రజలపైఁ గిన్క వహియింప♦వలవదనుము
మనుము మా♦ప్రణతు లనుము.

ము నగు నా
ననకతను ♦ జెవులం గొని యు
మనం బయి యు
జేరి రాజ♦భవనమునందున్.

సీ. సామంతభూపాలసందోహ మేతెంచి, యుపవిష్టులై కాన్క ♦ లొసఁగుచుండ
సచివాగ్రణులు రాజ్య♦సందేశములను నా, సీనులై చక్క వ♦చించుచుండ
పంచమశ్రుతిఁ జేసి ♦ పలికెడు గాయకుల్, సంగీతమాధురిన్ ♦ జల్లుచుండ
దాసులౌ దాసదా♦సీసంఘ మతిభక్తి,చేఁ బరిచర్యలం ♦ జేయుచుండ

గీ. హంసముఖమున రత్నసిం♦హాసనమునఁ
గొల్వుకూటంబునను శివిఁ ♦ గూరుచున్న
వాసవీమోహవిభ్రాంతి♦వశుని జేసి
వేడ్క దర్శించి మ్రొక్కె నా ♦ విడ్వరుండు.

ఉ. మంగళవార్తఁ దెచ్చె నని ♦ మానవనాయకుఁ డాత్మఁబొంగి పే
ర్మిం గని కౌఁగిలించి పలు♦రీతుల సత్కృతులం బొనర్చి చెం
తంగలపీఠమందు గుణ♦ధాముని శ్రేష్ఠిని నుండఁజేసి రా
జాంగము సంతసించెడు శు♦భాన్వితకార్యవిశేష మేమనన్.

ఉ. ఏమని విన్నవింపఁగల ♦ నే నశుభాన్వితవార్త నేఁడు భూ
స్వామికి! క్రోధపూర్ణుఁడయి ♦ శస్త్రకరుండయి ఖండఖండముల్
నామెయిఁ గోయకుండ విడు♦నా కనునా? కరుణామతిన్ బరం
ధాముఁడు భీముఁడే శరణు ♦ నా కిఁకఁ జెప్పకఁదప్ప దంచుఁ దాన్.

సీ. శ్రీమన్మహారాజ♦శేఖరా! పెన్గొండ, వైశ్యులెల్లరు మీకుఁ ♦ బ్రణతు లనిరి
ఆరామవృత్తాంత ♦ మాద్యంతము న్మీకుఁ, గరతలామలక మం ♦ చెఱుఁగు మనిరి
జాతిపీఠాధ్యక్ష♦చయసమక్షమునందు, సభ విరుద్ధంబుగా♦జరిగె ననిరి
కులమువారలమాట ♦ వెలివేసి మాకన్య, నొరుల కిచ్చుట కించు♦కొప్పమనిరి.

గీ. కోర్కె వాసవిపై మీకుఁ ♦ గూడ దనిరి
పరిణయాపేక్ష మరి స్వప్న♦వార్త యనిరి
తప్పులెల్ల మన్నించుట ♦ గొప్పయనిరి
యీ నయాలాపములు మీకు ♦ హితము లనిరి.

సీ. సీతామహాలక్ష్మి♦కై తపించిన దైత్య,వల్లభుం డనిలోనఁ ద్రెళ్ళలేదె?
పాంచాలిపై మోహ♦వాంఛఁగొన్నట్టి కీ,చక నీచదనుజుండు ♦ చావలేదె?
దమయంతితోఁ గేళిఁ♦దలపెట్టుకతనఁ గి, రాతకుం డనిలోన ♦ రాల లేదె?
సాధ్వీమణులతోడ ♦ సయ్యాటముల నెంచుఁ, గూళలెందరొ ధాత్రిఁ ♦ గూలలేదె!

గీ. పరసతీమణులకుఁ దల♦వంపు లెంచు
వారలకుఁ దలవంపు లా ♦ వరుసఁ గలుగు
వల వ దేటికి గౌరవ♦కులమువారి
బాలపై మీకు? రాజేంద్ర♦మౌళి! వలదు.

క. వంచన విడి సత్యం బెఱిఁ
గించితి నాపైని కోప♦గించకుఁ డధిపా!
యొంచితి మీ మే లిటు బో
ధించితి నని శ్రేష్ఠి మిగులఁ ♦ దెగువం బలుకన్.

సీ. మును కన్య నర్పింతు ♦ మని నన్ను నమ్మించి, మోసగించిరె మీరు♦మూర్ఖులార!
మీనాలుకలు వాలుతో♦ నేఁడె నేఁ గోసి,నను బాప ముండ దో ♦ చెనటులార!
చెఱ మిమ్ము బంధించి ♦ కఱకుఁగత్తులతోడ, నఱికింపకుందునే ♦ దురితులార!
మీపట్టణము లెల్ల ♦ మాపటాలముతోడ, వచ్చి మాయింతు నో ♦ ద్రిమ్మరులార!

గీ. అవనిఁ గోమటిపు రొక్క♦టైన లేని
పగిది నాబాలగోపాల♦ముగను జెండి
చెలఁగి కసిఁదీర మీనెత్తు♦రులను ద్రావ
కుండినఁ నేను ధారుణీ♦శుండఁ గాను.

సీ. కపటాత్ముఁ డగు సెట్టి ♦ కాలుసేతులు గట్టి, నెట్టి బంధనమందుఁ ♦ బెట్టికొట్టి
పెన్గొండయం దుండు ♦ విపణిదండుం జెండి, చండాగ్ని నా వీడు ♦ మండఁ బెట్టి
వన్నెలాడిని చిన్ని♦పొన్నారులం దెన్నఁ, గన్నాకు నా కన్నె♦మిన్నఁ బట్టి
యొట్టైన నా సెట్టి ♦ పట్టంబులఁ మెట్టి, రట్టువెట్టియుఁ గొల్ల♦వెట్టి మట్టి

గీ. దండయాత్రను నిండింప ♦ దండు మెండు
సిద్ధముల్ గండు ధీవర♦శ్రేష్ఠులార!
అఖిలసైన్యాధినాథుల ♦ కాజ్ఞ నిండు!
లెండు నేటికిఁ గొల్వుఁ జా♦లించి పొండు!

గీ. అని వచించుచుఁ బ్రళయకా♦లాగ్నివోలెఁ
గోపమున మండిపడి లేచు ♦ భూపవరుని
గాంచి సచివులు మిత్రుల లా♦లించినారు
వృద్ధవణిజుని వెతలఁ ద♦ప్పించినారు.

ఉ. బెబ్బులిబారినిన్ గడచి ♦ వెళ్ళెడు భీతకురంగమట్లు త
బ్బిబ్బున రాయబారి పృథి♦వీపతిసన్నిధిఁ బాసి యెట్టులో
గొబ్బునఁ బోయి రేయి పెను♦గొండపురంబున నడ్గులాని తా
నుబ్బరవోయి కొంతతడ ♦ వుండియు నందఱఁ జేర్చి చప్పెనన్.

చ. గతజలసేతుబంధనము ♦ గా విలపించుట మేలుఁగాదు, భూ
పతిమనమున్ మఱల్చుటకు ♦ బమ్మకునైన వశంబు గాదు, ఏ
గతి నెది సంభవించఁగల కారణమున్నదొ కాకపోదు, ఆ
కత లిఁక నేల? ప్రస్తుతము♦గాఁగల దెద్దియొ చింతజేయుడీ!

శా. రేపో నేఁడో చమూసమేతుఁ డయి యా♦త్రేఁ డిందు విచ్చేసి మీ
మా పట్నంబులఁ గూల్చి వైశ్యకులనా♦మంబైన లేకుండ నా
టోపంబుల్ ప్రకటింపఁబూనె నిఁక నిం♦ట్లో స్వేచ్ఛఁ గూర్చుండి యా
క్షేపంబుల్ తలపోసిపోసి మదిలోఁ ♦ జింతింపరా దిప్పుడున్.

సీ. కన్య నాతని పాద♦కల్హారయుగళంబు,నందుఁ జేరిచి పొందు ♦ నందవలయు
లేకున్నచో వాని ♦ ప్రాకటక్రౌర్యశౌ,ర్యాగ్నిలోఁ జొచ్చి గె♦ల్వందవలయు
ఎది కర్జమో నిర్ణ♦యించి మీ యిలవేల్పు, రాణి కంజలిసేయఁ ♦ బూనవలయు
ఆత్మజాతను మీఱి ♦ లప్పించుటో లేక, చచ్చుటో యను ప్రజ్ఞ ♦ సలుపవలయు

గీ. కాయ మెన్నండు నిత్యంబు ♦ గా దటంచు
నిందితముగాని కీర్తి మ♦న్నించుకొనుటొ!
నీచమాయాశరీరంబు ♦ నిల్పుకొనుటొ
సరగ నికరంబుఁ దెల్పుఁడో ♦ సభ్యులార!

చ. అదియును గాక వైశ్యకుల ♦ మన్ననొ తొల్లిటినుండి ధాత్రిలో
విదితయశంబుఁ గొన్నది ప♦విత్రతఁ గన్నది నేఁడు మీరు బు
ద్బుదసమ దేహసౌఖ్యములఁ ♦ బొందుట కాసవహించి జాతికిన్
గుదు రగునట్లు మచ్చ నిడఁ♦గూడదు వ్రీడనుగూర్పఁ గీడగున్.

చ. కులమును మానమున్ నిలుపఁ♦గోరుచు నల్వురతోడఁ జచ్చుటల్
గలకలఁ జెల్లు పెండిలికి♦గాదె సమాన మటంద్రు పండితుల్
సిలుగులు సంభవించుటకె ♦ చేరెను జ్యేష్ఠభవాని నేఁడు మా
కులమున నంచు దూరకుఁడు! ♦ కోమలిమానసమున్ గ్రహింపుఁడీ!

శా. ఈ లోకంబును బాసి మీరు చనుచో ♦ నెవ్వేళనుం జూడ లో
కాలోకోత్తమసౌఖ్యజాలమును బ్రా♦కాశ్యంబుగాఁ జూతు రిం
కేలా సందియ మందనేర్తు రిహముల్ ♦ హేయంబుగా నెంచి యా
కైలాసాచలయాత్ర సల్పుటకు మీ♦కైకోలు చాటింపరే!

క. అని యిటు పల్కిన ముదుసలి
వణిజుని హితవాక్యసమితి ♦ వైశ్యులు వేడ్కన్
విని కొందఱు తల లూచిరి
మను జేశునివంక వారు ♦ మండినవారై.

చ. పెటపెట పండ్లు గీటి పృథి♦వీపతి కా యెలనాగమిన్న ని
చ్చుటకుఁ దలంపులేనియెడఁ ♦ జొచ్చిలుఁ డయ్య కృశానుకుండముల్
గటకట మేనఁ బ్రాణములు ♦ గల్గిన బిచ్చము నెత్తియైన నే
మెట నెట నైనన్ బ్రతుక♦నే! చతురాననువ్రాలు దప్పునే!

గీ. అనుచు నత్తఱి నచ్చోట ♦ నాఱునూట
పదియు రెండు గోత్రంబుల ♦ వైశ్యు లలుగఁ
బెద్దలందుఁ గొందఱు లేచి ♦ పెద్ద గొంతు
నఱచినా రిట్టు లొక్కింత ♦ వెఱపులేక.

సీ. అలుకఁజూపుట కిద్ది ♦ యదనుగా దని చిత్తములఁ నెంచుఁడీ! వైశ్యకులజులార!
మానినీమణి తేని♦మాటన్న పెడమొగం, బును బెట్టుచున్న దో ♦ పుణ్యులార!
రజతాద్రివయనంబు ♦ రక్తి సాగింపంగ, నున్నచో రం డిదే ♦ యన్నలార!
పందలు వేల్ వైశ్య♦బృందంబు లగ్నిలోఁ, జొచ్చుట శ్రేయంబు ♦ సుగుణులార!
గీ. దుర్మతులకును విజ్ఞాన♦దూరులకును
గౌరవక్షీణులకును దు♦ష్కర్ములకును
దరుణ మిదిగాదు వహ్నిలో ♦ నుఱుకలేని
పందలెల్లరు నిచ్చోటఁ ♦ బాసి పొండు.

గీ. ఆగ్రహావేశమున నంత ♦ నాఱునూట
పదియు రెండు గోత్రంబుల♦వారు లేచి
సతులతోడను బంధుసం♦తతులతోడఁ
బురిని విడనాడి నల్గడల్ ♦ పోయినారు.

క. పురవీథివార లరుగుట
లరసి కుసుమసెట్టి వైశ్య♦లందఱితోడన్
అరసిరె! వా రటు లేగుట
కరము విచారంబు నాకుఁ ♦ గల్గించె ననన్.

చ. అనఁగ గుణోత్తముండు కుసు♦మార్యునితోడను బల్కె నీవిధిన్
మనమున నాకు సంతసము, ♦ మాట లిఁకేటికిఁ బోవనిమ్ము; మీ
కును మఱి వారి కెయ్యెడలఁ ♦ గూడదు స్నేహము, తప్పుత్రోవలన్
జనుదురు మాంసభక్షు లయి ♦ సర్వకులంబులయందుఁ బందలై.

గీ. ఇది మదీయశాపంబు నీ ♦ వింక నేగి
ఏతదగ్నిప్రవేశంబు ♦ నెల్లయెడల
నగరమందునఁ జాటించి ♦ నరవిభులను
జుట్టు కాపుంచి యత్నముల్ ♦ చూడు మఱియు.

క. చని యీ యుద్యమవార్తను
మన కన్యామణికిఁ దెల్పి ♦ మఱ్ఱవతోడన్
గొను మాయమయుద్దేశ్యము
నని యాతని బంపి, యనిపె ♦ నర్యుల నెల్లన్.

సీ. గురువరేణ్యుల యాజ్ఞఁ♦గొని కుసుమార్యుండు, జ్వాలనవార్తలఁ బురిన్ ♦ జాటనంపి
భటముఖ్యులను వైశ్య♦వరకుమారుల నూరు, కడల భద్రంబుగాఁ ♦ గాపువెట్టి
కనకసౌధముఁ జొచ్చి ♦ వనితామణులమధ్యఁ, గూర్చుండు గారాబు♦కూతుఁ గాంచి
సైరింప రానంత ♦ సంతాప ముప్పొంగఁ,గా నద్ది యెట్టులో ♦ లో నడంచి

గీ. మోదమున లేచి తనపాద♦ములకు మ్రొక్క
ముద్దుకొమరితచెక్కిళుల్ ♦ ముద్దులాడి
డంబుమీఱిన రత్నపీ♦ఠంబునందు
ఆత్మసంజాతతోఁ గూడ ♦ నధివసించి.

సీ. ప్ర.తి దురాంశసం♦భూతదివ్యజ్ఞాన, పారీణ యని గ్రహిం♦పంగ లేక
ాంతంబుఁ ♦ బూర్తిగా నెఱిఁగించెఁ, గొంకుజంకునుమాని♦కొఱతలేక
నకుండు ♦ వధియించు కథలెల్ల, విని మనంబున నింత ♦ విసువులేక
తండ్రి ! ♦ చిన్నికూఁతును సర్వ,మెఱుఁగు శర్వాణి యం♦చెఱుఁగలే
ని ముం దింక ♦ జరుగఁబోవు
లోకంబు♦లం గనంగ
మని దొక్క_ౖ♦నను పలుకి
యంచుఁ జిరునవ్వు♦నవ్వె కన్య.

సీ. నాపైని ధారుణీ♦నాథుఁడు నిల్పిన, మోహవృత్తాంతం బ♦మోఘ మనుచు
నీచాత్ముఁడగు రాజు ♦ నిత్యం బవశ్యంబు, మిమ్ముఁబెట్టు బాధ ల♦మితము లనుచు
ఆ మదాంధునికై మ♦హాభయంబున మీరు, చేయు యత్నంబు ల♦శేష మనుచు
మనవారు నాకుఁగా ♦ దినము సందేశుపాట్లు, కరము పశ్చాత్తాప♦కరము లనుచు

గీ. ధారుణీశుండు నేఁ డిందుఁ ♦ దఱలి వచ్చి
చేయఁగా రాని చెడుపనుల్ ♦ చేయఁదలఁచి
న్యాయ మింతైనలేకయు♦న్నాఁ డటంచు
నెఱుఁగుదును నేను; జింతిల్లె ♦ దేల తండ్రి !

సీ. భక్తశేఖరుఁడైన ♦ పతితపావనుఁడైన, కుసుమార్యుఁడే నాకుఁ ♦ గూర్మితండ్రి !
సాధ్వీమతల్లి వై♦శ్యకులకల్పకవల్లి, కుసుమాంబయే నాకుఁ ♦ గూర్మితల్లి !
భక్తి న న్నర్చించి ♦ వైశ్యాన్వయము నిల్పు, బాలబాలికలె నా♦వారు సుతులు !
నావెంట గుండంబు♦నకు మంటలోఁ జొచ్చు, వణిజవర్యులె నాకుఁ♦బరమహితులు!

గీ. ప్రమదమలరార జన్మజ♦న్మముల కైన
స్వాంతమున మిమ్ము మఱువంగఁ ♦ జాలనయ్య !
మోహదర్పంబునకు నన్ను ♦ ముట్టనున్న
పృథివినాథాధమున కింక ♦ వెఱవకయ్య !

గీ. అరయ సావిత్రి భక్తశే♦ఖరుఁడ వీవు
సత్యమతి వగు నీకు నే ♦ జననమంది
నేను గూడఁ దరించితి ♦ నేఁటి కింకఁ
జనుద మెల్లర మల్ల వి♦శ్వమయుఁ గనఁగ.

సీ. మాటిమాటికి మీరు ♦ మానసంబున రాజు, క్రౌర్యంబుఁ దలఁపోయ♦రాదుజనక!
అతిరయంబుగ భాస్క♦రాచార్యవచనాను, సరణి వైశ్యులతోడ ♦ జరుగుతండ్రి !
పరమపావనుఁడైన ♦ వైశ్వానరునియందు, నైక్యంబగుట శ్రేష్ఠ ♦ మార్యవర్య !
సాధుల కాతండు ♦ చల్లనివాఁ డెంతో, కృప వెదజల్లువాఁ♦డే మహాత్మ !

గీ. పావకద్వారమును జొచ్చి ♦ భాసమాన
దివ్యమణిదీప్తులం గ్రాలు ♦ భవ్య భర్మ
సౌధరాజికిఁ బయనంబు ♦ సాగ నిండు
ఇంక నూరక యాలస్య ♦ మెందు కయ్య !

ఉ. ధర్మ మధర్మముం దెలియు ♦ తద్జ్ఞులు భూతదయా సమేతులున్
నిర్మలమానసుల్ విపుల ♦ నీతిపథాఢ్యులు నిత్యసత్యస
త్కర్మపరుల్ గుణాకరులు ♦ గాఢయశస్కులు చెప్ప నేటికిన్
ధర్మజువంటివారు కుల♦ధన్యులు సర్వము మీకు వేద్యమా !

గీ. చెప్పినాఁడవు చెప్పక ♦ తప్ప దనుచు
నంతియే గాని నాచిత్త ♦ మంత మునుపె
యెట్టిదో యెంచి యత్నంబు♦లెల్లఁ జేసి
యుండినాఁడవు నిర్జరాం♦శుండ వీవు.

చ. అల విబుధాంశసంభవుఁడ ♦ వందుల కే దెది సందియంబు నా
వలన గ్రహింపఁగావలయు♦వార్త లొకించుక నున్న వవ్వి నేఁ
దెలిపెద నర్యపుత్రికలు ♦ ధీరవరుల్ వినునట్లు నేఁడె యా
జ్వాలనుని మ్రోలఁ దండ్రి! ద్విజ♦వంశమణీ! యవి దేవమర్మముల్.

గీ. వాసవాంబను మేదినీ♦వరుని కిడక
అనలముం జొచ్చు ప్రతినఁ గై♦కొనిన వైశ్య
ముఖ్యులార! సాగుఁడు గుండ♦ములను జేర!
నంచు జాంఘికుఁ డొకఁడు చా♦టించుచుండె.

చ. అది విని వాసవాంబ వద♦నాబ్జమునన్ దరహాసమొప్ప స
మ్మదమునఁ దండ్రితో నసియెఁ ♦ బూజ్యులు వైశ్యవతంసు లీవునున్
సదమలదివ్యదృష్టిగల ♦ సచ్చరితుల్ మహాదీయచిత్తులున్
గద! జనకా! సమస్తమగు ♦ కార్యము లాయితమున్ బొనర్చవే!

ఉ. చెచ్చెర నీవుఁ బోయి యట ♦ సిద్ధముఁ జేయుము కార్యమెల్ల నే
నచ్చటి కేగుదెంచెద మ♦హానటదివ్యపదార్చనావిధిన్
నిచ్చలు నిచ్చతోడ మతి♦నిన్ స్తుతియించెదు నాత్మసంఘమున్
సచ్చరితా! వెసన్ బిలుము ♦ సర్వము దైవ మొనర్చు హా మ్మిఁకన్.

క. అని ధైర్యంబునఁ బలికిన
తనయావాక్యంబు లెల్లఁ ♦ దద్దయు వినియున్
జనియెన్ గుసుమార్యుఁడు నె
మ్మనమున సంకోచములను ♦ మానినవాఁడై.

చ. భువిఁ బెనుగొండలోఁ గలుగు ♦ పూజ్యులు వైశ్యులు వాసవాంబతోఁ
దవిలి మహాగ్నికుండముల ♦ దాఁటెడువార్తను లోకమంతటన్
బ్రవిమలమొప్పఁ జాటఁగల ♦ వాంఛను దెల్పుచు నుండెనో యనన్
సవితృఁడు పశ్చిమాద్రిపయిఁ ♦ జక్కఁగ మక్కువ నెక్కెఁ గ్రక్కునన్.

సీ. ఆర్యు లెల్లగును సా♦యంకాలమునఁ జేయ, వలసిన నిత్యసం♦ధ్యల ముగించి
పరమాత్ము నత్యంత♦భక్తితో నర్చించి, నిష్కాములై శుద్ధ♦నీతి మించి
అలికోర దోర్భాగ♦ములయందు నందంబు, గా విభూతిని మెచ్చఁ♦గాను దీర్చి
రమణీయపుష్పరు♦ద్రాక్షమాలలు కంఠ,ముల వ్రేలునట్లు సొం♦పుగను దాల్చి
గీ. భర్గ! సర్వేశ! గిరిశ! మాం ♦ పాహియనుచుఁ
బ్రేమఁ గన్యకాపరమేశ్వ♦రీ మతల్లి
కావవే తల్లి! శ్రీ పణి♦క్కల్పవల్లి!
యని వచించుచుఁ జనినార ♦ లగ్గిదరికి.

గీ. మనకు మోక్షాద్రిఁ జూపించు ♦ మార్గదర్శి
ఘనుఁ డటంచును జారు సౌ♦గంధ సూన
చందనంబులఁ బూజలన్ ♦ సలిపి తృప్తి
పరచి రర్యులు ముదమున ♦ వాయుసఖుని.

క. ఆ విధిఁ బూజలఁ జేసియు
నా వైశ్యులు భక్తితన్మ♦యత్వముచేతన్
భావంబుల నిశ్చలముగ
దేవున్ నెలకొల్పి భజనఁ ♦ దీర్చెడువేళన్.

గీ. సకలవిధచారుమంగళ♦స్నానము లొప్ప
నడుమఁ దారలలోనఁ జం♦ద్రముని మాడ్కి
శోభిల్లెడు కన్య నత్యంత♦సుగుణధన్యఁ
గాంచినారలు వాసవాం♦గనను వారు.

గీ. సర్వభూషణాంబరములఁ ♦ జక్క దాల్చి
ప్రమద మలరార పసుపుఁ గుం♦కుమము నలఁదు
కన్యకలు గౌరబాలికా♦గణములెల్లఁ
బసిఁడితీఁగె లన నడచి ♦ వచ్చుచుండ.

గీ. పొన్ని తాంబాళములు హస్త♦ములను బూని
మంజుల జయారవంబుల ♦ మధుర దివ్య
గానములు సేయుచున్ వణి♦క్కాంతలెల్ల
వెంట రా వాసవాంబిక ♦ వెడలి వచ్చె.

సీ. మాణిక్యతాటంక♦మణికాంతు లొకవంక, మెఱమెచ్చుఁ దళతళ ♦ మెఱయుచుండ
అభ్యంజనంబుఁ గొ♦న్నందున భ్రమరకం,బులునిండు నెలమోముఁ♦బూడ్చుచుండ
పసుపుఁబచ్చనినిగ్గు ♦ పచరించు జరిపట్టు, పుట్టంబు మైఛాయ ♦ నెట్టుచుండ
కమనీయ తపనీయ ♦ ఘనసార సుమహార,పాళి వక్షంబుపై ♦ ప్రేలుచుండ
గీ. శ్రావ్యతరమాధురీవాక్య♦చయముతోడ
రూఢి నొప్పారు దరహాస♦రుచులతోడ
చేరి వింజామరల్ వీచు ♦ చెలులతోడ
వచ్చె గుండంబుదరికి శ్రీ♦వాసవాంబ.

సీ. కొప్పుపై జేరాడు ♦ ఘనబలాహకవేణి, నింతిగుమ్మలు కొంద ♦ ఱత్తి నడుమ
ఇంపైన గీతంబు ♦ లే పారగా హార,తులఁ గామినులు గొంద ♦ ఱెలమి నీయ
రంగారు మొగముపైఁ♦గ్రమ్ము ముంగురుల నె,చ్చెలులుగొందఱు తీర్చి♦సేవఁజేయ
అడుగులు నేలపైఁ ♦ బడకుండ ముడుగువ,ల్వలఁ జేడియలు కొంద ♦ ఱిలను బఱవ

గీ. చారికలు కొందఱు చలి ప♦న్నీరుఁ జల్లఁ
జెలులతో నందనోద్యాన♦సీమఁ జేరు
నల శచీదేవిగా వచ్చె ♦ నగ్గిదరికి
భాసద్గుణనికురంబ ♦ వాసవాంబ.

గీ. అట్లుఖండవైభవమున ♦ నరుగుదెంచు
నతివ మిన్నను (శ్రీ) వాస♦వాంబ నరసి
అచట నాబాలగోపాల ♦ మాత్మ నిలిపి
భక్తిఁ గీర్తనల్ పాడి సం♦బరము వడిరి.

గీ. వైశ్యు లెల్లరు నానంద♦వార్ధి మునిఁగి
జయజయారావముల స్తోత్ర♦శబ్దములను
మంగళనినాదములఁ జేసి ♦ పొంగుచుండ
వాసవాంబ వారలఁ గాంచి ♦ పలికె నిటుల

మ. అరిషడ్వర్గములన్ జయించి భువిలో ♦ నత్యంతవిఖ్యాతి నె
ల్గిరి మీరల్ గడు ధన్యమానసులు కా♦ళీశర్వు లానందమున్
గరమున్ బొందిరి మీతపంబులకు దు♦ష్కర్ముండు దస్యుండు నా
ధరణీకాంతుఁడు మిమ్ముఁ జేరఁగలఁడా ♦ ధైర్యంబుగా నుండుఁడీ!

గీ. చిత్రసేనాఖ్యుఁ డనెడు దు♦శ్శీలుఁ డొండు
దనరుఁ గైలాసగిరిని గం♦ధర్వభవుఁడు
మనకులంబందు జన్మించి ♦ మహిమఁ గాంచి
సుందరీమణి దేవకిన్ ♦ జెందఁగోరి.

ఉ. కోరికలన్ వచింపుఁ డని ♦ కోరినఁగోరెను ద్యానివాసమున్
ధారుణీవల్లభుండు మఱి ♦ నందనవై జనియింపు మమ్మ! నా
కో రమణీ! యుమా! యనుచు ♦ నుత్సవమున్ మదిఁగోల్వఁజేసె న
ట్లే రహియించు నంచనియు ♦ నీశ్వరి తా నిజవాసమున్ జనెన్.

గీ. పరగు నా నీచుఁడే విష్ణు♦వర్ధనుండు
మును సురథుఁ డను నా రాజు ♦ ఘనయశుండు
వైశ్యుఁడు సమాధిగాన నీ♦శ్వరునిగూర్చి
తపమొనర్చిన దుర్గ ప్ర♦త్యక్షమయ్యె.

గీ. ఆ సమాధియె యిటఁ గుసు♦మార్యుఁ డయ్యె
నంబికాదేవియే వాస♦వాంబ యయ్యె
పరమపుణ్యాత్ములో మీరు ♦ వణిజులార !
యేమి చెప్పుదు నని వారి ♦ హెచ్చరించి.

సీ. నవ్యభాస్కరరుచుల్ ♦ నలుదెసల్ వెదఁజల్లు, నవరత్నమకుట ర♦త్నంబుతోడ
వింటిచందము ఫాల ♦ మంటి గ్రాలెడు మూఁడు, సిందూరరేకల ♦ చెలువుతో
శుభ్రకాంతుల నీను ♦ శుభదాంగములఁ గల్గి, హారువైన నందివా♦హనముతో
రోదసీకుహరంబు ♦ మేదురాభావంబు, గా నుండు సద్దివ్య♦కాంతితోడ

గీ. వృజినములఁ బాపు చల్లని ♦ వృష్టితోడ
కౌముదీదరహాసము♦ఖంబుతోడ.
నిత్యకల్యాణి ! రుద్రాణి ! ♦ నీలవేణి !
సరగ సాక్షాత్కరించె నా ♦ శర్వరాణి.

గీ. శుభరవంబుల దేవదుం♦దుభులు మ్రోఁగె
నిర్జరుల్ సూనవర్షముల్ ♦ నింపినారు
విశులు గాఢభక్తిన్ బర♦వశులు నైరి
నిలచినారలు విగ్రహం♦బుల విధముగ.

గీ. అంతటఁ భయోత్సాహంబు ♦ లావరింప
వణిజులెల్లరు మిగుల సం♦భ్రమము నొంది
అంబికాదివ్యకాంతుల ♦ నరయ లేక
లోకముఁ మాని చేతులఁ ♦ బైకి నెత్తి.

సీ. నీ దివ్యరూపంబు ♦ నో దేవి, మీనాక్షి, కాంచి యుంటిమి మేము ♦ కల్పవల్లి !
మేము నోఁచిన నోము♦లో మహేశ్వరురాణి ! ఫలియించెఁ ద్వత్కృపా♦భాగ్యమంబ!
సురలైన సన్మౌని♦వరులైన రుద్రాణి ! నీకాంతిఁ గనలేరు ♦ లోకమాత !
మము దయారసముతో ♦ మన్నించు మార్యాణి! కన్నెవేసముఁ దాల్చి♦కనకదుర్గ!

గీ. అద్రిజా ! మమ్ము నీవెంట ♦ నాదరించి
వీతిహోత్రింబుమార్గంబు ♦ వెడలఁ జేసి
వేగ రానిమ్ము మమ్ముల ♦ వెంటనంటి
భాసద్గుణనికురుంబ ! ♦ వాసవాంబ !

క. అని వేడి, కనులఁ జూచినఁ
గనినారలు పూర్వకన్య♦కారూపంబుఁ
మనమున సంతసమందిరి
కొనియాడిరి వాసవాంబ♦కుఁ నుతు లిడుచున్.

క. అటు తొల్లిఁటిరూపంబును
గుటిలాలక దాల్చి వైశ్య♦కోటిని గనియెన్
బటుతరసంతోషంబున
నిటు లుపదేశంబు మఱల ♦ నిచ్చెను బ్రీతిన్.

ఉ. కంటకుఁడై మహీధవుఁడు ♦ గాఱియవెట్టెను మిమ్ము నిట్టు లా
తుంటరి నేను గుండమున♦దూకిన తక్షణమే శిరంబు వల్
తుంటలునై గతించెడు న♦ధోగతిఁ బోయెడుఁగాక! లేక మి
మ్మంటఁగలాఁడె యింక సుగు♦ణాకరులార ! భయంబు మానుఁ డీ !

క. అని యిట్టుల శాసించియు
వనితామణి వల్కె వైశ్యబాలురతోడన్
గనికర ముదయించెను నా
మనమున మిముఁ గనినకొలఁది మాటల్ వినుఁడీ !

ఉ. పెద్దలతోడ నగ్గిఁబడు వేగిరపాటున నున్నవారు మీ
సుద్దులు నే నెఱుఁగుదుటఁ జొచ్చుట న్యాయము గాదు చూడుఁడీ !
వద్దు కుమారులార మన వంశము వర్ధిలఁజేసి మీర లే
ప్రొద్దు సుఖంబు లంది యశముల్ జిరజీవులరై గడింపుఁడీ !

చ అమలమునైన వైశ్యకుల మంతమునందునుగాదె ! మీర లీ
సమయమునందుఁ బ్రాణములు సాహసులై యెడఁబాసిరేని లో
కములను నేలు దేవుఁ డదె కాంచుఁ డనుజ్ఞను జేసె మీకు గుం
డము విడి వేగపొందు తదనంతర మేగుఁడు మోక్షభూమికిన్.

సీ. వైశ్యకులాధిదేవత యగు నగరేశ్వ, రస్వామిఁ గొలువుఁడీ ! రంజితముగ
ధనధాన్యరత్నభూషణముల సత్కులా, చార్యుని గొలువుఁడీ ! సంతసముగ
వింధ్యవాసిని యన వెలయు కాత్యాయినీ, దేవిని గొలువుఁడీ ! పావనముగ
మాతులధర్మక్రమమును దప్పింపక, పెద్దలఁ గొలువుఁడీ ప్రియముగాఁగ

గీ. బాల్యమున విద్య నార్జించి ప్రాయమందు
సంచితసుఖంబుల ననుభవించి పాప
కర్మములఁ గూటసాక్ష్యముల్ గారవించ
కుండ నుండుఁడీ సతము నుద్దండమహిమ.

సీ. స్వప్నంబులందైనఁ బరకామినీకాంక్షఁ, బరధనాపేక్షలన్ వదులుఁడయ్య !
కష్టంబులన్ ద్రోచి నష్టంబులకు నోర్చి, కులధర్మమును నిల్పఁదలఁచుఁడయ్య
అఖిలాంశముల భాస్కరాచార్యవచనాళిఁ, జిత్తగించియుఁ బూజసేయుఁడయ్య
సర్వజీవులపట్ల సానుభూతిని జూపి, గోబ్రాహ్మణులమేలుఁ గోరుఁడయ్య.

గీ. భువిని నవహాసమున కైన ♦ బొంకకుండ
క్షామకంటకభీతులు ♦ గానకుండ
దేవతాభక్తియుం దెప్డు ♦ తేజరిల్లి
దివ్యయశమొంది చిరము వ♦ర్ధిల్లుఁడయ్య.

సీ. నగరేశ్వరుని పాద♦యుగళంబునన్ భక్తి, భవ్య జనార్దన♦స్వామిసేవ
వేదశ్రవణశక్తి ♦ విమలోపనయనంబు, పంచసంఖ్యాది సం♦భవప్రతిష్ఠ
స్నానసంధ్యాద్యను♦ష్ఠానసద్వర్తన, గిరిపుత్రికాదివ్య♦చరణపూజ
కులదేవతాపూజ ♦ గోత్రతాంబూల దా,నము నిత్యబంధుజ♦న కుతుకంబు

గీ. మీర లెల్లప్పుడైనను ♦ మీరరాదు
శారదానవరాత్రుల ♦ సంతసముగ
నన్నుఁ బూజింపవలయు మీ ♦ రెన్నఁడైన
అట్లు తప్పినవారు నా ♦ కహితులౌను.

మత్త. నవ్యకీర్తిఁ గాంచెనా స♦నాతనంపు ధర్మ మో
భవ్యులార! దాని మీరు ♦ పాయకన్ బొనర్చుడీ!
అవ్యయంబునై వికాస♦మందు దీనిముందు మాం
డవ్యమౌని వర్య శాస♦నం బటం చెఱుంగుఁడీ!

ఉ. వారిజనేత్రి ధర్మములు ♦ వారి కనేకముఁ దెల్పుచుండఁగాఁ
జారులు విష్ణువర్ధనుఁడు ♦ సైన్యసమేతముగా నదేపురిన్
గ్రూరముగాఁగఁ జొచ్చె నని ♦ ఘోషలు నెట్టఁగ వైశ్యులెల్లరున్
దీరని ధైర్యమున్ వనట ♦ నిండుకొనన్ గడు యోచనంబునన్.

ఉ. వీరుల ధీరులన్ నిలిపి ♦ వేగమె కార్యము నిర్ణయించఁగా
వారల త్రోటుపా టుడిపి ♦ వాసవకన్యక హస్తసంజ్ఞలన్
జేరుచుఁ గుండసన్నికట♦సీమకుఁ జేరి వినిశ్చలాత్మయై
చారుకరాబ్జయుగ్మమును ♦ జక్క మొగిడ్చి నిమీలితాక్షియై.

సీ. కైలాసగిరినుండి ♦ కాంతుండు నిన్నంపఁగా వచ్చినావె! గొం♦పోవ నన్ను
తండ్రి! వైశ్వానరా! ♦ దైవంబ! దిక్పాల,రత్నమా! గొనుము భ♦ద్రముగనన్ను
పావనాకార! శ్రీ♦పావకా! కృపఁజూడ, నీలకంఠుని చెంత ♦ నిలుపు నన్ను
ఆశ్రయాశా! రోహి♦తాశ్వ! యశంబు నార్జించు నాథునితోడఁ♦జేర్చునన్ను
గీ. అనుచు శర్వాణి రుద్రాణి ♦ యా భవాని
నీలకంధరురాణి వి♦నీలవేణి
సైకతశ్రోణి కల్యాణి సరసపాణి
కానరాదాయె నగ్గిగుం♦డాన దూకి.

సీ. ఒకరి నొక్కరుఁ జూడ ♦ కొక్కమారుగ దూకి, నా రర్య లగ్నిగుం♦డంబులందు
వారల సహధర్మ♦చారిణుల్ వెన్నంటి, అగ్నిహోత్రుని లీన♦మైరి భక్తి
కన్నీరు మున్నీరు♦గా వేనవేల్జనములు దుఃఖవారాశి ♦ మునిఁగిపోయె
హే వాసవీకన్య♦కావల్లి! వదలితే, కూర్మి దేహం బగ్ని♦కుండమందు
గీ. అనుచు హాహారవంబుల ♦ నార్చుకొనుచు
నెంత యత్నించినన్ దుఃఖ ♦ మింతయేని
యుపశమింపక పెంపొందు♦చుండ జనము
లట్లె నిర్విణ్ణులై చేష్ట ♦ లడఁగియుండె.

శా. అయ్యో! యేమి విచిత్ర మిద్ది కలయో ♦ ఆహా! మహామాయయో!
నెయ్యంబున్ గనిపించు దృశ్యమొకో! లే♦నీపోని వైకల్యమో!
కుయ్యో! మొఱ్ఱోయటంచు నా జనములున్ ♦ ఘోషల్ విజృంభించుచున్
చయ్యన్ మూర్ఛలఁ జిత్తవిభ్రమములన్ ♦ స్వాతంబులన్ దప్పియున్.

గీ. చిత్రమున వ్రాసియుంచిన ♦ చిత్రము లన
శిల్పి నిర్మించి యుంచిన ♦ శిల్పము లన
ఆ మహాసభ రావంబు ♦ లన్ని మాని
నంతనా చెంత సన్న్యాయా♦చార్యు లరసి.

గీ. వందలాదిగ నా బాల♦బాలికలును
తల్లిదండ్రులఁ గానక ♦ తల్లడిల్లి
గోడుగోడునఁజేరి య♦ల్లాడుచుండ
వేదికను నెక్కి యోదార్చి ♦ పిలిచి పలికె.

ఉ. ఎందుల కింత మానసము ♦ హెచ్చుగ దుఃఖమునన్ దపించుచున్
గుందుట తల్లిదండ్రు లరు♦గో! యటఁజేరిరి మోక్షసౌధమున్
అందఱమున్ యథాస్థితిగ ♦ నాత్మశరీరము వీడకుందుమే!
ముందుగఁ గార్యమున్ మగిడి ♦ పూన్కొనరయ్య! యఖండశక్తితో.

గీ. అని వచించెడు సమయంబు♦నందు విష్ణు
వర్ధనుని సైన్యజాలముల్ ♦ వచ్చి పురము
చుట్టి ప్రక్కన సౌధాలఁ ♦ జొచ్చి పట్టు
కొట్టు డంచు తీవ్రాన గ♦గ్గోలుపరుప.

గీ. వాసవీ కాంతకై విష్ణు♦వర్ధనుండు
పట్టణంబునఁ గాపుంచి♦నట్టి సైన్య
జాలముల్ భక్తిచే నాత్మ♦శక్తిచేత
బాలనగరులలోపలన్ ♦ బాల్గొనంగ.

గీ. విప్లవమువచ్చెనో యన్న ♦ భీతి గలిగె
విష్ణువర్ధను సైన్యాలు ♦ వేగిరంబ
చెదరిపోయెను గొందఱు ♦ బెదరిపోయె
అల్లకల్లోలముగ నాయె ♦ నా పురంబు.

గీ. విష్ణువర్ధన భూపాలు ♦ ప్రీతిపుత్త్రుఁ
డైన రాజనరేంద్రుండు ♦ నాతురతగ
జనములన్ ద్రోచికొని వచ్చి ♦ సాఁగి మ్రొక్కె
ఆ విరూపాక్షపాదంబు♦లందుఁ గ్రింద.

చ. వినుము నరేంద్ర! వాసవికిఁ ♦ బ్రేమ యొకింతయు లేకయున్న, మీ
జనకుఁడు విష్ణువర్ధనుఁడు ♦ సారెకు మోహము నంత దక్క, యా
మెను మదిఁగోరి భీకరము ♦ మీఱఁగ మూర్ఖము వేయి వ్రయ్యలై
చన మరణంబు నొందెఁగద! ♦ సాధ్వులఁగోరఁగఁజెల్లునే ధరన్.

మ. తనపాపంబున వాసవీసతిని జేఁ♦దాల్పన్ మదిన్ విష్ణువ
ర్ధన భూచంద్రుఁడు గోరి భీకరముగాఁ ♦ దా నీల్గె వైశ్యవ్రజం
బును గర్మానుభవంబుచేత మడిసెన్ ♦ భూరిచ్ఛటాభూతవ
హ్నిని గుప్పించి విధాత మీఱఁగలఁడే ♦ యేర్పడ్డ కర్మంబులన్.

గీ. వ్యక్తిగతమైన శత్రుత్వ ♦ మాత్మలందు
నెవ్వరికి లేదు మాలోన ♦ నింత యైన
మనసునను జింత నీ వింక ♦ మానుమయ్య!
ఈ యఖండసామ్రాజ్యంబు ♦ నేలుమయ్య!

గీ. హస్తముల నెత్తియున్ విరూ♦పాక్షుఁ డచట
పలుకుచుండంగ వీరేశ♦వరుఁడు లేచి
చిన్ని రాజేంద్రుఁ జూచి, యా♦శీర్వదించి
అనియె నిట్టుల ననురాగ♦మున మునింగి.

గీ. ఇంకఁ జాళుక్యసామ్రాజ్య ♦ మేలు మోయి!
సర్వభూమండలంబెల్ల జయముఁ♦గనుము!
ధర్మమును సత్యమును నీవు ♦ దప్పకోయి!
భారముగఁ దోఁచియున్న, స్వ♦ప్నంబునైన.

గీ. ఇటు వచింపంగ రాజరా♦జేంద్రుఁ డధిక
భక్తితో మ్రొక్కి యా విరూ♦పాక్షునకును
ఆత్మహస్తాల మకుటుంబు ♦ నమరఁజేసి
యిచట సామంతసామ్రాజ్య ♦ మిత్తు ననఁగ.

గీ. పితరులకుఁ దర్పణంబులఁ ♦ బిండములను
భక్తి వదలియు గంగలో ♦ శక్తికొలఁది
తిరిగి వచ్చిన పిమ్మటఁ ♦ దెలుపుకొందు
మంచు వచియించి పయనంబు♦లైరి వేగ.

సీ. భాస్కరాచార్యుండు ♦ పనిచినట్టుల పుణ్య,కార్యంబుల నొనర్చి ♦ కథల వినుచు
రవి కాంతిని మకర♦రాశికిఁ జను దేర, గంగాయమునల సు♦సంగమమున
స్నానంబులఁ జేసి ♦ స్వర్ణదానాదుల, విప్రతతికి భక్తి ♦ వెలయ నొసఁగి
అట నొక్క మాసంబు ♦ దిటవుగా వసియించి, శివరాత్రి గలుగఁ గా♦శికిని నేగి
గీ. పరమమైన నా రాత్రి జా♦గరణఁ జేసి
తరలి గయఁ జేరి పితృదేవ♦తలకు నెల్ల
పిండదానంబులను నిచ్చి ♦ ప్రీతితోడ
మించి వైశ్యాన్వయులు వసి♦యించి మఱియు.

గీ. అమలగంగానదీస్నాన ♦ మాచరించి
భక్తిపూరితహృదయాల ♦ వాసవాంబ
నిలిపి కన్నుల స్రవియించు ♦ జలకణములఁ
దర్పణం బిచ్చి యంజలుల్ ♦ దనరఁ జేయ.

గీ. అంబికాదివ్య కాంతి పుం♦జంబుతోడ
తిరిగి సాక్షాత్కరించె నా♦పరమసాధ్వి
భౌతికశరీరముల మాని ♦ భక్తితోడ
హస్తముల నెత్తి స్తుతియించి ♦ రానుపూర్వి.

సీ. పితృదేవతలు నేను ♦ బిండదానాదుల, సంతసించితిమి ని♦శ్చింతఁబొంది
కామ లోభ క్రోధ ♦ ఘన మోహములఁ జిక్కి, యలరు వైశ్యుల జేర♦వలదు।
మామకపూజాస♦మయముల వేదసం,వేదుని కులగురు ♦ వీడరాదు
కులవృద్ధి మదిఁగోరి ♦ కూర్మి బాంధవ్యంబు, చేయవలయు మంచి♦చెడ్డ లరసి

గీ. అట్టివారు ప్రసిద్ధంబు ♦ లౌచు వెలయు
పదియు చిహ్నలతోఁ గూడి ♦ వరలు నట్టి
శ్రేష్ఠమునులతో నిర్ణయ♦సిద్ధిఁ బొంది
భవ్యచరితులై యుండంగ ♦ వలయుఁ జుండి.

క. అని పల్కుచు నా వాసవి
చనియెన్ గనువిప్పినంత ♦ సమయములోనన్
మనముల్ హర్షము లందగఁ
జనినా రా యార్యవైశ్య♦సందోహంబుల్

ఉ. రాజనరేంద్రుఁడున్ సచివ ♦ రాజులు పౌరులు సైన్యజాలముల్
తేజములేక భక్తిమెయిఁ ♦ ద్రిండియు మానియు మట్టి నీడలన్
రోజులఁ బుచ్చుచున్ వణిజ♦నూతనసంఘము వేచియుండినన్
ఓ జననీ! యశేషసుగు♦ణోజ్జ్వలరూపిణి యంచు నుండఁగా.

గీ. భక్తునకుఁ గానఁబడు భగ♦వంతుఁ డట్లు
కాచుకొనియున్న కాంతకుఁ ♦ గాంతుఁ డట్లు
అందఱును లేచి యానంద♦మందుచుండి
కనఁగ నేతెంచె వైశ్యసం♦ఘంబు లన్ని.

గీ. ఇచ్చతో నుండు రాజన♦రేంద్రవరుఁడు
లేచి యందఱినుం గాంచి ♦ సాచి కరము
లో మహామహులార! మీ ♦ యున్నతములఁ
జాటఁగోరిన నా చిన్ని♦మాట వినుఁడు!

మ. జరుపన్ గోరి పితౄణభారము కృపన్ ♦ శ్రాద్ధాది కృత్యంబులన్
ధరణిన్ భాస్కరధీరుమూలమున సం♦స్థాపించి మోక్షప్రదం
బరయన్‌జాలిరి మీరు, మాకును ముదం♦బాయెన్ విరూపాక్షు స
త్వరమే రాజుగఁజేతు నేఁ జరుపుచున్ ♦ బట్టాభిషేకంబులన్.

గీ. చెప్పుచుండంగఁ బట్టాభి♦షేకమునకుఁ
జాట నంపించినార ల♦చ్చటికి సర్వ
దేశదేశంబులందుండి ♦ దీప్తి మెఱయ
వచ్చి నిండిరి రాజులు ♦ ప్రజలు ద్విజులు.

సీ. భాస్కరాచార్యుని ♦ ఫలయుతాశీస్సుల, నఘమర్షణస్నాన ♦ మాచరించి
జిగిజిగి యనెడు మే ♦ ల్జిలుగుపలువఁ గట్టి, ధర్మయజ్ఞోపవీ♦తంబుఁ దాల్చి
నవరత్నమయభూష♦ణముల మైఁ దాలిచి, చక్కఁ గస్తూరిచే♦ప్పుక్కఁ బెట్టి
మొలక జిలుగు నీల♦ముల ముద్దుగారెడి, చికిలి మీసముల సా♦రెకును దిడిపి

గీ. నవ్యపట్టాభిషేకమం♦డపమునందు
మన విరూపాక్షువర్యుండు ♦ దనరియుండ
ఆర్యవైశ్యమహారాజ♦శౌర్యమునకుఁ
జుహ్నా మీ దృశ్య మని ప్రజల్ ♦ చెప్పుకొనిరి.

గీ. జయజయ ధ్వానముల సర్వ♦జనులు పొగడ
రాజరాజనరేంద్ర భూ♦రమణుఁ డంత
దివ్యనవరత్నమకుటంబుఁ ♦ దీర్చి యుంచె
హస్తముల నా విరూపాక్షు♦మస్తకమున.

సీ దక్షిణదిశయందు ♦ నక్షయసౌఖ్యముల్, గలుగుఁగాక యని భా♦స్కరుఁడు
రాజరాజనరేంద్ర♦రాజు దాపల నిల్చి, వింజామరంబుల ♦ వీచుచుండ
ఘనభక్తితోఁ బాద♦కమలయుగ్మముఁ బట్టి, దడయక విడువక ♦ ధన్వి నిలువ
పలుదేశములనుండి ♦ వచ్చిన భూపాల, వితతి యణకువతో ♦ వెంబడించ

గీ. పురవనితలు లాజలుచల్లి ♦ కరము మెఱయ
దివ్య సుందర వస్త్ర సం♦దీప్తమైన
భద్రగజము నెక్కుచు విరూ♦పాక్షుఁ డధిక
వైభవంబున నూరేగెఁ ♦ బట్టణమున.

మంగళమ్

# వీరకంకణములను ధరించి అగ్నికుండములకాహుతియైన ఆర్యవైశ్య దంపతులు

[ నూట యిబ్బందు గోత్రములు ]

| | సతి నామము | పతి నామము |
|---|---|---|
| 1 | అభిరామాంబ | రామచంద్రార్యులు |
| 2 | భ్రమరాంబ | బాలార్కశ్రేష్ఠి |
| 3 | రాజముఖి | రాజేంద్రగుప్త |
| 4 | రాజ్యలక్ష్మి | ద్రవిణరాజశ్రేష్ఠి |
| 5 | సమదర్శిని | సోమదుఁడు |
| 6 | కీర్తికాంత | ఉత్పలాచార్యులు |
| 7 | భీమాంబ | పృథివీశగుప్త |
| 8 | పుష్పాంబ | భువనాధిపశ్రేష్ఠి |
| 9 | చిత్రభాషిణి | చిత్రశుభగార్యులు |
| 10 | బాలామణి | బలదేవశ్రేష్ఠి |
| 11 | పల్లవాంబ | పాలాహ్వయశ్రేష్ఠి |
| 12 | రాగమంజరి | రాగాఖ్యశ్రేష్ఠి |
| *13 | నారీమణి | నాగాఖ్యశ్రేష్ఠి |
| 14 | ధనలక్ష్మి | ధనదగుప్త |
| 15 | రుక్మవతి | పావనశ్రేష్ఠి |
| 16 | చంద్రముఖి | పూతాత్మార్యులు |
| 17 | ధర్మాంబ | ఉత్తమాహ్వయశ్రేష్ఠి |
| 18 | అమృతభాషిణి | గౌతమశ్రేష్ఠి |
| 19 | పల్లవాంబ | మల్లాఖ్యశ్రేష్ఠి |
| 20 | విచక్షణాంగి | దక్షణాహ్వయశ్రేష్ఠి |
| 21 | చంద్రరేఖ | శృంగధామశ్రేష్ఠి |
| 22 | జాహ్నవి | జమదగ్నిగుప్త |
| 23 | కళావతి | చంద్రాఖ్యశ్రేష్ఠి |
| 24 | నీలాంబ | నందాఖ్యశ్రేష్ఠి |
| 25 | పల్లవపాణి | వల్లభశ్రేష్ఠి |
| 26 | అనుమిత | అనంతశ్రేష్ఠి |
| 27 | పోతమాంబ | భోగాఖ్యశ్రేష్ఠి |
| 28 | విమల | కపిలాచార్యులు |
| 29 | అభినవాంబ | అమలశ్రేష్ఠి |
| 30 | తారకావళి | వామనాచార్యులు |
| 31 | కనకాంగి | కుముదాఖ్యశ్రేష్ఠి |
| 32 | ఇందుముఖి | విద్యాఖ్యశ్రేష్ఠి |
| 33 | కమలావతి | గజసత్వశ్రేష్ఠి |
| 34 | చంచలాక్షి | పావనాఖ్యశ్రేష్ఠి |
| 35 | భ్రమరామణి | దంతునామాచార్యులు |
| 36 | మంజువాణి | సుందరాఖ్యశ్రేష్ఠి |
| 37 | అర్కమాంబ | మల్లాఖ్యశ్రేష్ఠి |
| 38 | కుందరదన | గోవిందగుప్త |
| 39 | అబ్జముఖి | జామదగ్నిశ్రేష్ఠి |
| 40 | కమలాక్షి | సమదాఖ్యశ్రేష్ఠి |
| 41 | ధరణీదేవి | కుమారశ్రేష్ఠి |
| 42 | హల్లకాంబ | పార్థివార్యులు |
| 43 | ధనలక్ష్మి | ధనంతగుప్త |
| 44 | లోలాంబ | లోకాహ్వయశ్రేష్ఠి |

* వీరు కాశ్యపస (గణపకుల) దంపతులు. ప్రప్రథమమున వీరకంకణముల ధరించి, అగ్నిగుండము నందుఁ బ్రవేశించినారు. ఈ దంపతులకు సంతానములేదు. అందువలననే ప్రకృతము గణపకులగోత్రము లేదు. ప్రతి కార్యారంభమునందును వైశ్యులు "లాభంగణపా" అనుచుందురు. ఒకటియను సంఖ్య నుచ్చరించరు.

| సతి నామము | పతి నామము | సతి నామము | పతి నామము |
|---|---|---|---|
| 45 కమలావతి | గౌరాఖ్యశ్రేష్ఠి | 74 భూమాంబ | బ్రహ్మార్యులు |
| 46 సౌదామిని | బంభరార్యులు | 75 విదురాంబ | మాధవార్యులు |
| 47 చంద్రకళ | చంద్రమౌళిశ్రేష్ఠి | 76 సోమప్రభ | సింహధ్వజశ్రేష్ఠి |
| 48 తనుమధ్య | ధృతసత్వశ్రేష్ఠి | 77 కంబుకంఠి | కపిలార్యులు |
| 49 సుదర్శిని | సౌదాఖ్యశ్రేష్ఠి | 78 వాసంతిక | అర్ధనారీశ్వరశ్రేష్ఠి |
| 50 సుబోధిని | సింహసేనార్యులు | 79 పిప్పలాంబ | నాగధ్వజశ్రేష్ఠి |
| 51 మోహిని | పవిత్రపాణిశ్రేష్ఠి | 80 మంజువాణి | గుణపుంజగుప్త |
| ♦ 52 కుసుమాంబ | కుసుంభశ్రేష్ఠి | 81 నీలవేణి | భానుగుప్త |
| 53 బాలామిని | జనార్దనశ్రేష్ఠి | 82 కృష్ణాంబ | నాగాహ్వయశ్రేష్ఠి |
| 54 దంతవతి | అమృతాఖ్యశ్రేష్ఠి | 83 పుష్పధామ | వేదాఖ్యగుప్త |
| 55 సమశీల | సకలాఖ్యశ్రేష్ఠి | 84 ప్రభావతి | పద్మనాభశ్రేష్ఠి |
| 56 చిత్రరేఖ | కుశలాహ్వయశ్రేష్ఠి | 85 నవనీతాంగి | విన్నాఖ్యశ్రేష్ఠి |
| 57 భామామణి | భాస్కరార్యులు | 86 విన్నమాంబ | విశ్వనాథశ్రేష్ఠి |
| 58 మణిమంజరి | ఆదిత్యగుప్త | 87 మేదాంబ | వీరభద్రార్యులు |
| 59 ధనవతి | ధర్మాఖ్యశ్రేష్ఠి | 88 గంగాభవాని | విద్యాధరశ్రేష్ఠి |
| 60 శ్యామలాంబ | కృష్ణశ్రేష్ఠి | 89 చిత్రాంగి | విన్నవరేణ్యగుప్త |
| 61 సరస్వతి | సరసశ్రేష్ఠి | 90 సుందరి | జీమూతశ్రేష్ఠి |
| 62 కాళీవతంస | కాలకంఠశ్రేష్ఠి | 91 రాజముఖి | రాజేశ్వరశ్రేష్ఠి |
| 63 హేమరేఖ | స్వర్ణరథశ్రేష్ఠి | 92 ఉత్పలాక్షి | పండితార్యులు |
| 64 మణిశలాక | కందర్పశ్రేష్ఠి | 93 పద్మగంధి | బాలభానుశ్రేష్ఠి |
| 65 మేదాంబ | మార్కండేయశ్రేష్ఠి | 94 సత్యవతి | సత్యసంధశ్రేష్ఠి |
| 66 పృథ్వీదేవి | పృథునామశ్రేష్ఠి | 95 చంద్రాంబ | జలవాఖ్యశ్రేష్ఠి |
| 67 ధనదాంబ | మూలార్యులు | 96 పావనీదేవి | చంద్రబాణశ్రేష్ఠి |
| 68 ప్రోల్లాసిని | పుణ్యరాశిగుప్త | 97 పద్మాక్షి | మేఘసేనగుప్త |
| 69 బింబాధరి | పీనవక్షార్యులు | 98 చపలాక్షి | సింహముఖశ్రేష్ఠి |
| 70 పల్లవాంబ | భోగాక్యశ్రేష్ఠి | 99 మణిమాల | ఘనముఖార్యులు |
| 71 హేమాంగి | మత్స్యధ్వజార్యులు | 100 దావని | నిర్జలసేనగుప్త |
| 72 దేవాంబ | భోగాఖ్యశ్రేష్ఠి | 101 లీలావతి | జనార్దనగుప్త |
| 73 ఇభయాన | నాగాహ్వయశ్రేష్ఠి | 102 కుముదవల్లి | సుదర్శనశ్రేష్ఠి. |

♦ శ్రీ వాసవీకన్యకాపరమేశ్వరి తల్లిదండ్రులు.

# వివాహ విధులు

1. క్రిందవివరించిన నియమములకు ఋషిగోత్రముల నుపయోగించవలసియున్నది. సాంకేతిక గోత్రానుసార మేకార్యమును నిర్ణయించరాదు.

ఉదా:- ప్రాభాతస = ఇది ఋషిగోత్రము. పెండ్లికుల = ఇది సాంకేతికగోత్రము.

మైత్రేయస = ఇది ఋషిగోత్రము. మిథునకుల = ఇదిసాంకేతికగోత్రము.

2. వీలున్నంతవఱకు మేనఱికము తప్పించి పరిణయముచేయరాదు. కాని, వయస్సు, ఆకారము, ఆరోగ్యము, ఆయుర్దాయము, అందము, ప్రవర్తన, గుణము, విద్య, కుటుంబగౌరవము, స్థితి—వీనిలో నెట్టి విశేషభేదము కనిపించినను, వటువు తండ్రిగాని, కన్యక తండ్రిగాని మేనఱికమును తప్పించి పరిణయము చేయవచ్చును. [ఇందుకుఁ బ్రమాణము, కన్యకా 25 అధ్యా. వై. ధర్మప్రకాశిక 8 అ.]

3. సగోత్ర [కన్యకయొక్క గోత్రమును వటువుయొక్క గోత్రము నొకటిగానుండుట] పరిణయము పనికిరాదు. కన్యయొక్క తల్లిసోదరుఁడు కన్యకు మేనమామ. తండ్రియొక్కసోదరి మేనత్త. అట్లే వటువునకుఁ గూడ.

4. వయోనిర్ణయము :—

వటువుకంటె వధువు కనీసపక్షము 3 సంవత్సరములైన పిన్నవయస్సులో నుండవలెను. వటువునకు 20 సంవత్సరములైన వయస్సులేనిచో వివాహముచేయరాదు. 24 వ వత్సరమున పరిణయమాడుట ఆర్యసమ్మతము, శ్రేష్ఠము. కన్యక పుష్పవతియైనచోఁ దలిదండ్రుల అనుమతితో వరుని స్వయముగా నిర్ణయించుకొనవచ్చును పుష్పవతియైనపిమ్మట అయిదు వత్సరములవరకుఁ దలిదండ్రులు పెండ్లి గావింపనిచోఁ గన్యక స్వతంత్రించి పరిణయముఁ జేసికొనవచ్చును. వధూవరులిరువురును బాధ్యతల గుర్తెఱింగి వివాహము చేసికొనుట శ్రేష్ఠతమము. వేదోక్తముగాఁ జేయుట శ్రేష్ఠము. ఆచరణ నిర్వహింపలేనివారు పురాణోక్తముగాఁ జేయవచ్చును. వధువునకుగాని వరునకుఁ గాని తొలిచూపులలోఁ గనిపించునది అందము మాత్రమే. హృదయము

ప్రవర్తన వంశము స్థితిగతులు మొదలైన వివరములు బంధువులయొక్క సఖులయొక్క పెద్దలయొక్క సహకారమువలనఁ దెలిసికొని పరిణయము నిర్ణయించుకొనవలెను.

# ఉపనయనము

"గర్భద్వాదశేషు వైశ్యం" అను సూత్రానుసారము తలిదండ్రులు పుత్రునకు పన్నెండవయేట శాస్త్రోక్తముగా నుపనయనము గావింపవలెను. ఉపనయనము జరిగిన పిమ్మట నిత్యమును (వివాహము జరుగువరకు గాయత్రిని జపింపఁజేయుటలోఁ దలిదండ్రులు బాధ్యత వహింపవలెను) కనీసము తప్పక గాయత్రినైన జపింపవలయును. వివాహమునకంటె నూరురెట్లుపనయన కార్యము గొప్పదై యున్నది. బాధ్యత నెఱిగి శాస్త్రోక్తముగా నుపనయనమును జరిపింపవలయును.

శ్రీ

# కన్యకాపరమేశ్వరీ కథా వివర్తనము

## 1. ఈ చరిత్ర యెప్పుడు జరిగియుండెను?

చాళుక్య చక్రవర్తులలో విష్ణువర్ధనుఁ డను పేరుగల భూపాలు రనేకు లున్నారు. కన్యకా పురాణములలో విష్ణువర్ధన చక్రవర్తి యని మాత్రమే యుపయోగించియుండిరి. విష్ణువర్ధన పుత్త్రుఁడగు రాజరాజనరేంద్రుఁడు వాసవీకన్యకకు నన్న యగు విరూపాక్షు నకుఁ బట్టాభిషేక మొనర్చినటుల కన్యకా పురాణగ్రంథములలో నున్నది. ఈ విషయము శాసనముల వలనఁగూడఁ దెలియు చున్నది. చరిత్రకారులును నుడువు చున్నారు. క్రీస్తుశకము 11 వ శతాబ్దాంతమున రాజరాజనరేంద్రుఁడు, నన్నయ భట్టారకుఁడు విరచించిన శ్రీ మదాంధ్ర మహాభారతము నంకితముఁ గైకొనియున్నాఁడు. అగ్నిగుండప్రవేశానంతరము రాజరాజనరేంద్రుఁడు, వాసవీకన్యకాసోదరుఁడగు విరూ పాక్షునకు సామంతరాజ్యపట్టాభిషేక మొనరించినటులఁ గన్యకాపురాణములోఁ గూడ నున్నది. ఏవిధముగా యోచించినను విష్ణువర్ధనుఁడని నిర్ణయమగుచున్నది. విమలా దిత్యవిష్ణువర్ధనుఁడు క్రీస్తుశకము 1022 వ సంవత్సరములో మరణించియున్నాఁడు. అందువలన శ్రీ కన్యకాపరమేశ్వరీ చరిత్ర 10, 11 వ శతాబ్దములలో జరిగినదని నిశ్చయమగుచున్నది.

వైశ్య పురాణమును విరచించిన భాస్కరాచార్యులు, తాను గథాసందర్భ ములలో నున్నట్లును, గొన్ని సభలకుఁ దానే యధ్యక్షుఁడుగ నున్నట్లును గ్రంథములోఁ జెప్పుకొనియున్నాఁడు. కాని వైశ్యపురాణము వ్రాసినది "కల్యబ్ద గణేష్ట నేత్రరస దిక్సంఖ్యాగతే వత్సరే"—అని శాసనమందుఁ గలదు. అనఁగా కలియుగ 4628 వ సంవత్సర మగును. క్రీస్తుశకము 1526 వ సంవత్సరమగును. కన్యకాపరమేశ్వరీ చరిత్ర జరిగిన కాలమునకును వైశ్యపురాణము వ్రాసిన కాలమునకును మధ్యకాలము 500 సంవత్సరములు.

## 2. వైశ్యు లనఁగా నెవరు ?

చాతుర్వర్ణములను గురించి వేదప్రసక్తమైన పురుషసూక్తములో "బ్రాహ్మణోస్య ముఖ మాసీత్, బాహూ రాజన్యః కృతః, ఊరూ తదస్య యద్వైశ్యః, పద్భ్యాగ్ం శూద్రో అజాయత"—అని చెప్పఁబడియున్నది. పై వేదవాక్యముల ననేకు లనేక విధములుగా వ్యాఖ్యానము చేసియున్నారు. "అజాయత" అను పదమునకు "కల్గి యున్నా" రను నర్థమును ఆర్యసమాజమువారు నిర్ణయించిరి. ఆలోచింపఁగా నదియే సత్యమని తోఁచుచున్నది. ముఖము ప్రధానముగాఁగల వారు క్షత్రియు లనియు, ఊరువులు ప్రధానముగాఁగలవారు వైశ్యులనియుఁ, పాదములు ప్రధానముగాఁగల వారు శూద్రులనియు వివరమగుచున్నది. అంతియేగాని బ్రహ్మదేవుని శరీరములో నెచ్చటనుండియైన జన్మింపవచ్చుననుట విజ్ఞులు విశ్వసింపరు. పై నాలుగు జాతులు పుట్టుకతో నేర్పడినవా? కర్మలవలన నేర్పడినవా? యను ప్రశ్న లీ నాఁటివరకు వివాదాస్పదముగా నున్నవి. ప్రకృతము భారతదేశములో జాతి యనునది పుట్టుకతో నేర్పడుచున్నది. పుట్టుకతో నేర్పడినజాతులే ప్రాధాన్య మని విశ్వసించినచో వ్యాసుఁడు దొమ్మరివాఁ డగును. వాల్మీకిమహర్షి బోయవాఁ డగును. కొందఱు మహానుభావుల జన్మములు మాత్రమే గైకొనినచో మిక్కిలి నీచముగా నుండును.

5, 6 శతాబ్దములలో జనసంఖ్య మిక్కిలి తక్కువ. దేశము చాల చిన్నది. నాగరికతగూడ నెక్కువభాగము లేదు. దక్షిణభాగము మదరాసు రాజధానియంతయు దండకారణ్యముగా నుండెడిది. ఆ నాఁ డార్యులు ద్రవిడులు నను భేద మెక్కువగాఁ ప్రబలియున్నది. అప్పుడు మూఁడవ వర్ణమైన వైశ్యులు కామాటి, చెట్టి, కాంటి, పట్కాయీ అను వివిధనామములతోఁ బిలువఁబడుచుండిరి. వైశ్యశబ్దము మాత్ర మనాదిగా నున్నది. ఇప్పుడుగూడ బెంగాలీవైశ్య, గుజరాతీవైశ్య యను వ్యవహారము గలదు. వైశ్యులను గురించి రావుబహదూర్ తుంపూడి భగవంతంగుప్తగా రీవిధముగాఁ జెప్పుచున్నారు—"మంగోలుజాతికిఁ జెందిన టిబెటో, బర్మను శాఖలోని తెగలు హిమాలయ ప్రాంతములందు నివసించుచున్నారు. ఇందులో "తై" "శాన్"— తెగ యొకటి. "తై" తెగనుండియే సయాము దేశము "తైలాండు" అనికూడఁ జెప్పుచు న్నారు. "శాన్" రాజ్యము లుత్తర బర్మాయందు వెలసియున్నవి. ఈ తెగలలో నొక తెగకు "ఖాంటి" అని పేరు. వీరు మణిపురమునకుఁ దూర్పున నుత్తర బర్మా

దేశమందలి "పటకాయి" కొండలయందు నివసించునట్టి యొక స్వచ్ఛమైన తెగవారు. ఈ తెగవారికిని, మణిపురాధీశ్వరులకును నప్పటికప్పటికిఁ బోరాటము గలుగుచుండెను. కొంతకాలమునకు ఖాంటీలలోఁ గొందఱు బంగాళా దేశముఁజేరి 'ధార్ల' నదియొడ్డున "కామటిపుర" మను కోటను గట్టుకొని, అందు "కామటేశ్వరి" దేవతను స్థాపించి, కామటిపుర రాజ్యమును స్థాపించిరి. ఈ రాజ్యమునకు "కోమటి" యనియు, రాజ్యాధిపతికి "కోమటేశ్వరుఁ" డనియుఁ బేళ్లేర్పడెను. ఇతరభాషలందలి "డి" కారము బంగాళీ 'ఒ' కారముగ మారుట తరచు చూచుచున్నాము. కామటిపురపుకోట శిధిలమై యిప్పుడు కూచ్ బీహారు సంస్థానములోఁ జేరియున్నది. కోమటీ రాజ్యవిస్తీర్ణము చూపుపటము వెనుకటి హాలెండుకుఁ దీసికొనఁబడి యచ్చట భద్రపఱుపఁబడియున్నది. టిబెటో బర్మాజాతికిఁజెందిన తెగలే మన పురాణములందు యక్షగణము లని చెప్పఁబడినవి. వీరు శీతవర్ణులు. మాతృదేవతారాధకులు. వీరికి రాజులలోఁ గుబేరుఁడు ప్రధానుఁడు. అమరకోశమునందుఁ గుబేరుఁడు "ఏకపిఙ్గుడు" (పింగళ వర్ణముగల యొకఁడు) అని చెప్పఁబడియుండెను. కుబేర వంశజు లగు కబ్బేరులు కావేరీనదీ తీరమునకు వ్యాపించి యానదికిఁ దమ నామధేయము నిచ్చియున్నారు పెనుగొండ యిపుడు పశ్చిమగోదావరి జిల్లాలోని యొక గ్రామము. ఇది వైశ్యుల పూర్వనివాసస్థల మని నమ్మఁబడుచున్నది. ఇందు నగరేశ్వరాలయము గలదు. అందొక ప్రక్కను గన్యకాపరమేశ్వరీ శిలావిగ్రహము స్థాపింపఁబడియున్నది. అగ్నిగుండములు త్రవ్వఁబడినచోటు యాత్రికులకుఁ జూపఁబడుచుండును. కోటగోడలు శిథిలమగుటచే నిప్పుడు కనఁబడుట లేదు. సమీపమునఁ బాఱుచుండిన గోదావరీనది కొంత దూరమునకుఁ దఱలిపోయినది. గోదావరి చదును ప్రదేశములో వెలసిన కాలువమాత్రము సమీపమున నున్నది. నగరమునకు 'పెనుగొండ' యను పేరు "పటకాయి" నుండి వచ్చినదని నా నమ్మకము. ఈ "పటకాయికొండలు" చాల యెత్తైనవి. పటకాయి శబ్దమేభాషలోని దైనదియు, దానియర్థ మేమైనదియు నాకుఁ దెలియకపోయినను, ఆ పదమునకు "పెద్దకొండ" యని యర్థముగా నుండునని నాభావము. పెనుగొండ నగరస్వాములు తాము కుబేరవంశజులమైనట్లు శాసనములలో వ్రాసికొనియుండిరి. "ఖాంటి" శబ్దము మొదట 'కామటి'గను పిమ్మట 'కోమటి'గను మారినట్లు నమ్ముటకుఁ గారణములిట్లేర్పడినవి. ఈ కోటయేర్పడిన పిదప దాని సమీపప్రాంతములు మఱికొన్ని వర్తకసంఘములుచేరి 17 కోటలను గట్టుకొని, పెనుగొండ నగరస్వాములతోఁ గలిసి వర్తకము

సాగించుకొనుటయే గాక వారి మాతృదేవతారాధనమునందును దదితర కార్యక్రమము నందును బాల్గొనును నేకసంఘముగ మెలఁగుచుండిరి.''—

ప్రాచీనకాలమునఁ గుబేరవంశజుల మని పలుకుచున్న వైశ్యులు, కొమటీశ్వరుఁ డధిష్ఠానదేవతగాఁగల వైశ్యులు మొదలగువారందఱును, ఆహారవ్యవహారములందును, సంబంధ బాంధవ్యములందును నభిప్రాయభేదము లేక మెలఁగుచుండువారు. కాని కొంతకాలమునకు నూటరెండు గృహములవారుమాత్రము గురుకులాశ్రమములందు విద్య నభ్యసించుచుండిరి. పిమ్మట కొన్నాళ్ళకు గురుకులాశ్రమములలో విద్య నభ్యసించిన 102 గృహములవారును గోత్రప్రవరలను నిర్ణయించుకొని, ఆముష్మికదృష్టితో మాతృదేవత యగు పరమేశ్వరీమతల్లి నిష్టదేవతగా నెలకొల్పి మిక్కిలి సంక్షుభావముతో భజింపుచుండిరి. వీరు ప్రత్యేకముగా మాతృదేవతారాధకులైనందునఁ దదితరులు చూచి సహింపలేకపోయిరి. పెద్దచీలిక యేర్పడెను. ఇతరుల యొత్తిడికిఁ దాళఁజాలక నూటరెండు గోత్రములవారు మాత్రము వలసపోయి చాళుక్య సామ్రాజ్యములో స్థానమేర్పఱచుకొనిరి. ప్రథమమునఁ జాళుక్యసామ్రాజ్యములో వారు నివసించుచుండిన పట్టణమునకు జ్యేష్ఠశైలము (పెనుగొండ) అని నామ ముంచుకొనిరి. వారెల్లరు నాత్మశక్తిగలవారు గనుక వారివంశములన్నియు నైహికవ్యవహారములం దన్నిశాఖలలో నారితేరి కొన్నాళ్ళకు సామంతరాజ్యమునుగూడ స్థాపించుకొనఁగలిగిరి.

మన మెల్లరము వారల సంతతిలోనివారమే నానాటికి నిట్టి విభజనము లధికమై, ప్రకృతము భారతీయ వైశ్యులలో ననేకభేదము లేర్పడినవి. పెక్కు చీలికలు గలిగినవి. ఈ నాఁడైనను విజ్ఞులు యథార్థమైన చరిత్రాంశముల నవలోకించి భారతీయ వైశ్యులలోనున్న చీలికలను రూపుమాపి సమైక్యతను సముపార్జించుకొనుట సముచితము. వేదశాఖలు పలుకుచున్న వైశ్యులము మనమే గాదు. బెంగాలీ వైశ్యులు మనవారే. ద్రావిడ వైశ్యులు మనవారే. గుజరాతీ వైశ్యులు మనవారే.

ఈ సందర్భములో నొక చిన్నవిషయమును మనము గమనింపవలసియున్నది. అగ్నిగుండ ప్రవేశఘట్టమున భీరువులై పాఱిపోయినవారెల్లరును వైశ్యులు గారు. అట్లు పాఱిపోయినవారు మత్స్యమాంసభక్షులై బేరీకోమట్లనియు,నాటుకోమటిసెట్లనియు, లింగధారి వైశ్యులనియుఁ, గళింగవైశ్యులనియు నిప్పుడు వ్యవహరింపఁ బడుచున్నారు.

(లింగధారి వైశ్యులు, కళింగవైశ్యులు మాత్రము కొందఱు 102 గోత్రజులైన నార్య వైశ్యులలోఁ గూడ నున్నారు). ఆర్యవైశ్యులు పెనుగొండకు దాపున 17 కోటలను నిర్మించుకొనినయప్పుడు నీచజాతులవారలనుగూడ గోత్రప్రవరలను జెప్పించుకొనినంత మాత్రమున వారలలోఁ గలుపుకొనియున్నారు. అట్లు కలుపుకొనినందువలననే 714 గోత్రము లేర్పడినవని యింతకుముందు వివరించియున్నాను. ఆ కలయిక యొక్కవ కాల ముండకపోవుటన సంబంధబాంధవ్యము లంతగాఁ జేసినట్లు లేదు పై విషయము లన్నియు దీర్ఘముగా నాలోచించినచో భారతీయ వైశ్య సమైక్యత యేర్పడినప్పుడు 612 గోత్రజులైన బేరులు మొదలగు వారు వైశ్యులుగారని విశదము కాఁగలదు. భారత దేశములో సర్వప్రాంతములనున్న వైశ్యులును, ఆహార వ్యవహార బాంధవ్యములలో సంబంధముఁ గలుపుకొనుచున్నచో భారతాభ్యుదయమునకు వైశ్యసంఘము పునాది యగునని నా విశ్వాసము.

## 3. ఆర్యవైశ్యులెవరు ?

నూటరెండు గోత్రజులైన కుటుంబములవారు మాత్రమే యార్యవైశ్యులని పలువురు విజ్ఞులు పలుకుచున్నారు. ఆర్యశబ్దమున కర్థమును మాత్రమే గమనించినచో పూజ్యవాచక మగును. 'అర్య' లనఁగా వైశ్యు లని నిఘంటువులలో నున్నది. అర్యుల సంతతివారము గనుక యార్యవైశ్యులమని కొందఱనుచున్నారు. అగ్ని గుండ ప్రవేశానంతరము బాలనగర సంఘీయులు, భరతఖండములో సమస్త ప్రాంతీయు లచేత గౌరవింపఁబడినారఁట. నాటినుండి కొంతకాలమువఱకు వైశ్యులు 'గౌరకోమ ట్లని' పిలువఁబడుచుండు వారు. గౌరకోమట్లనుపదము సంస్కృతములోనికి మార్చి యార్యవైశ్యులైన దని కొంద ఱందురు (ఆర్యవైశ్యులు—గౌరకోమట్లు). ఇట్లే శ్రేష్ఠి శబ్దమునకుఁ గూడ వివాదము గలదు. 1907 వ సంవత్సరము శ్రీ సుంకు నారాయణ శ్రేష్ఠి గారి అధ్యక్షత క్రింద జరిగిన వైశ్య మహాసభలో "ఆర్య వైశ్యులు" అని పిలువ వలసినదిగా తీర్మానించిరి. ఆ నాఁడు చాళుక్య సామ్రాజ్యములోఁ గుసుమశ్రేష్ఠిగారు మహానిపుణతగా, నూతనపద్ధతులతో రాజ్యపాలనముఁ జేసినారఁట. వైశ్యులు శ్రేష్ఠ ముగా రాజ్యమును బరిపాలించుకొనినందున సామ్రాజ్యచక్రవర్తి వైశ్యులకు 'శ్రేష్ఠి' బిరుదము నొసంగినాఁడట. ఆ నాఁటినుండియు వైశ్యుఁడైన ప్రతివ్యక్తియు నామము నకుఁ జివర 'శ్రేష్ఠి' యను బిరుదము నుపయోగించుకొనుచుండువారఁట. ఈ గాథల

నానుపూర్విగా మనవారలు చెప్పుకొనుచుందురు. ఇది నిజమనియే తోఁచుచున్నది. (శ్రేష్ఠికి వికృతి సెట్టి. శెట్టి యని యుపయోగించుకొనరాదు. 'శ్రేష్ఠి' యను పదమునుగాని, 'సెట్టి' యను పదమునుగాని వాడుకొనవచ్చును). ఏది యెటులున్నను నూటరెండు గోత్రములవారు నాఱునూట పన్నెండు గోత్రజులవారును విడిపోయినపుడు ప్రత్యేక నామమొకటి కావలసియున్నది నూటరెండు గోత్రజులవారి నార్యవైశ్యులని వ్యవహరించుట సముచితముగనే యున్నది ఈ నాఁడు భారతదేశములో నే ప్రాంతములో నున్నను నూటరెండు గోత్రజులైన కుటుంబములవారు మాత్ర మార్యవైశ్యులని నిర్ణయమై యున్నది. అగ్నిగుండ ప్రవేశమైన నూటరెండు గోత్రజులవారిని మాత్రమే మన మిప్పు డార్యవైశ్యులని వ్యవహరించుచున్నాము.

## 4. వాసవీకన్యక యెవరు ?

వాసవీకన్యక లక్ష్మీదేవియనియుఁ బార్వతీదేవి యనియు బహువివాదములు గలవు. ప్రకృతము కొందఱు వైష్ణవులైన వైశ్యులు కన్యకాపరమేశ్వరీదేవాలయమునకుఁ బోవుటకూడ మానుకొనియున్నారు. మఱికొందఱు సీతారాముల విగ్రహములను ముందధిష్ఠింపఁజేసి పూజించుచున్నారు. శైవమతస్థులైన వైశ్యులు గౌరీదేవి యనియే గాఢమైన నమ్మకముతో భజించుచున్నారు. రానురాను వివాదములు మాత్ర మధికమైనవి. భక్తి క్షీణించిపోయినది. శ్రీ కన్యకాపరమేశ్వరీ చరిత్ర జరుగక పూర్వము నూటరెండు గోత్రజులయిన వైశ్యులు పరమేశ్వరీమతల్లి నధిష్ఠానదేవతగా నిలుపుకొని భజించుచుండువారు. పెనుగొండ రాజధానిగాఁ బదునెనమిది పట్టణములను బరిపాలించుచున్న కుసుమశ్రేష్ఠి, జగన్మాతయగు పరమేశ్వరీమతల్లికిఁ బరమభక్తుఁడు. ఆ మహామాతయొక్క వరప్రసాదమువలననే వాసవీకన్యకయు విరూపాక్షుఁడు జన్మించియుండిరి. పరమేశ్వరీమతల్లి కుసుంభశ్రేష్ఠికి స్వప్నమందుఁ గనుపించి తాను జన్మించెదనని చెప్పినట్లుగూడఁ గథయందుఁ గలదు. పూర్వగాథలెట్లున్నను, విమర్శనావిషయమేవిధముగానున్నను బదునెనిమిది పట్టణములకుఁ బ్రభువగు కుసుమశ్రేష్ఠికి జన్మించి అగ్నిగుండ ప్రవేశానంతర పూజారాధన దేవతగాఁ బరిగణింపబడినది, గాన జగన్మాత యగు పరమేశ్వరీమతల్లియే వాసవీకన్యక యనుట సముచితము. విజ్ఞులు పార్వతియనియు లక్ష్మియనియు విమర్శించుకొనక జగన్నిర్మాణకారిణియు, నోంకార రూపిణియు నగు పరమేశ్వరీమతల్లియే వాసవీకన్యక యని విశ్వసింతురుగాక !

# 5. శ్రీ కన్యకాపరమేశ్వరీ విగ్రహమునకు మంగళసూత్ర ముంచఁదగునా?

పరిష్కృత మాంధ్రదేశములోనున్న శ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరీ దేవ్యాలయములలోఁ జాలవఱకుఁ గన్యకాపరమేశ్వరీ విగ్రహములకు మంగళసూత్రములు గనుపించుచున్నవి ప్రక్కన నగరేశ్వరుఁ డను విగ్రహమునుగూడ నుంచుచున్నారు. నామధేయములోఁ గన్యకాత్వము స్ఫురించుచున్నది శ్రీకన్యకాపరమేశ్వరి యనుచున్నాము. కన్యకను మహాపవిత్రముగా శాస్త్రములు గౌరవింపుచున్నవి కన్యక యనగాఁ బరిమళ మాఘ్రాణింపని కుసుమము వంటిది. కన్యక అత్యంత పవిత్రురాలు గనుక యే దేవికిఁగాని దేవునకుఁగాని మంగళనీరాజనమును గన్యకచేతనే యిప్పించుచుండువారు. చక్రవర్తులుగాని మహారాజులుగాని వచ్చినపుడు కన్యకలచేతనే మంగళహారతుల నిప్పించి, పుష్పపూజను జేయించుచుండువారు. శుభకార్యములయందుఁ గన్యకలకుఁ బ్రథమ తాంబూలము. ప్రయాణాదిసమయములలోఁ గన్యకలెదురైనచో శుభశకునమగును. పుష్పము లతయందే వికసించియున్నపుడు వాసనచూడకయున్నపుడు మిక్కిలి శోభగాఁ బవిత్రముగా నుండును. అట్లే యొకకాంత వివాహము కాకపూర్వము మిక్కిలి శోభగాఁ బవిత్రముగా నుండును. పుష్పవతియై వివాహముగాక పూర్వము మధ్యకాలములోనుండు కాంతను గన్యక యందురు.

అట్టి పవిత్రమైన కన్యకారూపము నార్యవైశ్యాన్వయ మారాధించుచున్నది. విమలాదిత్య విష్ణువర్ధన చక్రవర్తి వాసవీకన్యకాసౌందర్యశోభను వీక్షించి మోహించగాఁ బరిణయమునొల్లక యాదర్శప్రాయముగా నగ్ని కాహుతియైన కన్యకామతల్లికిఁ దాలిబొట్టుకట్టుట సముచితమగునా? క్రీ॥శ॥ 1526వ సంవత్సరముననున్న భాస్కరాచార్యులవారు వైశ్యపురాణమును రచింపఁగా నాతనికి 'తామరవాడ' యను నొకగ్రామమును, అగ్రహారములును ఆర్యవైశ్యులు కవిగారైన భాస్కరాచార్యులవారి కొసంగియున్నారు. తామరవాడ యను గ్రామము [అగ్రహారము] పెనుగొండకు 4 మైళ్ళదూరమున నున్నది. వైశాఖశుద్ధ సప్తమీ బుధవారమునాఁడు, 'వైశ్యపురాణము' నార్యవైశ్యులంకితముగాఁ గైకొన్నారు. ఆ నాఁడే శ్రీ భాస్కరాచార్యులవారు వాసవీకన్యక యను శిలావిగ్రహమునకును నగరేశ్వరుఁ డను శిలావిగ్రహమునకును బరిణయము జరిగించిరి.

అనఁగా శ్రీ కన్యకాపరమేశ్వరీ చరిత్ర జరిగినపిమ్మట 500 సంవత్సరములకుఁ బరిణయము జరిగినది. తాసురవాడలో నా నాఁడు మహావైభవోపేతముగా నుత్సవాదులు జరిగినట్లు అక్కడక్కడ వర్ణింపఁబడియున్నవి. నాఁటనుండియు నగరేశ్వర సహిత కన్యకాపరమేశ్వరి యని వాకొనుచున్నారు. మంగళసూత్రముకట్టునాచారముగూడ అప్పటి నుండియే వచ్చినది. అప్పటినుండి శ్రీ వాసవీజయంతిగూడ వైశాఖశుద్ధ సప్తమీ దినమున జరుపుచున్నారు. జయంతి యనగా జన్మదినము జరుపఁదగినది. (శ్రీవాసవీకన్యక జన్మదినము—కలియుగాబ్ది 4122 సంవత్సర వైశాఖ శుద్ధ దశమీ శుక్రవారము పునర్వసూనక్షత్రము బ్రాహ్మీముహూర్తమునందు శ్రీవాసవీకన్యక జన్మించినది)—ఈ గాథలను మైలారులు వీరముష్టులు ద్విపదరూపముగానుండు దండకములతోఁ జెప్పుచుందురు.

"శ్రీకరము తామ్రమాడ ♦ చెలువొప్పగాను
భాస్కరాచార్యుండు ♦ పరమపూజ్యుండు
వాసవీకన్యకా ♦ పరిణయము సేసె
నగరేశ్వరస్వామి ♦ నాణెమ్ముగాను
వాసవి కన్యకను ♦ పరిణయమ్మాడె
బేరీలు పెక్కులై ♦ పిక్కటిల్లగను
ఇసుకరాలని జనము ♦ నిమురుకొనగాను"

ఆ నాఁ డా గాథ లెట్లు జరిగినను, ప్రస్తుతము మన దేవాలయములలో విగ్రహమునకు మంగళసూత్రము గట్టుట విచారము. వాసవీకన్యక పూర్వజన్మలో లక్ష్మీదేవియే కావచ్చును, పార్వతీదేవియే కావచ్చును. గాయత్రీమతల్లి కావచ్చును. ఈ జన్మలో మంగళసూత్ర ముంచుట సమంజసము గాదు. వాసవీకన్యక పూర్వజన్మలో గౌరీదేవియే గనుక పార్వతీదేవి దేహమునం దర్ధభాగము పరమేశ్వరుఁ డున్నాఁడు (అర్ధనారీశ్వరుఁడు) గనుక పార్వతియే వాసవీకన్యక గాన, వాసవీకన్యకను మాత్రమే ఆరాధించుట అపచారమనియుఁ గొందఱు వాదించియున్నారు. అది సత్యము గాదు. శ్రీ వాసవీకన్యకయొక్క జన్మాంతరమునందు గౌరిదేవియైనను, బరమేశ్వరుని కొసంగి పరిణయము గావించుట సముచితమా? రుక్మిణీదేవి పూర్వజన్మమున సీతాదేవియైనను, శ్రీరామునిభార్య రుక్మిణీదేవి యందుమా? శ్రీకృష్ణ

దేవునిభార్య సీతాదేవియనుట యపచారముగాదా? 'ఏక మే వాద్వితీయం బ్రహ్మ' అను స్మృతి ప్రకారము దైవ మొక్కండైనను అవతారము దాల్చినపు డట్లే వ్యవహరించుట సమంజసము. ఆర్యవైశ్య మహాశయులెల్లరును స్వస్వరూపమైన శ్రీ వాసవీకన్యకాపరమేశ్వరీమతల్లి నారాధించి పూజించి యా మహాదేవి కరుణామృత వాహానికిం బాత్రు లగుదురు గాక!

## 6. వీరముష్టు లనంగా నెవరు? మైలారు లనంగా నెవరు?

ఆర్య వైశ్య వంశము మైలారులను, వీరముష్టులను బోషింపుచున్నదేగాని, వారల నిజచరిత్రలు సామాన్యముగాం బెక్కురకుం దెలియదు మైలారులలోనే గంగ కావిళ్ళవా రని యొక తెగ గలదు. సామాన్యముగా మైలార్లు శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీపీఠములను దెచ్చుచుందురు. త్రిపుండ్రాంకితులై జాగంటలను జేతంబట్టుకొని, శ్రీ కన్యకాపరమేశ్వరీ దండకములను జదువుచు వచ్చుచుందురు. గంగకావిళ్ళవారు బిందెలను కావిళ్ళయం దిడుకొని వివాహాది శుభకార్యములప్పుడు, శ్రీ వాసవీ జయంత్యుత్సవ సందర్భములయందును వచ్చుచుందురు. వీరముష్టులు ప్రభలను కటీభాగములందుం గట్టుకొని జయజయధ్వానములతో జాగంటలను జేతుల నిడుకొని వచ్చుచుందురు. ఆ ప్రభలయందు ఖడ్గములు, కవచములు, సైన్యజాలముల తలలు, ఇంకను గొన్ని రణరంగచిహ్నములు కనిపించుచుండును.

విమలాదిత్య విష్ణువర్ధన సార్వభౌముండు పెనుగొండ నగరమును జూచుటకు వచ్చి నీరాజనమిచ్చు సమయమునందు వాసవీకన్యకను జూచి మోహించినాండు. పరిణయమాడుటకుం బ్రయత్నించినాండు. పెనుగొండ నగరస్వాము లెవ్వరు నావిషయ ములో నంగీకరింపలేదు. మహారాజుగారి కాగ్రహము వచ్చినది. ౭ రోజులు గడు విచ్చినాండు. శ్రీ వాసవీకన్యక నెక్కడికైనను దీసికొనిపోయెదరేమో యని జాగ్రత్తగా గమనించుటకై తనతోనున్న పరివారములో నాలుగువేల సైన్యజాలము లను, గూఢచారులను పెనుగొండ నగరము చుట్టును గాపుంచినాండు. ఆ సైన్యజాల ములే శ్రీ వాసవీకన్యకావిశ్వరూప ఘట్టమునందునను, ధర్మకంకణధారణఘట్టము నందునను బాల్గొనినవారలై శ్రీ వాసవీకన్యకాపరమేశ్వరీ భక్తులైపోయిరి. ఆ నీచుండైన చక్రవర్తియొద్ద నుదరపోషణార్థము జీతముకొఱకు సేవచేయవలసివచ్చెనని

పలికి, అందఱు నొక్కుమ్మడిగాఁ దమతమ యుద్యోగములకు రాజీనామాల నొసంగిరి. పైగా నగ్నిప్రవేశానంతర ముత్తేజితులై, సర్వాయుధపాణులై బాలనగరులలోఁ గలిసి విష్ణువర్ధన సైన్యజాలముతో యుద్ధమొనర్చుటకు సాహసించిరి ఈనాటికిని ఆ సంతతి వారు శ్రీ కన్యకాపరమేశ్వరీమతల్లినే గొలుచుచుందురు. వారలే వీరముష్టులు. ఆనాడు త్యాగముచేసిన సైన్యజాలముల తలలు వారి ప్రభలయందుఁ గనిపించును. ఇంకను యుద్ధమునకు సంబంధించిన ఆయుధములన్నియుఁ బ్రభలయందు దమర్చియుం డును. నాడు ధనగౌరవప్రాణములను ఆత్మసంఘమునకు సమర్పించినారు గావుననే నేటికిని శుభకార్యములయందుఁ దృణమో పణమో సమర్పించుకొని పోషించు చున్నాము.

వారలలోఁ గొందరత్యంత భక్తులై యగ్నిప్రవేశానంతరము బాలనగరులలోఁ గలసి కాశీపట్టణమున కేగినారు. గంగానదిలో బాలనగరులు పితృకర్మలను జేసినపిమ్మట వారిలోఁగలిసి శివలింగములను, గంగాజలములను, గాశీనగరమునుండి పెనుగొండ పట్టణమువఱకు మోసికొనివచ్చినారు. గంగాజలములను కావిళ్ళతోఁ దెచ్చినవారిని గంగకావిళ్ళవారనియుఁ, బెనుగొండనగరములో శివలింగప్రతిష్ఠలను జేయించినవార లను మైలారులనియు వ్యవహరించుచుందురు. మైలారులు గంగకావిళ్ళవారు వీర ముష్టులు సర్వదా శ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరీమతల్లిని గొలుచుచుందురు.

## 7. ఆర్యవైశ్యులకు నూటరెండు గోత్రములా? నూట ఒక్క గోత్రమా?

విష్ణువర్ధనభూపతి పెనుగొండకు వచ్చి ఎనిమిది రోజులు గడువొసంగిపోయి నాఁడు. ఏడు రోజులు గడచిపోయినవి. నగరస్వాములెల్లరును గలిసి యొక గొప్ప మహాసభను గావించినారు. కర్తవ్యము నిర్ణయము కాలేదు. ఎల్లరును గింకర్తవ్యతావి మూఢులైనారు. విషాదఘట్టము పరీక్షాఘట్టము సమీపించినది. తెల్లవారిన నేమగునో ప్రాణములు దక్కునా? పట్టణము లుండునా? యను భావవాహిని హృదయకుహరము లందుఁ బ్రవహించుచున్నది స్వీయసౌధమునందుఁ గుసుమశ్రేష్ఠిగారు వాసవీకన్యకా రూపమును విశ్వరూపమును గాంచఁగలిగినారు. వాసవీకన్యక లలితాస్వరూపిణి విశ్వమాత పరమేశ్వరీమతల్లి యని గ్రహింపఁగలిగినారు. కుసుమశ్రేష్ఠిగారు శ్రీ

వాసవీకన్యకాపరమేశ్వరీభక్తులైపోయినారు. రహస్యమందిరమున కుసుమశ్రేష్ఠిగారికి గర్తవ్యాంశములనా మహాదేవియే వివరముగాఁ జెప్పినది.

అది పరీక్షాఘట్టము. పెనుగొండలో నార్యవైశ్యనగరస్వాములసభ. పరమేశ్వరీ దేవ్యాలయ సన్నిధానమున నూటమూఁడగ్నిగుండముల సిద్ధపఱచినారు. ఆ సభను వీక్షించుటకై పురుషులు, స్త్రీలు, బాలురు, యువకులు, వృద్ధులు వేనకువేలుగాఁ బరివేష్టించియున్నారు. శ్రీ కుసుమశ్రేష్ఠిగారు పసుపుకొమ్ములతోఁ గట్టియుంచిన వీరకంకణములను బంగరుపళ్ళెరములలోఁ దెచ్చి యుంచినారు. కుటుంబమున కొక దంపతులు చొప్పున నూటరెండు గోత్రములయందున్న ప్రధానదంపతులు ప్రత్యేక స్థలములయందాసీనులైయున్నారు. బాలనగరు లొక వైపునను గౌరబాలిక లొక వైపునను బరివేష్టించియున్నారు. కుసుమశ్రేష్ఠిగారు లేచివచ్చి యెల్లరను వీక్షించి, మహాశయులారా! ఇది పరీక్షాఘట్టము జరిగిన కథయంతయు మీకు విశదమే. ఇందులో నిర్బంధము లేదు. వెనుక విచారపడిన లాభము లేదు. ప్రాణపరిత్యాగమున కైనను సాహసింపఁగలిగినవారె, యీ వీరకంకణధారణ చేయవలెను ఒకగోత్రమునకు ఒక కుటుంబమునకు ఒక దంపతులు మాత్రమే యీ కంకణమును ధరించుట కర్హులు. అందఱు నిట్టి సాహసముచేయుట కనుజ్ఞలే దని పలుకఁగా, కాస్యసగోత్రాలంకారులైన (గంపకుల) ధనదగుప్త ధనలక్ష్మి యను దంపతులు ముందునకు వచ్చి ధర్మకంకణ ధారణ చేయఁబూనిరి. అందఱు నివ్వెఱపోయి వీక్షించుచుండిరి. కుసుమశ్రేష్ఠిగారు మొదలైన ప్రధాననగరస్వాములు పరికించి "ధనదా! ఆగుము. తొందరపడవలదు. ధర్మకంకణధారణచేయఁబోకుము. మీకు సంతానములేదు" అని పలికిరి. ధనదుఁ డంగీకరింపలేదు. "నాయనలారా! మేము వృద్ధదంపతులము. మాకిప్పటికి సంతానము లేదు. ఇంకఁ గలుగు ననుట రిక్తవాక్యము. మాజీవితము లీ పవిత్రఘట్టములో నగ్ని కాహుతిఁ గావింపక యేనులక మంచమందుననో యేకుక్కిచాపలయందో పరిసమాప్తిఁ జేయుట శ్రేష్ఠమగునా? మా హృదయవాంఛకు మాధర్మదీక్షకు మీరాటంకముఁ జెప్పవలదు" అని పలుకుచు ధనదుఁడు ధనలక్ష్మియు వీరకంకణధారణఁ జేసిరి ఎల్లరును జయజయధ్వానములతో భళిభళీ యని మెచ్చుకొనిరి. పూలవానలఁ గురిపించిరి.

ఆనాఁడు ధనలక్ష్మీ ధనదదంపతులు సంతానములేకపోయినను బ్రాణపరిత్యాగముఁ జేసినారు గాన, ఆ వంశ మిప్పుడు లేదు. ఆ గోత్ర మంతటితో నంతరించినది. ధనదగుప్తగారికి 'లాభగుప్త' యనియు నామధేయము గలదు. ఆనాఁటినుండియు నార్యవైశ్యులు ప్రతికార్యారంభములయందును వారినామధేయములను స్మరింపుచుందురు. ఆర్యవైశ్యులు 'ఒకటి' సంఖ్యకు బదులు 'లాభం ధనదా' అని కాని 'లాభం' అని కాని ఉచ్చరించుచుందురు. వివాహాది శుభకార్యములందు ఆ దంపతులకే ప్రథమతాంబూల మిచ్చుచుందురు. ఆ గోత్రము వ్యవహారములో నున్నది గాన నున్నట్లే భావించెదరు. ఆ గోత్రముఁ గలిగినచో నార్యవైశ్యులకు నూటరెండు గోత్రము లగును. లేనిచో నూటఒక్క గోత్ర మగును ఆ గోత్రీకులెవ్వరు లేకున్నను వారి గౌరవార్థము కొందఱుమాత్రము ఆ గోత్రము పేరు పెట్టుకొని వ్యవహరించిరి.

## 8. శ్రీ కన్యకాపరమేశ్వరీ గర్భాలయములో వైశ్యులు ప్రవేశింపరాదా ?

శ్రీ వాసవీకన్యక ఆర్యవైశ్యాన్వయమునందు జన్మించినది. నాఁటి నగరస్వాముల చేతులలో నల్లారుముద్దుగాఁ బెఱిగినది. ఆర్య వైశ్యాన్వయాధిపతులైన కుసుమాంబా కుసుంభదంపతులకుఁ గడుపుచల్లగా జన్మించినది ఆ నాఁడు మనయింటఁబుట్టి మన చేతులలోఁ బెరిగిన వాసవీకన్యకామతల్లిని మనము పూజించుకొనుట కర్హతలేదా ? ఆర్య వైశ్యులను శ్రీ కన్యకాపరమేశ్వరీ గర్భాలయములకు రానివ్వరు. పూజారులుగా నెవరున్నను గర్భాలయములకుఁ బోయి స్వేచ్ఛగా నర్చించుకొనుటకు శ్రీవాసవీ కన్యకామతల్లిని బూజించుకొనుటకుఁగాని, స్తోత్రముఁ జేసికొనుటకుఁగాని, సరియైన మంత్రముగాని శ్లోకముగాని యేమియునులేదు. వారణాసీ విశ్వేశ్వరలింగమును బంచములుగూడ నాలింగనముఁ జేసికొనవచ్చునుగాని, శ్రీవాసవీకన్యకాపరమేశ్వరీమ తల్లిని స్వయముగాఁ బూజఁజేసికొనుట కార్యవైశ్యుల కధికారము లేదా ? ఇది విచారణీయాంశము.

## 9. వైశ్యమాత వాసవీకన్యక శాపములు పెట్టియుండునా?

ఆర్యవైశ్యాన్వయమున కిది యొక గొప్ప కళంకము. కాదు; ఆంధ్రదేశమునకుఁ గాదు; భారతదేశమంతటికిని గళంకమే. ఏలననఁగా—

"అద్య ప్రభృతి యా నారీ వైశ్యజాతౌ జనిష్యతి
సా సర్వవికృతాకారా తింత్రిణీతుల్యలోచనా
హ్రస్వాలకా చా వృద్ధస్నీ పీనమధ్యా కృశస్తనీ
నీలరూపా వ్యస్తపాదా హ్రస్వబాహుః పిచండిలా
అనటీటా కృశతను ర్వికృతా గద్గదస్వరా
హ్రస్వకాయా దీర్ఘదేహా కంఠమధ్యేతు గ్రంధిలా
తిర్యగ్దృష్టిః క్రూరవాచా సదా కలహకారిణీ
ఏవం విధావధూ ర్భార్యా తథాపి శుభలక్షణా
సుప్రజా ద్రవ్యసంపన్నా లక్షణాఢ్యా సుమంగలీ
అన్వాయే గోమతానాం భూయా దేవం మతం మమ!"

శ్రీ మత్కన్యకా పురాణము .. [27 అధ్యాయము_73, 74, 75, 76, 77 శ్లోకములు]

"ఈరోజునుండి వైశ్యాన్వయమునందు జనించు కాంత వికృతాకారము గలదియు, చింతాకువలె చీకిపోయిన కన్నులు గలదియు, పొట్టి వెంట్రుకలుగలదియు, మిట్టపండ్లుగలదియు, లావైన నడుముగలదియు, నెండిపోయిన స్తనములు గలదియు, కాకివంటి నల్లని రంగు గలదియు, దొడ్డికాళ్ళు కుఱుచహస్తములు గలదియు, పెద్దపొట్ట గలదియు, చట్టిముక్కు గలదియు, చిక్కిపోయిన శరీరము గలదియు, వికృతరూపము గలదియు, డగ్గుత్తికతో, మాటలాడునట్టిదియు, పొట్టిదియు, పొడుగుదియు, మెడయందు కణితి గలదియు, తిరుగుడు కన్నులు గలదియు, కఠినవచనములు పలుకునదియు, ఎల్లప్పుడు జగడాలమారియునై యుండఁగలదు. అట్లున్నప్పటికి సంతానముగలదై, ధనముగలదై దీర్ఘమాంగల్యము గలదైయుండఁగలదు"—శ్రీ మత్కన్యకా పురాణము.

శ్రీ వాసవీ కన్యకామతల్లి యీరీతిగా నార్యవైశ్యజాతికి శాపములను బెట్టినట్లుగా శ్రీ కన్యకాపురాణమునందుఁగలదు. పై కన్యకాపురాణము అష్టాదశ పురాణములలో నొకటైన స్కాందపురాణాంతర్గత సనత్సుజాత సంహితలోని దని చెప్ప

చుందురు. శ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరీమతల్లి ఆర్యవైశ్యజాతి కింతటి ద్రోహమును గావించినదా ? ఒక అవతారమూర్తి ఒకజాతి నుద్ధరించుటకు, ఒక వంశమును బాగు చేయుటకొఱకు, ఒక సామ్రాజ్యమును నీతిబద్ధముగాఁ జేయుటకొఱకు, దౌర్జన్య రాహిత్యముఁ జేయుటకొఱకు, సత్యమును నెలకొల్పుటకొఱకు, ధర్మమును నిలుపుట కొఱకు, ఆముష్మిక బీజములను హృదయక్షేత్రములలో వెదఁజల్లుటకొఱకు అవత రించిన మహాదేవి యిట్టి శాపములఁ బెట్టియుండునా ? పురాణములం దెక్కడఁగాంచి నను పై వివరించిన శాపములును వైశ్యాన్వయమున కవమానకరమైన ఘట్టములును బెక్కులుగాఁ గనిపించుచుండును. పండితుల దృష్టిలో దేశమునందు వైశ్యులు లోకువగాఁ గనిపించుచున్న ట్లున్నది. లేనిచో సత్యనారాయణవ్రతముఁ గావించినను వైశ్యులను దూషించుకథలే చెప్పుకొనవలెనా ? ప్రకృతపురాణములం దున్న గాథలే సత్యమైనచో శ్రీ కన్యకా పరమేశ్వరీమతల్లికి దేవాలయములనుగట్టించి పూజించుట మిక్కిలి వ్యర్థమగును.—కాని సత్యమైనచరిత్ర అది యని విజ్ఞులెవ్వరును విశ్వసింపరు. నా బుద్ధికుశలతకొలఁది పలుగ్రంథములను వీక్షించి, పలుశాసనములను శాస్త్రములను బరికించి నే నీ గ్రంథమును లిఖించితిని. నిజముగా జరిగిన శ్రీవాసవీ కన్యకాపరమేశ్వరీ చరిత్ర, ఆర్యవైశ్య జాతికే గాదు, చాళుక్య సామ్రాజ్యమునకే గాదు, ఆంధ్రదేశ మునకే గాదు, భరత ఖండమునకే గాదు, ప్రపంచమునకుఁ గూడ ఆదర్శప్రాయమైనది. యథార్థమైన ఆధ్యాత్మికతత్త్వ మీగాథలోఁ గలదు. సత్యధర్మము లీ కథలో నిమిడియున్నవి. సత్యాగ్రహపద్ధతు లీ చరిత్రయందు వివరింపఁబడినవి. అహింసా సిద్ధాంత మిందు సిద్ధాంతీకరింపఁబడినది. గృహధర్మములేమి, మానవ ధర్మములేమి, బాలకుల కార్యదీక్షలేమి అన్నియు విపులముగానున్నవి. ఇంకను నార్యవైశ్యు లొన రించిన వాణిజ్యాభివృద్ధికి, నావికాయానము, కార్మిక రక్షణ కర్షకపోషణ, గోసంరక్షణ మొదలగు కులధర్మములన్నియుఁ గానవచ్చుచున్నవి. ఇట్టి పవిత్రచరిత్రకు శాపాది కములు గొప్ప కళంకమును జేకూర్చినవి. యథార్థచరిత్ర మన కొసంగిన పూజ్యులు బ్రహ్మశ్రీ ఆత్మూరి లక్ష్మీనృసింహ సోమయాజి వందనీయులు.

# 10. బాల్యవివాహములు తగునా? అగ్ని ప్రవేశమునాటి వాసవీకన్యకావయోనిర్ణయము

అది వేదకాలము. మానవజీవితములో గృహస్థాశ్రమ ముత్తమోత్తమ మని నమ్మిన రోజు లవి. స్త్రీ గాని పురుషుఁడుగాని వివాహానంతరము రెండవజీవితము ననుభవింపుచున్నారు. స్త్రీ తన జీవితమంతయు భర్త కధీనముఁజేసి భర్తయే గురువు దైవము సర్వము నని భావించుకొనవలసిన బాధ్యత కలిగియుండవలెను. తన భర్తను నిర్ణయించుకొనుటలో ప్రథమ స్వాతంత్ర్యము కాంతకుండవలెను. అట్టితఱి కనీసము పదునాలుఁగు వత్సరముల వయసైనా ప్రాప్తించనిదే కన్నియకు స్వతంత్రశక్తి కలుగ నేరదు. ఒకానొకప్పు డఱుమాసముల బాలికకుఁగూడ తాలిగట్టి బొమ్మలపెండ్లివలెఁ బరిణయముఁజేసినారట. ఊహాశక్తిలేక దిక్కుతెలియని చిన్నిచిన్ని బాలికలకువివాహము గావించుట మిక్కిలి యపచారము. నాలుగైదు శతాబ్దములకుఁ బూర్వము భారత దేశచరిత్రలో బాల్యవివాహములు జరిగినట్లు వినియుండము, ప్రాచీనచరిత్రలలో సుభద్రాపరిణయమేమి, రుక్మిణీకల్యాణమేమి, సీతావివాహమేమి ఎక్కడ నేగాథలోఁ బరికించినను స్త్రీకి స్వాతంత్ర్యము వచ్చినపిమ్మటనే వివాహము.

కన్యకాపురాణములన్నిటియందును శ్రీ వాసవీకన్యకు నెనిమిదివత్సరముల [అగ్నిప్రవేశకాలమునాటికి] వయ స్సని వర్ణింపఁబడియున్నది. విష్ణువర్ధన మహారాజు, ఎనిమిది వత్సరముల వయస్సుగల వాసవీబాలను ప్రేమించి మోహించినాఁడు. ఈనుడిని విజ్ఞు లెవరైనను విని విశ్వసింతురా? ఎనిమిది వత్సరముల వయసుగల బాలికనువరించు టెట్లు? మోహించుటెట్లు? పుష్పవతియై అవయవములు సంపూర్ణముగా నేర్పడి సర్వాంగ సుందర కన్యకయైనచో మోహించుటకు వీలుండును. ఎంతటిసౌందర్య మున్నను బాలికయందు వాత్సల్యము ప్రేమ కలుగును గాని, మోహము జనింపదు. శ్రీ వాసవీకన్యకకుఁ బదునెన్మిది వత్సరముల వయసున్నట్లు వీరముష్టులు చదువుచున్న కొన్ని దండకములందు వర్ణింపఁబడియున్నవి. కొన్ని పురాణములందును శాసనము లందును శ్రీ వాసవీకన్యకయొక్క సర్వావయవములును వర్ణింపఁబడియున్నవి. విపుల ముగాఁ బరికింపఁగా నగ్నిగుండప్రవేశ కాలమునాటికి శ్రీ వాసవీకన్యకకుఁ బదునెన్మిది వత్సరముల వయసుండు ననియే తోఁచుచున్నది.

# 11. మేనఱికధర్మము లనగా నెట్టివి ?

అది గ్రుడ్డికాలము. నాటివా రమాయకులు. లేనిచో నీ విధముగా వ్రాయఁబడిన పురాణముల నార్యవైశ్యు లంగీకరించియుందురా ? ప్రతిపురాణమునందును మేనఱికధర్మములు మిక్కిలి నీచముగా వర్ణింపఁబడియున్నవి.—మేనఱిక ధర్మమును బాటింపవచ్చును గాని కులము, గోత్రము, వయస్సు, రూపము, విద్య, ఆరోగ్యము, గౌరవము, విత్తము మొదలగునవేమియుఁ బాటింపవలదా ?

"అథ నక్షత్ర రాశ్యాదిదోషాణ్ నైవ విచింతయేత్
అశుభావర్తదోషాంశ్చ మిళితభ్రూత్వమానసే
భాగినేయాయ కన్యాచ దాతవ్యా తా న్నచింతయేత్
ఏవం నియమముత్సృజ్య కుర్యా ద్యోవా విమోహితః
స వినశ్యే త్స్వగర్భేణ కర్కటీవ నసంశయః—"

(శ్రీ మత్కన్యకాపురాణము—ఇరువదినాల్గవ అధ్యాయము—25, 26 శ్లోకములు)

"వరుని విషయములో మేనమామగారు నక్షత్రరాశ్యాది దోషములను, చెడుసుళ్ళు మున్నగుదోషములను, కనుబొమలు రెండు నేకముగా నుండుట మున్నగు దోషములను ఆలోచింపఁగూడదు. ఏ లోపములును గమనింపకయే మేనల్లునకు బిడ్డనీయవలెనని పెద్దలు చెప్పుదురు. ఈ వినియమమును విడిచి మోహముచే నిట్లనుసరింపనివాఁడు కర్కటి (= ఎండ్రి) స్వగర్భముచే పంచత్వమునొందు విధమున నశింపఁగలఁడు. ఇందు సందేహము లేదు."

"బుద్ధిహీనో దరిద్రోవా దేశాంతరగతోఽపివా
దుర్బలో బధిరో మూర్ఖో బంధుభీ రహితోఽపివా
అసౌందర్యో ఽల్పరోగీ వా హ్రస్వో దీర్ఘతనుః కృశః
మాతాపితృవిహీనోవా భ్రాతృహీనో ఽపి పీనసః
పిశునో ద్యూతకారీవా కాముకో రాజసేవకః
మాతులస్య సుతోద్వాహం భాగినేయ స్స మర్హతి."

(శ్రీమత్కన్యకాపురాణము-ఇరువదినాల్గవ అధ్యాయము-31, 32, 33 శ్లోకములు)

"బుద్ధిహీనుఁడును, దరిద్రుఁడును దేశాంతరమునకుఁ బోయినవాఁడును, బలములేనివాఁడును, చెవిటివాఁడును, మొండివాఁడును, బంధువులులేనివాఁడును, అందములేనివాఁడును, పొట్టివాఁడును, పొడుగువాఁడును, బక్కచిక్కినవాఁడును, తల్లిదండ్రులులేనివాఁడును, సహోదరులులేనివాఁడును, పీనసరోగము గలవాఁడును. జూదగాఁడును, కొండెగాఁడును, ఇంద్రియవాంఛ గలవాఁడును, రాజసేవకుడును ఇట్టి యవగుణంబు లెన్నియున్నను మేనల్లునకు మేనమామ కూతు నీయవచ్చును."

ఆర్యవైశ్యులచే నింతవఱకుఁ బవిత్రముగాఁ బాటింపఁబడుచున్న కన్యకాపురాణమునం దీరీతిగా మేనఱికధర్మములు చెప్పఁబడియున్నవి. శ్రీవాసవి కన్యకామతల్లి యథార్థముగా నిట్లు చెప్పియుండదు. ఆ మహాదేవికి, ఆ యవతారమూర్తికి, గృహస్థాశ్రమధర్మములు తెలియవా? సతీపతు లెట్లుండవలసినది తెలియదా? పైరీతిగా దాంపత్యతరువున్నచో ఫలించఁగలదా! వీలున్నంతవఱకు మేనఱికమునుదప్పించి వివాహముచేయరాదు. కాని– వయస్సు, ఆకారము, ఆరోగ్యము, ఆయుర్దాయము, అందము, ప్రవర్తన, గుణము, విద్య, కుటుంబగౌరవము, స్థితి—వీనిలో విశేషభేదము కనిపించినప్పుడు మేనఱికమును దప్పించవచ్చును. ఇందుకుఁ బ్రమాణముగూడ శ్రీలక్ష్మీనృసింహసోమయాజులవారి ప్రవచనము.

## 12. ప్రస్తుతము పెనుగొండలోని చరిత్ర.

పెనుగొండ ప్రకృతము పశ్చిమగోదావరి జిల్లాలోనున్నది. చరిత్రాంశములు పెక్కులుగా నిప్పుడు గనిపించుట లేదుగాని, శిథిలములై పోయినట్లనేక దృష్టాంతములు గలవు. పెనుగొండ ప్రాంతములో నానాఁటి నగరస్వాములు త్రవ్వించిన తటాకములు కొన్ని గనిపించుచున్నవి. వనసరస్సు, వీరసరస్సు, మాళవము మొదలగు కొన్నినామములనుగూడ నిప్పుడు వ్యవహరింపుచున్నారు. ఆనాఁడు కుసుమశ్రేష్ఠిగారు పరిపాలించిన చిన్నచిన్న కోటలే యిప్పుడు పెద్ద పెద్ద పట్టణములైనవి. పెనుగొండ యను తెలుఁగుపేరును, సంస్కృతనామములలో, జ్యేష్ఠశైలము, బృహద్గిరి, మహాశైలము, మొదలుగా ననేకరీతులుగా నుపయోగించియున్నారు. నాటి

వీరనారాయణ మను కోటయే నేఁటి నారాయణపుర మను నగరము. అప్పటి విశాలమే యిప్పటి విశాఖపట్టణము. ఆనాఁటి యూసంటమే యీనాటి యూచంట. నాఁటి నరసనే నేఁటి నరసాపురము. నాఁటి జగన్నాథమే నేఁటి జగన్నాథపురము. అప్పటి పాలకొండమే యిప్పటి పాలకొల్లు. ఆ నాఁటి భీమమే యీనాఁటి భీమవరము. నాఁటి ఘంటసాలమే యీనాఁటి ఘంటసాల. పెనుగొండ పంచక్రోశపట్టణ మని చరిత్రలోఁ గలదు. పెనుగొండ యెటు చూచినను పది మైళ్ళ నిడివి గలిగియుండు నని కొన్ని గ్రంథములందు వర్ణింపఁబడియున్నది. ఒక శాసనమునందుఁగూడ పెనుగొండ విస్తీర్ణము సరిహద్దులు చెప్పఁబడినవి. ఆనాఁడు గోదావరి పెనుగొండ సమీపములోనే ప్రవహించియుండవచ్చును. ఇప్పుడుప చాలదూరములోనున్నది.

పెనుగొండనగరమునకు హద్దులు :—

పశ్చిమము — గోస్తనదీతీరము (అదియొక చిన్న కాలువ).

ఉత్తరము, తూర్పు — గోదావరీనది.

దక్షిణము — సముద్రము (అంతర్వేది),

పెనుగొండలో నెక్కడ త్రవ్వినను జరిత్రకు సంబంధించిన వస్తుజాలములు కొన్ని గనిపించుచున్నవట. షుమారు పది పన్నెండు సంవత్సరములక్రిందట నొకరు గృహనిర్మాణమునకై గట్టువచ్చువఱకు గోడకాలు తీయుచుండఁగా ఆఱు, ఏడు గజముల లోఁతున నొక గొప్ప దిగుడుబావి మిక్కిలి లోఁతుగలది, మంచి కట్టడము గలది కనుపించెనట! ఎన్నెన్నో కట్టడములు, గృహములు, దేవాలయమంటపములు త్రవ్వఁగాఁ గనుపించినవట. పరికింపఁగాఁ జాలవఱకుఁ బట్టణము పూడిపోయి నట్లుగాఁ దోఁచుచున్నది.

**లింగాలవీథి:**—పెనుగొండలో నూరి మధ్యభాగమునం దీ లింగాలవీథి గలదు. దీనిని బ్రస్తుతము మిక్కిలి ప్రశస్తముగాఁ జెప్పుకొనుచుందురు. నిజముగా నిది చరిత్రాత్మకమైన స్థలమే అగ్నిగుండ ప్రవేశానంతరము నూటరెండు గోత్రముల సంతతులను

గాశీక్షేత్రమునకు వెళ్ళి గంగానదిలోఁ బితృకర్మల నెఱవేర్చుకొని తిరిగి పెనుగొండకు వచ్చి గోత్రమున కొక్కటిచొప్పున శివలింగ ప్రతిష్ఠను జేసినారు. మొన్న మొన్నటిదాక నూటరెండు శివలింగము లున్నవని పెద్దలు చెప్పుదురు. కొన్ని శివలింగములు గోడలలోఁ గలిసిపోయినవి. కొన్ని పూడిపోయి యున్నవి. లింగాలవీధి మధ్యభాగములో ఆఱు పెద్ద పెద్ద శివలింగములు గానవచ్చుచున్నవి. అవి అంతగా శిథిలములుగా లేదు. అందు బజారుమధ్యలో నొక గొప్ప స్ఫటికలింగము గలదు. తెల్లని పాలరాతితోఁ జేయఁబడినది. అది షుమారు రెండు గజములయెత్తుండును. ఆ స్ఫటికలింగమునుగురించి యనేక గాథలను జెప్పుకొనుచుందురు. పైభాగమునందుఁ గొంచెము పగిలి యొక పేడు లేచిపోయి యున్నది. ఒకానొకప్పు డా శివలింగమకుటమునందు మిక్కిలి ప్రకాశవంతమైన ఒకమణి గల దట. దానికొఱకు కెందఱొందఱో ప్రయత్నించి విఫలమనోరథులైరట. ఇప్పు డది లేదు. చరిత్రకారు లెవరైనను విపులపరిశోధనను గావించినచో ననేక చరిత్రాంశములు లభించఁగలవు.

